దేశ విఖ్యాతిగాంచిన విమల్ చీరల్లో సరిక్రొత్త శ్రేణికై
విచ్చేయండి నేడే మంగళ్ దీప్ కి.




మంగళ్ దీప్

కోఠీ, హైదరాబాద్, ఫోన్ : 45786

ఆంధ్ర ప్రదేశ్ లో అన్నిటికన్నా పెద్దదైన విమల్ షోరూం

Mudra/RTI/1198 TEL




## ఎయిడ్స్

డా॥ కె. వెంకటేశ్వరరావుగారి రచన "అమెరికాలో అంటువ్యాధి ఎయిడ్స్" హైలైట్. ఆ భయంకరమైన ఎయిడ్స్ వ్యాధికి కారణభూతాలైన అంశాలను వ్యాసకర్త చక్కగా వివరించారు. స్వజాతి సంపర్కం, మత్తు పానీయాలు ఎంతో హానికరమైన అలవాట్లనీ మరొకసారి తమ వ్యాసంద్వారా వెల్లడించారు. 'అనుభవించకమునుపే ముందు జాగ్రత్త కోసం ఇటువంటి రచనకు ప్రాధాన్యత ఇవ్వవలసిన అవసరం ఎంతైనా వుంది' అనడంలో అతిశయోక్తి లేదు. వ్యాసరచయిత కె. వెంకటేశ్వరరావుగారికి చాలా థేంక్స్. ఇక తర్వాత, బి. వి. పట్టాభిరామ్‌గారి అభిప్రాయం (సాయిబాబా – వ్యాసంపై) నాకు నచ్చలేదు. యువతరానికి ఇటువంటి ఆధ్యాత్మిక చింతన కల్గిన వ్యాసాల ప్రభావం బలీయమైనది. బహు హానికరమైనది అని నా ఖచ్చిత అభిప్రాయం.

యస్. బి. వి. రమణమూర్తి,
కేరాఫ్ యస్. కాశిరెడ్డి, విశ్వనాథపురం (పాదిరి)

## ఆంగ్లనటి కాదు

"గాంధీ" చిత్రాన్ని గురించి వ్రాసిన సి. ప్రతాప్ (విశాఖపట్నం) గారి ఉత్తరంలో కస్తూరిబా గాంధీగా ఒక ఆంగ్ల నటి నటించినట్టు వ్రాసారు. అది వాస్తవంకాదు. ఆ పాత్రధారిణి రోహిణి హట్టంగడి మహారాష్ట్రకు చెందిన భారతీయ వనిత.

టి. ఎస్. చలపతిరావు (లక్నో)

## అందని ద్రాక్ష ఆనందం!

తేది 12–8–83 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో అందని ద్రాక్ష – కథను అందించి, మా ఇంటిల్లపాదికి ఆనందం పంచిన కొండముది రుక్మిణిదేవిగార్కి మా హృదయపూర్వక కృతజ్ఞతాభినందనలు.

ఇరువె నరేష్‌కుమార్, ఇతరులు
(రాయదుర్గం)

## ఈ తరం తండ్రి

"ఈ తరం తండ్రి" కథ నాకు చాలా బాగా నచ్చింది. మమ్మల్నెంతగానో ఆకట్టుకుంది. ఈ కథ నేటి సమాజానికి అతి దగ్గరగా ఉంది. బాధ్యత తెలిసిన తల్లిదండ్రులు తమ పిల్లల సంగతి పట్టించుకోకుండా వదిలిపెట్టితే జరిగే విషయాలు కళ్లకు కట్టినట్లుగా రచించిన రచయితగారికి నా ధన్యవాదాలు.

కె. సి. రామసుబ్బయ్య (మైదుకూరు)

[66వ పేజీ చూడండి]

కె.భాగ్యరాజ్

ఒకటి

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]

శుక్రవారం : 23–9–'83
రుధిరోద్గారి నామ సం. భాద్రపద బ. పాడ్యమి
**సంపుటము 76 సంచిక 2**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

విడి ప్రతి వెల రు. 1-50
ఆరు మాసాల చందా రు. 42-90
పోస్ట్‌లో ఏడాది చందా రు. 85-80
ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం విజయవాడ-520 003.

## విషయానుక్రమణిక

# పశ్చిమ బెంగాలుకి కమ్యూనిస్టులు పట్టించిన గతి

మీరు ఢిల్లీలోఉంటే, ఢిల్లీ పత్రికలు చదివితే కలియుగం వచ్చేసిందనుకుంటారు. ప్రతిరోజూ అరడజనుమంది హత్య—వీళ్లలో కొందరు ప్రభుత్వం వారిచేతా, మరి కొందరు ప్రభుత్వం బస్సులచేతా. ప్రభుత్వం బస్సులంటే ప్రభుత్వమనేకదా! బీహారు జెయిళ్లలో చనిపోయేవాళ్లకన్నా, అక్కడ చిత్రహింసకి గురి అయ్యేవాళ్లకన్నా బస్సులకింద పడి చనిపోయే, అంగవైకల్యం చెందేవాళ్ళ సంఖ్యే ఎక్కువేమో! హత్యలసంఖ్య ఇలాగ ఉంటే దోపిడీలూ ఏమీ తక్కువకాదు. ఇవి సరిగా ఢిల్లీ మధ్యలో జరుగుతూ ఉంటాయి. కొన్నేమో ప్రధానమంత్రి ఉండే 1 సఫ్దర్‌జంగ్ రోడ్‌కి దగ్గరగానే జరుగుతూ ఉంటాయి. ఈ ఇంటిని రాత్రీ, పగలూ పోలీసులు కాపలాకాస్తూ ఉంటారు. వీళ్ల సంఖ్య క్రెమ్లిన్‌ని కాపలా కాసేవాళ్ల సంఖ్య కన్నా ఎక్కువగా ఉంటుందేమో! ఇంతమంది ఎందుకు? క్రెమ్లిన్‌కి అంతమంది ఎందుకు, అందుకే. ఇక వధూ దహనాలు రోజుకి రెండు మూడు చొప్పున కలవారు ఉండే పేటలలో జరుగుతూఉంటాయి. కరెంటు కోతలు ఉన్నాయా? ఉన్నాయి. హటాత్తుగా చీకటి యుగంలోకి మారిపోతూ ఉంటాము. ఇది పురోగమనమో తెలీదు, తిరోగమనమో తెలీదు. ఈ మధ్యనే ఖిల్నానీ దంపతులని మెడ పిసికి, గొంతుకోసి చంపారు. ఇది ఒక, వేడి వేసవి రాత్రి సంభవించిన దారుణం. ఇలాంటివి ఎన్నో!

మరి ప్రభుత్వం ఏమి చేస్తోంది? ఢిల్లీ లెఫ్టినెంట్ గవర్నర్ అగ్ని ప్రమాదాల వెంటా, భవనాల నాశనం వెంటా తిరుగుతూ ఉంటాడు. ఇదంతా ఒక చిన్న మునిసిపల్ ఉద్యోగి చెయ్యవలసిన పని. [ఆయనకి ఈ ఉద్యోగం వచ్చిందంటే ఆయన స్థాయి అంత మాత్రమే ఉండి ఉండాల. ఎక్కువ తెలివి ఉంటే పయివాళ్ళు సహించవద్దూ?] ఢిల్లీకి ఒక ప్రధాన అధికారి ఉన్నాడు. ఆయన ఒక వృద్ధుడు. ఏది జరిగినా భుజాలు ఎగరేసి ఊరుకుంటాడు. వీధుల్లో శవాలు గంటలపాటు అలాగే పడి ఉంటాయి. దోపిడిల ఆచూకీ తెలీనే తెలీదు, పరిశోధనలు మధ్యలో ఆగిపోతాయి, వధువులు కాలిపోతూ ఉంటారు. గవర్నమెంటువాళ్లు ఇంకొక 'ఫ్లయి ఓవర్', ఇంకొక స్టేడియమ్ కట్టేస్తూ ఉంటారు. (పాతవాటిని వాడటమూ ఉండదనుకోండి!)

ఇక జనం తమదే ఇష్టం అనుకుని ఏమి చేసినా ఆశ్చర్యం ఏమిటి? ప్రభుత్వం స్థలం మీద ఇల్లు కట్టుకుంటారు, తమకి తోచినట్టు పగలు తీర్చుకుంటారు. అసలు సర్కారు అనేది లేనట్లే ప్రవర్తిస్తారు. ఢిల్లీలో జరిగేదే




దేశమంతటా జరుగుతోంది. అదేమిటంటే, ప్రయివేటు రంగంలో జరగవలసిన దానిని ప్రభుత్వం వాళ్లు చేస్తున్నారు, ప్రభుత్వం బాధ్యతలు కొన్నింటిని వ్యక్తులు తీసేసుకుంటున్నారు. రోడ్లు, డ్రైయినేజి, శాంతి—భద్రతలు, కొంతదాక రవాణా—ఇవన్నీ ప్రభుత్వం బాధ్యతలు. వీటిని వదిలేసి సర్కారువాళ్లు క్రికెట్టు ఆటగాళ్ల గెలిచిన రెండు నెలల తర్వాత వాళ్లకోసం "ముషయిరా"లు ఏర్పాటుచేస్తోంది, భవనాలు కట్టి అద్దెకిస్తోంది, ప్రయివేటు బజారులు కట్టేస్తోంది. ఇవన్నీ గవర్నమెంటు వాళ్లు నేరుగా తీసుకోవలసిన బాధ్యతలా?

చివరికి జరిగేదేమిటంటే ఏదీ సరిగ్గ పని చెయ్యదు. టి. వి. మీద పెద్ద కరెంటు కేంద్రాల వార్తలు వస్తూ ఉంటాయి. వాటిని గురించి చెప్పే వాళ్లు వాటిని తలుచుకుని మురిసిపోతూ ఉంటారు. కాని కరెంటు లేని ఇళ్లలో టి. వి. ఉన్నా వాటిని ఎలాగ చూస్తారు? ఈ ఇరవయి ఏళ్లలో ఢిల్లీలో కరెంటు పోని వేసవి ఒకటి నాకు జ్ఞాపకంలేదు. చీకటి, కొవ్వొత్తులూ తప్పవు. ప్రభుత్వం కరెంటుని బాగా సరఫరా చెయ్యలేదు, సరే; మరి ఈ పని ప్రయివేటు రంగానికి ఎందుకు వప్పచెప్పరాదు? సాకులకేమీ కొదవలేదనుకోండి కాని సాకులు సాకులే కదా? ఒక సంస్థకి వప్పచెప్పిన పని ఆ సంస్థ చెయ్యలేకపోతే దాన్ని ఇంకొక సంస్థకి వప్పచెప్పాలసిందే—ఇందులో సోషలిజమూ లేదు, కాపిటలిజమూ లేదు. ఇది వట్టి, సామాన్యమయిన లోకజ్ఞానం.

భారతదేశంలో సోషలిజమ్ అంటే ప్రభుత్వం – కాపిటలిజమే. పశ్చిమ బెంగాలులో కమ్యూనిస్టులు ఆరేళ్లపయిగా అధికారంలో ఉన్నారు. కలకత్తా వెళ్లి చూడండి, వారు ఏమి సాధించారో తెలుస్తుంది! "ఇలాగే ఉండనివ్వండి, మాకు వోట్లయినా పడటానికి పనికి వస్తుంది" అంటారు కమ్యూనిస్టులు చాటుగా మాట్లాడినప్పుడు.

పోయిన ఏడాది పశ్చిమ బెంగాలులో 25 కొత్త ప్రాజెక్టులకి మాత్రమే లయిసెన్సు ఇచ్చారు. దేశం మొత్తంమీద 1000 పయిగా ఇచ్చారు. అంటే పశ్చిమ బెంగాలుకి 3 శాతం కూడా రాలేదన్నమాట. అసలు ఇచ్చిన 25 లో ఎన్ని అవతరిస్తాయి?

1947 లో పశ్చిమ బెంగాలు దేశంలోకెల్లా పారిశ్రామికాభివృద్ధి సాధించిన దేశం. గుజరాత్, కర్ణాటక రాష్ట్రాలకన్నా ముందు ఉండేది. ఇప్పుడో? వాటి వెనక పడింది ఇంకాపడుతోంది.

ఆ రాష్ట్రానికి కమ్యూనిస్టులు చేసిన సేవ ఇది. వాళ్లు అధికారంలోకి రాకమునుపే వాళ్ల

**ఆగస్టు 30వ అమెరికా వ్యోమనౌక ఛాలెంజర్‌లో అంతరిక్షంలోకి పంపబడిన భారత బహుళార్థ సాధక ఉపగ్రహం ఇన్‌శాట్—1 బి.**



# లోకంపోకడ * డోమెన్













# న్యూఢిల్లీ లేఖ

కార్మిక సంఘాలు అధికారం చెలాయించేవి.

భారతదేశానికి పట్టిన దుర్గతి ఏమిటి? మితిమీరిన ప్రభుత్వం పెత్తనమే కాని [illegible] కాదు. ఒకటి ఉంటే రెండోది ఉండదు. అసలు ఏ ప్రభుత్వమయినా తన ప్రయోజనాల కోసం ఎక్కువగా తంటాలు పడుతూ వుంటుంది. అందుకని వనరుల దుర్వినియోగం తప్పదు.

తాగే నీరు ముఖ్యమా? టెలివిషన్ ముఖ్యమా? ఈ ప్రశ్నలకి సమాధానం అందరికీ తెలుసు. అయినా, ప్రభుత్వం వాళ్ళు మాత్రం కొన్ని వందలకోట్లు టి. వి. మీద ఖర్చు చెయ్యపోతున్నారు. ఈ కర్చుతో దేశంలోని 70 శాతం జనానికి టి. వి. అందుబాటులో ఉండేట్లు చేస్తారుట. "అభివృద్ధి లేదా ప్రగతి అంటే ఇదేకదా" అన్నారు శ్రీమతి గాంధీ తన స్వాతంత్ర్య దినం ప్రసంగంలో. టి. వి., అంతరిక్ష నావలూ, దక్షిణ ధ్రువ యాత్రలూ— ఇవన్నీ అభివృద్ధికి చిహ్నాలే. కాని ఎప్పుడూ భోజనం దొరుకుతుందా లేదా అని సందేహపడే సామాన్య ప్రజలకి ఇవన్నీ వైభోగాలు గానే కనిపిస్తాయి.

జనానికి ఏమీ ఇవ్వలేని ప్రభుత్వాలే ఇలాంటివి చెయ్యటానికి ప్రయత్నిస్తాయి. జనానికి. ఆసియాడ్‌కి కోట్లు కర్చు చేశారు. శ్రీమతి గాంధీ ప్రభుత్వంవాళ్లు. అలాగే తటస్థ దేశాల సమావేశానికికూడా. ఇవి రెండూ జరిగినప్పుడే దేశంలో తీవ్రమయిన దుర్భిక్షం ఉంది. ఆసియాడ్ వల్ల ఏమీ ఒరగలేదు, త. దే. స. వల్లా ఏమీ ఒరగలేదు. (కాస్ట్రోలాంటి నియంతలూ, దుండగులూ విందు భోజనాలు చేశారంతే. భారతదేశానికి క్రీడలలో ఎన్ని పతకాలు వచ్చాయి?) త్వరలోనే కామన్‌వెల్త్ సమావేశం జరుపుతున్నారు. ఇదొక తమాషా. కామన్‌వెల్త్ అనేది ఒక మాయదారి సంస్థ. ఇందులో శ్రీలంక ఒక సభ్యదేశం. ఆ దేశంలో తమిళులని చావగొడుతున్నారు. అప్పుడు శ్రీ దత్‌రావ్‌పాల్ ఏమి చేశాడు? కనీసం విమానం ఎక్కి కొలంబో వెళ్ళాడా? అబ్బే, ఆయన ఢిల్లీ వెళ్ళి వచ్చి అలిసిపోయారు. ఢిల్లీలో ఆయన ఏమి పని చేశారు? కామన్‌వెల్త్ సమావేశంలో ఏమి భోజనాలు పెడతారో తెలుసుకునేందుకు వచ్చి తమకి తోచిన సూచనలు చేశాడు ఆయన. ఇంత ఘనకార్యంచేసి అలసిపోయాడన్నమాట. ఈ ఘనుడే "పంచుకోవలసిన ప్రపంచం ఒకటే" అనే పేరుతో ఒక పుస్తకం రాసి వెలువరించాడు. అయినా ఆయన మాత్రం ఏం చేస్తాడు? సరుకులేని సంస్థల అధిపతులలో మాత్రం సరుకు ఏమి ఉంటుంది? ★

# డి. ఆర్.ఎస్*కలిగిన క్రొత్త ప్రెస్టేజ్ ఒక్కటే అత్యంత భద్రమైన ప్రెషర్ కుక్కర్

క్రొత్త **ప్రెస్టీజ్**

Patent pending

గేస్కెట్ రిలీజ్ సిస్టమ్

Prestige
PRESSURE COOKER
Cook a whole meal in minutes.

**100%**
**భద్రత**



### జి ఆర్ ఎస్ అంటే ఏమిటి?

గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ఒక విశిష్టమైన నమూనాలో రూపొందించబడింది. నీరు మరగబెట్టడం ఎంతో నిరపాయకరమో, ఈ సాధనంతో కూడిన ప్రెషర్ కుక్కర్‌తో వంటచేయడం కూడా అంత నిరపాయకరం. ప్రెషర్ కుక్కర్ మూతలో ప్రత్యేకంగా అమర్చబడిన రంధ్రంద్వారా, గేస్కెట్ అపాయకరమైన స్థితిని చేరిన ఆవిరి ఒత్తడిని అత్యంత భద్రంగా వదలివేస్తుంది జి ఆర్ ఎస్ అమర్చడంవల్ల 'క్రొత్త ప్రెస్టీజ్' పూర్తి భద్రతగల ఏకైక ప్రెషర్ కుక్కర్‌గా తీర్చి దిద్దబడింది.



### అది ఎలా పనిచేస్తుంది?

వంట త్వరగా పూర్తవడానికి ప్రెషర్ కుక్కర్లన్నీ ఆవిరినే ఉపయోగించుకుంటాయి. కొన్ని సమయాలలో కుక్కర్ లోపల ఆవిరి ఒత్తడి అవసరానికి మించి ఉంటుంది. సాధారణ పరిస్థితులలో ఈ ఆవిరి ఒత్తడి కుక్కర్ మీది వెయిట్‌వాల్వ్ రంధ్రం ద్వారా బయటకు పోతుంది. అయితే, ఆహార పదార్థాలచే ఈ రంధ్రం కప్పివేయబడినప్పుడు కుక్కర్ ప్రేలిపోయే ప్రమాదం ఉంటుంది.

'క్రొత్త ప్రెస్టీజ్'లో ఎప్పుడైనా ఆవిరి ఒత్తడి అధికమైనప్పుడు ప్రెషర్ కుక్కర్ మూతలో అమర్చబడిన జి ఆర్ ఎస్ రబ్బర్ గేస్కెట్‌ను సాగేలా చేసి అధిక ఒత్తడిని అంతర్ముఖంగా. భద్రంగా వదలివేస్తుంది.



### జి ఆర్ ఎస్ ఎందుకు అవసరం?

మీరు సేఫ్టీ ప్లగ్‌ను మార్చవలసి వచ్చినప్పుడు మీకు నకిలీది లభించవచ్చు. అవి అత్యవసర సమయాలలో సరిగా పనిచేయదు దురదృష్టవశాత్తు, సేఫ్టీ ప్లగ్ నకిలీదో, అసలైనదో మీరు గుర్తించలేరు. ప్రమాదాన్ని ఎందుకు కొనితెచ్చుకోవాలి? **జి ఆర్ ఎస్ ఎన్నడూ విఫలంకాదు**



**మామూలుగా వంటచేసే పద్ధతిలో జి ఆర్ ఎస్ జోక్యం ఉండదు.**

**ఉండనే ఉండదు. అందులో మార్చడానికి ఏమీలేదు. రబ్బర్ గేస్కెట్ ఆవిరిని వదలి పెట్టగానే మీరు చేయవలసిందల్లా శుభ్రంచేసి ఒక స్పూన్ సహాయంతో యథాస్థానానికి త్రోయడం మాత్రమే, తరువాత వెయిట్‌వాల్వ్ రంధ్రాన్ని శుభ్రంచేసి కుక్కర్ వాడండి**

చిన్నపిల్లలు సైతం నిర్భయంగా వాడగలిగే భద్రమైన కుక్కర —
అదే గేస్కెట్ రిలీజ్ సిస్టమ్
కలిగిన "క్రొత్త ప్రెస్టీజ్".

* గేస్కెట్ రిలీజ్ సిస్టమ్

**TTK తయారి.**




ప్రెస్టీజ్ . . . భారతదేశములో
ప్రెషర్ కుక్కర్‌ను ప్రవేశపెట్టినవారు




# ఆశ్రయం

## మధురాంతకం రాజారాం

"అందుకు వేరే వున్నాడులెండి! కె. వి. మూర్తి అని నా చిన్ననాటి స్నేహితుడు. చిత్రకారుడేం గాదు. కానీ ఈ లైనులో అఖండుడు. కొంతకాలం బొంబాయిలోనూ, ఢిల్లీలోనూ వుండి వచ్చాడు. కిటుకులన్నీ అతడి చిటికెన వ్రేల్లో వుంటాయనుకోండి! ఇప్పటికొక ఆరు మాసాల నుంచీ ఈ ప్లాను అమల్లో పెట్టడం కోసం నాతో సతపోరుతున్నాడు. ఆర్డర్లు తీసుకరావడం, బిల్లులు తయారు చేయడం, డబ్బును వసూలు చేయడం అతడి పని. బొమ్మలు వేసిపెట్టడం నా పని. అంటే ఏమిటి? ఆర్టు నాదైతే వ్యాపారం అతనిదన్న మాట!

*　　*　　*

ఆర్జన కోసం భవానీశంకరం తన దారిని మళ్లించి నాలుగేళ్లయింది. గారమిద్దెలో యిటుచివర, రోడ్డువైపు తెరచుకునే కొట్టులాంటి గదిలో అతడానాడు చెప్పిన తతంగమంతా ప్రారంభమైపోయింది. కె. వి. మూర్తి అన్న వ్యక్తిని గూడా నేను నాలుగైదుసార్లు చూచాను. అతడు కుర్చీలో వుంటాడుగానీ, వున్నట్టే వుండడు. మాట్లాడతాడుగానీ, మాట్లాడినట్టే వుండడు. ఇక్కడుండాలిగదా అని తిరిగిచూస్తే, ఎప్పుడో మటుమాయమై వుంటాడు. అతడి జాడ — అద్దంలోకి వచ్చి వెళ్లిపోయే నీడ. వెళ్తే ఎక్కడికి వెళ్తాడో, వస్తే ఎప్పుడొస్తాడో

### (గత సంచిక తరువాయి)

తెలియదు. వ్యాపార రంగంలో కార్యశూరుడైన వాడి తరహా బహుశా అలాగే వుండాలేమో! మరైతే కళాకారుడి స్థితి ఎక్కడికొచ్చి ఆగిందంటారు? భవానీశంకరం ఉదయం ఆరు గంటలకల్లా టీ త్రాగి వెళ్లి కుర్చీలో కూచుంటాడు. గంట పదైనా భోజనానికి పిలుపొస్తేగానీ అందులో నుంచీ లేవడు. భోజనం చేసిన తర్వాత వెళ్లి కూచుంటే బాగా చీకటి పడేదాకా పనిచేస్తాడు. రాత్రి భోజనానంతరమున్నూ అంతే! స్కేలుతో గీతలు గియ్యడం, ఫోటోలతికించడం, బొమ్మలు వెయ్యడం, అక్షరాలు దిద్దితీర్చడం, పెన్సిళ్లు జివురుకోడం, కుంచెలు సరిచేసుకోడం — అలిసిపోయినప్పుడల్లా టీలు త్రాగడం — ఇదీ వరస! కరుణామయురాలు — నిద్రాదేవత వచ్చి కనురెప్పల పైన కూచోవాలి. ఆ కాయం మెల్లగా లేచివచ్చి మంచంపైన సోలిపోవాలి.

గడచిన పర్యాయం — అంటే ఏడాది క్రితం హైద్రాబాదు వచ్చినప్పుడు తలకుమించిన బరువుతో కొండెక్కి దిగినవాడిలా భవానీశంకరం డస్సిపోయి కనిపించాడు. కళ్లద్దాలు తీసి టేబిలు పైన పెట్టి "డాక్టరుగారితో నాకు పేచీ వచ్చిందండీ!" అన్నాడు. 'ఏమిటి' అన్నట్టుగా అతడివైపు చూచాను. "ఏంలేదు. ఒళ్లంతా సలుపులు. కళ్లు మండుతున్నాయి. ఆకలి మందగించింది మాత్రలు వేసుకుంటేగానీ నిద్ర రావడంలేదు. డాక్టరుగారు కొద్ది నెలలపాటు పని మానేసి రెస్టు తీసుకోమంటున్నారు" అన్నాడు.

రిక్షాకు బ్రేకు పడడంతో ఉలిక్కిపడి బాహ్యప్రపంచంలోకి వచ్చేశాను. "రాంకోటి చౌరస్తా యిదేనయ్యా! దిగతారా" అంటున్నాడు రిక్షావాడు.

"కాదులేవయ్యా! ఇదిగో, ఈ రోడ్డంట వెళ్లు. ఇంకొక ఫర్లాంగు దూరమే" నన్నాను.

రిక్షా ఇంటిముందర ఆగింది.

రిక్షా దిగడంతోటే గమనించాను. రోడ్డువైపు తెరచుకునే కొట్టు మూతబడి వుంది. రిక్షావాడికి డబ్బులు ముట్టజెప్పి గబ గబా నడవలోకి వెళ్లి తలుపు తట్టాను. తలుపు తీసిన వ్యక్తి అపరిచితుడు. "ఏమండీ! ఎవరు కావాలి?" — గద్దించి నట్లుగా అడిగాడు.

"భవానీ శంకరం గారని..." అంటూ సగంలో ఆపేశాను "ఆయన కోసం వచ్చేవాళ్లకు బదులు చెప్పలేక మా ప్రాణాలు దిగిపోతున్నాయండీ బాబూ! ఆయన ఇల్లు ఖాళీచేశాడు. మేమిక్కడచేరి ఆరునెలలయింది" అంటూ అతడు దభేలున తలుపు మూసి గడియ పెట్టుకున్నాడు.

*　　*　　*

గుడ్డిలో మెల్లగా అప్పుడు నా దగ్గర పెద్ద లగేజీ ఏమీలేదు. సంచీ భుజానికి తగిలించుకుని రోడ్డున పడ్డాను. ఎలాగైనా ఒకరాత్రి వేగిస్తే, రేపటి సాయంకాలం నేను హైద్రాబాదు నుంచీ

వెళ్లిపోవచ్చు. అదేమంత పెద్ద సమస్య గాదు. కానీ ఆ లోపల భవానీశంకరం ఆచూకీ తెలుసుకో గలిగితే బాగుండును...ఇప్పుడతని ఆరోగ్యం ఎలా వుంది? ఎంతో దీక్షగా అతడు నిర్వహిస్తూ వచ్చిన చిత్రాల ఖార్ఖానా ఎందుకు మూత బడింది?

ఏ వైపుగా వెళ్తున్నానో, ఎందుకు వెళ్తున్నానో తెలియకుండా నేనొక రోడ్డు వెంట నడుస్తున్నాను. మధ్యలో ఒక హోటలు కనిపిస్తే అందులోకి వెళ్లి ఉపాహారం తీసుకున్నాను. హోటలు గదులకన్నా హోటళ్లే నయం. ఎంత సేపు కూచున్నా అద్దె చెల్లించమని అడగరు. ఆ మాటకొస్తే నగరాల్లో థియేటర్లయితే మరింత మేలు! మూడు రూపాయలు చెల్లిస్తే వాళ్ల మెత్తనిసీట్లో, చల్లటి గాలి క్రింద మూడు గంటలసేపు కూచోనిస్తారు. చాలని దానికి సినిమాగూడా చూపిస్తారు. యాధృచ్ఛికంగానైతేనేమి, నాకు మంచి ఉపాయమే స్ఫురించింది. మధ్యాహ్నం భోజనంచేసి ఏదైనా మాట్నీకి వెళ్తాను. రాత్రికింక ఎటూ తప్పదు గనుక లాడ్జిలో రూము తీసుకుంటాను.

కాఫీ సేవిస్తూ కిటికీగుండా వెలుపలికి చూచాను, ఇండ్ల పైకప్పుల మీదినుంచీ కొంత దూరంలో చింతచెట్ల చిటారు కొమ్మలు కనిపించాయి. కుర్చీని కిటికీకి దగ్గరగా జరుపుకున్నాను. సందేహంలేదు. అది గడచిన సంవత్సరం హైద్రాబాదు వచ్చినప్పుడు నన్ను భవానీశంకరం సిటీబస్సెక్కించి సాగనంపిన చోటు. బస్‌స్టాపు కెదురుగా రోడ్డు కటువైపున అంతస్తుకు నాలుగు వాటాలు చొప్పున, అయిదంతస్తుల బ్లాకులుగా నిర్మించిన కట్టడాలు యాభై అరవై దాకా కానవస్తాయి. కాలం ఆకాశంలో భాగమని ఐన్‌స్టెయిన్ కాబోలు అన్నాడంటారు. కాలప్రభావంవల్ల నేలపైన తావులేక మానవుడు ఆకాశంలోకి చొచ్చుకపోతున్నట్టున్నాడు. మంచిదే. ఆకాశమైనా కనిపించని అంతర్మధ్యంలో నివసిస్తున్న మానవులపట్ల మనకు సానుభూతిగూడా వుండనివ్వండి. తప్పలేదు. కానీ రోడ్డుకీవల చింతచెట్లక్రింద చింకిపాతలతో, గోనెసంచులతో, డబ్బారేకులతో వేసుకున్న పాకల్లో జీవిస్తున్న మనుషుల మాటేమిటి? మండుటెండలు కాచినా, వడగాడ్పులు వీచినా, జడివానలు కురిసినా, చలిగాలులు విసిరినా వీళ్లకు రక్షణ ఏముంది? దుమ్ములో కూచుంటారు. పేవ్‌మెంట్లపైన పడుకుంటారు. భవనాలుగా సౌధాలుగా, ప్రాసాదాలుగా, గృహాలుగా, ఇళ్లుగా పేర్కొనబడే వందలకొలది, వేలకొలది, లక్షల కొలది కట్టడాల నడుమ దప్పికతో గొంతు ఎండుకపోతున్నా త్రాగడానికి నీళ్లులేక సముద్రంవైపు బిక్కరించి చూచే నిర్భాగ్య జీవుల్లా — వీళ్లు జీవిస్తారు.

ఎట్టయెదుట కనిపిస్తున్న ఆ బృహత్ — సౌధాలను చూచి బహుశా భవానీశంకరం బాగా ఉత్తేజం పొందినట్టున్నాడు. బస్‌స్టాపులో నిల్చున్న పది నిమిషాలలోనూ నాతో చాలా విషయాలు చెప్పేశాడు.

''ఏమిటో అనుకున్నానుగానీ రాజశేఖరం గారూ, ఇప్పుడు నేను చేస్తున్న పనిగూడా నాకు అచ్చివచ్చేటట్టు లేదండీ! మునుపు 'జాబ్' చేస్తుంటే నెలనెలా వెయ్యి రూపాయలు చేతికొస్తుండేది. ఉదయం, సాయంకాలం రెండేసి గంటలు పనిచేస్తే నా ఆర్ట్‌వల్ల నాకు నాలుగైదు వందలదాకా ముట్టేవి. ఇప్పుడంతకు మించిన సంపాదనేమీ కళ్ల జూడడంలేదు. దీనివల్ల కొని తెచ్చుకున్నది అనారోగ్యం మాత్రమే. సరే, ఆ సంగతలా వుంచండి. ఇప్పుడు నా పీకలు నొక్కేస్తూ వున్నది గృహ సమస్య. ఇరవైయేళ్ల క్రితం కొత్తగా చేరినప్పుడు నేనిస్తూ వచ్చిన ఇంటద్దె మూటపాతిక. అది మూటయాభై అయింది. రెండు వందలయింది. వేలంపాటలో నేను మూడు వందల దాకా నెగ్గుతూ వచ్చాను. ఇప్పటి కయిదేళ్లనుంచీ మూడువందలే యిస్తూ వస్తున్నాను. కానీ మా యింటి ఓనరున్నాడే, ఆశాపాతకుడు. సిటీలో అతనికి పది పన్నెండు ఇళ్లున్నాయి. వాటిపైన పీల్చి పీడించి వసూలు చేసుకునే అద్దె డబ్బులే పెట్టుబడిగా అతడు నాచారంలో నాలుగెకరాలు కొంటాడు. ఎర్రగడ్డలో ఏడెకరాలు కొంటాడు. ఇంకా మాట్లాడితే బొలారందాకా వెళ్లి అక్కడ తొండలు గుడ్లుపెట్టే బంజరునేల ఏదయినా వుంటే దాన్నీ కొనేస్తాడు. ఈ మహానగరం కబంధుడు హస్తాలు చాచినట్టుగా విస్తరిస్తూ వెళ్తుందన్న రహస్యం అతడికి తెలిసినట్టు మరొకరికి తెలియదు. అదనూ, పదనూ కూడా కలిసివచ్చే సమయం కోసం పొంచివుండి అతడు కొన్న నేలపైన గిరులు వేయించి, రాళ్లు నాటిస్తాడు. అంతేనండీ సంగతులు! అతడింక చేయవలసిందల్లా, ఆ బాతులు పెట్టే బంగారు గుడ్లు ఏరుకోవడమే! ఆ మహానుభావుడి కోప వీక్షణాలు మూడేళ్లుగా నన్ను వెంటాడుతున్నాయి. అయిదు వందలిస్తావా, చస్తావా అన్నాడు. నేనివ్వనని మొరాయించాను. అతడు కోర్టుకెక్కాడు. ఇప్పటి కయిదు వాయిదాలు పడ్డాయి. ఎంత మొండికేసినా నేనీయింటిని ఎప్పుడోఒకప్పుడు ఖాళీ చెయ్యక తప్పదు. దీన్ని ఖాళీచేస్తే స్వంత యింటికే వెళ్లాలన్నది నా ప్రయత్నం. అందుకని నేనొక ప్లాను వేశాను. నా భార్య దగ్గర పది సవరన్ల బంగారముంది. దాన్నమ్మేస్తే ఎంత లేదన్నా పన్నెండు వేలొస్తుంది. మా తోడల్లుడొకాయన వున్నాడు. అగ్రికల్చరల్ డిపార్టుమెంటులో పెద్ద ఆఫీసరు. ఆయనకిప్పుడే నేను కొంత డబ్బివ్వాలి. అయినా యింకొక అయిదు వేలయినా ఆయన యిస్తాడు. నాగరాజని ఒక ప్రాణస్నేహితుడున్నాడు లెండి! అతడెప్పుడు కావలిస్తే అప్పుడు పదివేలివ్వడానికి సిద్ధంగా వున్నాడు. ఈ పాతికవేలు పెట్టి నేను సిటీలో ఎక్కడైనా ఒక పాత యిల్లే కొంటాను. బ్యాంకుల్లో నాకు చాలా మంది మిత్రులున్నారు. పాతయింటిని తనఖా క్రింద పెట్టించి, వాళ్లు నాకెలాగైనా యాభైవేలదాకా బ్యాంకు లోను యిప్పిస్తారు. కొంచెం కొంచెంగా మార్పులతో, చేర్పులతో నివాసయోగ్యంగా మలుచుకోవాలనుకొండి! అదేమంత కష్టంగాదు ...''

భవానీశంకరం వేసుకున్న ప్లానును గురించి నా అభిప్రాయమేమిటో నేను చెప్పలేదు. ఆలోగా బస్సొచ్చేసింది. కానీ యిప్పుడా పాతసంగతులన్నీ మననం చేసుకుంటూ వుండే చీకటింటిలోకి ఒక కాంతి కిరణం చొచ్చుకుని వచ్చినట్టుగా నాలో ఒక కొత్త ఊహ ననలెత్తింది. ఏమో, అలా ఎందుకు జరిగి వుండకూడదు? భవానీశంకరం ఆలోచన ఫలించే వుండొచ్చు. హైద్రాబాద్‌లో తనకంటూ ఒక స్వంత యిల్లు ఏర్పాటు చేసుకునే వుండొచ్చు ...

భవానీశంకరం గురించిన తలపు లంతటితో కట్టిపెట్టి, నేనారోజు మధ్యాహ్నం మ్యాట్నీకి వెళ్ళిపోయాను. థియేటరులోనుంచీ వెలుపలికి వచ్చి, పబ్లిక్ గార్డెన్స్‌వైపు నడుస్తుండగా పొద్దుపోయింది. రవీంద్ర భారతిని సమీపించే సరికి కళాభవన్ మెట్లపైన ఎక్కుతూ,దిగుతూ చాలా మంది కనిపించారు. వాకబుచేయగా పై అంతస్తులో చిత్రకళా ప్రదర్శనం ఏర్పాటు చేసినట్టు తెలిసింది. 'చిత్రకళ' అనగానే నాకు భవానీశంకరం జ్ఞప్తికి రావడం సహజం. అతడు ప్రదర్శనంలో వుంటాడని కాదుగానీ, కొంత కాలక్షేపమైనా అవుతుంది గదా అని పైకి వెళ్లాను. పొడుగాటి హాల్లో చాలా బొమ్మలు కనిపించాయి. చిత్రపరీక్ష రత్న పరీక్షకన్నా కఠినమని ఒక కళాకోవిదుడు రాసిన మాట ఎక్కడో చదివాను. ఆ కళను గురించి నాకు తెలిసింది చాలా తక్కువ. అయినా యిప్పుడేమయింది? నేనేమీ ఆ బొమ్మలకు వెలగట్టవలసింది లేదు గదా! కంటికి యింపైనవాటిని చూస్తూ ముందుకు సాగిపోతున్నవాణ్ణి, తలపైన పెద్ద మేకొకటి దిగ్గొట్టినట్టుగా ఒకచోట హఠాత్తుగా ఆగిపోయాను. అప్పుడక్కడ నా కంటికెదురుగా కనిపిస్తున్నది వట్టి చిత్రంగాదు. అది మా భవానీశంకరం కన్న రంగులకల! ఊహలో నిర్మించి కాగితం పైకి దింపిన రమణీయ ప్రశాంతి మందిరం. నిర్వాహకులు దానికొక కాగితంముక్కగూడా అతికించారు. ఆ చిత్రం విలువ నాలుగు వందలా యాభై రూపాయలట! ఆ డబ్బు చెల్లించి ఎవడైనా దాన్ని ప్యాక్ చేయించి చక్కా తమ యింటికి తీసువెళ్లి పోవచ్చునట!

''నాకు ఏడుపొచ్చింది. ఎవరైనా దాన్ని కొనుక్కుని వెళ్లిపోతారని మాత్రమేగాదు; నా దగ్గర అంత డబ్బు లేనందుకు గూడా!

ప్రదర్శనలో నా కాలింక ముందుకు సాగలేదు. గిరుక్కున వెనుదిరిగి క్రిందికి దిగి వచ్చేశాను.

# ఆశ్రయం

నేలమట్టం నుంచీ రోడ్డుదాకా వేసిన సోపానాలు దిగబోతున్నాను. పైకి రావడం కోసం క్రిందిమెట్టు పైన కాలు పెట్టిన భవానీ శంకరం నన్ను చూచి, అక్కడే ఆగిపోయాడు.

అతడు పైకి రాలేదు. నేనే క్రిందికి దిగాను.

అతడు నా చేయి పట్టుకున్నాడు. అప్పటి కదే పలకరింపు.

ఎక్కడకని నే నడగలేదు. అతడు నన్ను పబ్లిక్ గార్డెన్స్ లోపలికి తీసుకెళ్లాడు. దట్టంగా చీకట్లు క్రమ్ముకున్న ఓ చెట్టు క్రింద కూర్చున్నాము.

తేలిగ్గా సంభాషణ జరుపుకోడానికి వీల్లేకుండా గుండెల పైన పెద్ద బరువేదో మోపినట్టుంది.

ఆఖరుకు భవానీ శంకరమే పెదవి కదిపాడు.

"అంతా తల్లక్రిందులైపోయింది లెండి రాజశేఖరంగారూ! చేబట్టిన వ్యాసంగంలో నాకు సమాన భాగస్వామ్యముంటుందని నే నమ్ముకున్నాను. మూర్తి అలా అనుకోలేదు. అతడు నన్ను కేవలం 'ఎంప్లాయి'గానే లెక్కగట్టేశాడు. నెల నెలా ఉదారంగా జీతం యిస్తున్నాను గదా–అన్నాడు. జీతం యిచ్చిన మాట నిజమే! సిటీలో తల మాసిన ఆర్టిస్టులకేం కొదవ? అలాంటి వాళ్లను నలుగుర్ని పట్టుకుని 'కోఠీ' దగ్గర కార్యాలయం తెరిచి యిప్పుడు బ్రహ్మాండంగా బిజినెస్ నడుపుకుంటున్నాడు. నేను మాత్రం మళ్లీ నా పాత ఉద్యోగంలోనే చేరిపోయాను ..."

"మరైతే యిప్పుడు మీరెక్కడున్నారు?– గొంతుకలో కొట్టుమిట్టాడుతున్న ప్రశ్నను వెళ్ళగక్కేశాను.

"వేరే అద్దె యిల్లు దొరికిందిలెండి! విజయవాడకు వెళ్లే ట్రంకురోడ్డుపైన వెళ్లాలి. ఉండడం హైద్రాబాదులోనే! కానీ ఆ యిల్లు విజయవాడకే దగ్గరేమో! ఏమండీ రాజశేఖరం గారూ! మీరిక మీదట మా యింటికి రాలేరా?"

భవానీ శంకరం కళ్లు చెమ్మగిల్లిందీ, లేనిదీ ఆ చిమ్మచీకట్లో నాకు కనిపించలేదు. హైద్రాబాదుకే చెందినప్పటికి విజయవాడకే సమీపమనిపించే అతడి నివాసానికి నేను వెళ్లగలిగానా, లేదా అన్నదికూడా ముఖ్యమైన విషయం కాదు. రెక్కలకు దెబ్బతగిలి, దూరంగా వెళ్లలేని భ్రమరంలా నా మనసు ఎగ్జిబిషన్‌లో చోటుచేసుకొన్న భవానీశంకరం చిత్రం చుట్టే తిరుగుతూ వుంది. ఆ చిత్రాన్ని కొనుక్కోగలిగినవాడు అదృష్టవంతుడు. అందులో వున్నట్టుగా నివాసగృహాన్ని నిర్మించుకోగలిగినవాడు యింకా యింకా గొప్ప అదృష్టవంతుడు. అయితే ఇది అదృష్టవంతుల్ని గురించిన కథగాదు. ★

# తొలినాటి తెలుగు పత్రికలు - కొన్ని జ్ఞాపకాలు

## శ్రీ దేవులపల్లి రామానుజరావు

అయిదు సంవత్సరాల తర్వాత అనగా 1925వ సంవత్సరమున తెలంగాణ ప్రాంతము నుండి వెలువడి ఇక్కడి ప్రజలను జాగృతం చేసిన పత్రిక "గోలకొండ". తెనుగు, నీలగిరి పత్రికలు వారపత్రికలు కాగా గోలకొండ వారానికి రెండు పర్యాయాలు వెలువడే ద్వైవారపత్రిక. ఈ పత్రిక ఆంధ్రోద్యమానికి, జాతీయోద్యమానికి ఆయువుపట్టుగా ఉండి ప్రజోపయోగకరమైన ఉద్యమాలను సమర్థించి, ప్రాథమిక స్వత్వాల కొరకు పోరాడి తెలంగాణా ప్రజల సర్వతోముఖాభివృద్ధికి కృషిచేసింది. ఈ పత్రికా సంపాదకులు స్వర్గీయ సురవరం ప్రతాపరెడ్డిగారు. ఆయన బీఏ., బీఎల్. పట్టభద్రులు. కొంచెం కష్టపడితే న్యాయవాదిగా ఆయన మొట్టమొదటి శ్రేణిలో నిలువగలిగే వారు, కొంచెం ప్రయత్నం చేస్తే మంచి ప్రభుత్వోద్యోగం ఏదైనా లభించేది. కాని, ఈ రెండు వృత్తులను ఆయన స్వీకరించలేదు. స్వయంగా సంపన్న కుటుంబీకుడైన ఆయన, తన ఆస్తిని పెంచుకోడానికి గాని, వ్యవసాయం అభివృద్ధి చేసుకోవడానికి గాని శ్రద్ధ వహించలేదు. డబ్బు సంపాదన కొరకు పత్రికా నిర్వహణను ఒక వృత్తిగా స్వీకరించలేదు. ప్రజల అభ్యున్నతి కొరకు క[illegible]డమే పత్రిక ప్రధాన లక్ష్యంగా స్వీకరించి [illegible] జీవితాన్ని పత్రికా రచనకు అంకితం చేసిన[illegible] ఒక విధంగా ప్రతాపరెడ్డిగారికి కూడా 'ఆంధ్రపత్రిక' ఆదర్శమని చెప్పవచ్చును. ఆంధ్రపత్రికకు కొంత కాలం సంపాదకుడుగా పనిచేసిన గొప్ప విజ్ఞాని, నిష్కళంక దేశభక్తుడు, త్యాగమూర్తి గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారిని ప్రతాపరెడ్డి గారు తమ ఆదర్శంగా స్వీకరించినారు. భారతదేశానికి స్వాతంత్ర్యము వచ్చేవరకు ప్రతాపరెడ్డిగారు పత్రిక నడిపి అన్ని రంగాలలో దేశాభ్యుదయానికి పూర్తిగా తోడ్పడినారు.

ప్రతాపరెడ్డిగారు విశిష్టమైన వ్యక్తి; బహుభాషా ప్రవీణుడు, పండితుడు పరిశోధకుడు, బహుగ్రంథకర్త. తెలుగులో ప్రత్యేకమైన శైలి కలిగిన వచన రచయిత. ఆయన సంపాదకీయాలలో ఆయన స్వయంగా ప్రతిబింబించేవాడు. అప్పుడప్పుడు ఆయన స్వగ్రామానికి వెళ్లితే మరెవ్వరైనా సంపాదకీయాలు వ్రాసేవారు. ఆ సంపాదకీయాలనుబట్టి ఆయన హైదరాబాదులో లేనట్లు సులభంగా విజ్ఞులు పోల్చుకోవడానికి వీలుకలిగేది. ఇది ఆయన సమకాలికులందరికి తెలిసిన సత్యం. ప్రాథమిక స్వత్వాలకొరకు పత్రికద్వారా పోరాటం సలిపిన గొప్ప ప్రజాస్వామికవాది ఆయన. ప్రతాపరెడ్డి

( గత సంచిక తరువాయి )

గారిని అందుకొరకు ప్రభుత్వం ఎన్నియో యిబ్బందులు పెట్టి ఆటంకాలు కలిగించిన అనేక సంఘటనలు ఆయన సమకాలికులందరికి బాగుగా తెలిసినవే. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, పోలీసుచర్యకు పూర్వం 'గోలకొండ' పత్రికలో వ్రాసే సంపాదకీయాలను ప్రభుత్వ సమాచారశాఖకు పంపి ఆ శాఖ ఆమోదము పొందిన తర్వాతనే ముద్రించవలెననే నియమం అప్పటి ప్రభుత్వం విధించినప్పుడు ప్రతాపరెడ్డిగారు సంపాదకీయాలను వ్రాయడం మానుకొని, ఆ సంపాదకీయాల స్థానంలో ప్రజాస్వామికాన్ని గురించి, ప్రాథమిక స్వత్వాలను గురించి ప్రపంచ మహానాయకులు, మేధావులు వెల్లడిచేసిన అభిప్రాయాలను క్రోడీకరించి తెనిగించి ప్రకటించినప్పుడు ఆయన సంపాదకీయాలకన్న ఈ సూక్తులే అప్పటి ప్రభుత్వాన్ని మిక్కిలి ఇరకాటంలో పెట్టినవి. ఇది ప్రతాపరెడ్డిగారి శేముషికి, బహుగ్రంథావలోకనానికి, స్వతంత్ర వ్యక్తిత్వానికి, ప్రాథమిక స్వత్వాల సమర్థనకు నిదర్శనం.

ఆ రోజులలో తెలుగులో సమకాలిక సమస్యల మీద స్వతంత్రంగా వ్రాయగలిగినవారు ఉండేవారు కారు. అందుచేత ప్రతాపరెడ్డిగారే వార్తల అనువాదాలు చేసి, వివిధ శీర్షికలపైన వ్యాసాలు వ్రాసి, కొన్ని వాదోపవాదాలకు దారితీసే చర్చలు స్వయంగా రెండువైపుల కొనసాగించి, పత్రికను ప్రజలలో ప్రచారం చేయడానికి పూర్తి సమయాన్ని వినియోగించేవారు –

ప్రతాపరెడ్డిగారివలెనే తన జీవితాన్ని ప్రజల హక్కులకై పోరాటం జరిపే పత్రికకు అంకితం చేసిన మరొక జాతీయవాది మందుముల నరసింగరావుగారు. ప్రతాపరెడ్డిగారు తెలుగు పత్రికను నడిపితే ఆయన ఉర్దూ పత్రికను నడిపేవారు. ఆయన నిర్వహించిన పత్రిక "రయ్యత్". అది కొంతకాలం వారపత్రికగాను, తరువాత దినపత్రికగాను నడిచినది. నరసింగరావుగారు కూడ భూస్వాములు, న్యాయవాదులు. అయితే ఆయన వ్యవసాయంగాని, న్యాయవాదాన్నిగాని వృత్తిగా పెట్టుకొనలేదు. ప్రజల హక్కుల పోరాటానికై పత్రికను ఆయుధంగా స్వీకరించినారు. ఆనాటి స్వాతంత్ర్య యోధులకు, జాతీయోద్యమానికి 'రయ్యత్' పత్రిక పట్టుగొమ్మగా నిలిచినది. ప్రతాపరెడ్డిగారి సంపాదకీయాల వలెనే నరసింగరావుగారి సంపాదకీయాలు కూడ విశిష్టమైనవి, భావగంభీరమైనవి. శక్తివంతమైన శైలికలిగి ఆనాటి నాయకులను, కార్యకర్తలను ఉత్తేజపరిచినవి. గోలకొండ, రయ్యత్ పత్రికలను చదివి రాజకీయరంగంలో ప్రవేశించినవారు చాలామంది తర్వాత ఉన్నత పదవులను అలంకరించిరి. రాజకీయ విజ్ఞాన ప్రచారానికి, ప్రజలలో జాగృతికి ఈ రెండు పత్రికలు చేసిన





## తొలినాటి తెలుగు పత్రికలు-కొన్ని జ్ఞాపకాలు









కృషి సర్వదా సంస్మరణీయమైనది; మహోజ్వల మైనది. రయ్యత్ పత్రిక కార్యాలయం రాజకీయ నిలయమైతే గోలకొండ పత్రిక సంస్కృతికి కేంద్రంగా ఉండేది.

ఆ రోజులలో ఎన్నుకోబడిన శాసనసభలు లేవు. అందుచేత ప్రభుత్వాన్ని విమర్శించే ప్రతిపక్షాలులేవు. శాసనసభలో ప్రతిపక్షములేని లోటును తీర్చి ఈ రెండు పత్రికలు నిరంకుశ ప్రభుత్వానికి ప్రక్కలో బల్లెములై కొనసాగి, ఆనాటి జాతీయోద్యమాలను సాహిత్యోద్యమాలను బలపరిచినవి. చాలామందికి తెలియని రహస్యం ఈ సందర్భంలో ఒకటి చెప్పవలసి ఉన్నది. తెలంగాణములో అన్ని జాతీయోద్యమాలకు మార్గదర్శకులైన మహావ్యక్తి, వైతాళికుడు, ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారు కూడ పత్రికా రచయితలే. ఆయన ఉర్దూ, తెలుగు రెండు భాషలలోను ఆనాటి దేశ – సమస్యలను ప్రజలకు తెలిపి వారిని మేలుకొలిపి ప్రభుత్వానికి వివరించే ప్రబోధాత్మక మైన సంపాదకీయాలు అనేకము వ్రాసినారు. అయితే వారి పేరు సంపాదకులుగా యెక్కడా కనిపించలేదు. మరెవ్వరో సంపాదకులుగా నిర్వహించిన పత్రికలకు వారు సంపాదకీయాలు వ్రాసినారు. "ముషీర్ దక్కన్" ఆనాటి పత్రిక లలో ప్రముఖమైన ఉర్దూ జాతీయ దినపత్రిక. జాతీయ దృక్పథంతో ఆరువై సంవత్సరాలకు పైగా ఈ పత్రిక నడిచినది. ప్రజల పక్షాన నిలిచిన ఈ పత్రికకు హనుమంతరావుగారు సంపాదకీయాలు వ్రాస్తుండేవారు. 1942 సంవత్సరాన కాబోలు హైదరాబాదు నుండి మొదటి దినపత్రికగా తెలంగాణ పత్రిక వెలువడి నది. అప్పుడు సికిందరాబాదునుండి వెలువడు తుండిన ఆంగ్ల దినపత్రికకు సంపాదకులుగా ఉండిన బుక్కపట్టణం రామానుజాచార్యులవారు (బి. ఆర్. చార్య, బి. ఎ., బి. ఎల్.) ఈ పత్రికకు సంపాదకులుగా ఉండేవారు. అయితే సంపాదకీ యాలు మాత్రం హనుమంతరావుగారే వ్రాసే వారు. తెలుగులో వ్రాసినా, ఉర్దూలో వ్రాసినా హనుమంతరావుగారి సంపాదకీయాలు విలక్షణమై వారి వ్యక్తిత్వాన్ని ప్రతిబింబిస్తుండేవి. ప్రతాప రెడ్డిగారు, నరసింగరావుగారు వ్రాసిన సంపాద కీయాలలో వాడి, వేడి రెండూ ఉండేవి; కొంత తీవ్రత, అతివాద ధోరణికూడా కనిపించేవి. అయితే హనుమంతరావుగారి సంపాదకీయాలలో ఎక్కువగా వాడి, వేడి ఉండేవికావు. ఆయన గోపాలకృష్ణగోఖలే సంప్రదాయానికి చెందిన మితవాది. ఆ ధోరణే ఆయన సంపాదకీయా లలోకూడ ఉండేది. ప్రజల సమస్యలు, వాని సరియైన అవగాహన, ఆ సమస్యల పరిష్కారానికి కావలసిన సూచనలు, ప్రభుత్వ బాధ్యత ఇవన్నీ హనుమంతరావుగారి సంపాదకీయాలలో నిబిడీ కృతమై ఉండేవి. ప్రతాపరెడ్డిగారికి, నరసింగ రావుగార్కి ప్రభుత్వం నుండి చాలా పర్యాయాలు హెచ్చరికలువచ్చేవి. ఈ హెచ్చరికలు హనుమంత రావుగారికికూడా అప్పుడప్పుడు తప్పలేదు. అయితే ప్రభుత్వం హనుమంతరావుగారి అభిప్రాయాలను సులభంగా త్రోసివేయగలిగేది కాదు. అందుకు కారణం ఆయన ఉపయోగించే పదజాలం, శైలి, ధోరణి అని చెప్పవలెను.

ఈ విధంగా అప్పటి హైదరాబాదు రాష్ట్రంలో తొలి తెలుగు సంపాదకులు పత్రికా రచనను దేశ సేవకు ప్రధానంగా ఉపయోగించి ప్రజలలో జాగృతి కలిగించడానికి కృషి చేసినారు. వారి కృషికి మార్గదర్శకులలో నాగేశ్వరరావు పంతులుగారు ముఖ్యులని చెప్పవచ్చును. ఆ రోజు లలో ఆంధ్రపత్రిక అన్ని గ్రంథాలయాలలో ఉండేది. ప్రజల ఉద్యమాలతో సంబంధం కలిగే వారందరూ చదివేవారు. తెలంగాణ, ఆంధ్ర జిల్లాల మధ్య ఆంధ్రపత్రిక సేతువుగా ఉండేది; ఉద్యమాలను, సంస్థలను నిర్వహించే వారందరికి ఆంధ్రపత్రిక అవశ్యపఠనీయంగా ఉండేది. ఆనాటి నాయకులందరు ఆంధ్రపత్రికను చదివి దేశ సమస్యలను, ప్రపంచ సమస్యలను అవగాహన చేసుకొని తమ తమ రాజకీయ, ఆర్థిక, సామాజిక దృక్పథాలను అలవరచుకుని సారస్వత అభిరుచిని పెంపొందించుకున్నవారే. తెలుగువారు ఏ ప్రాంతంలో ఉన్న వారైనను, ఏ రాష్ట్రంలో నివసించే వారైనను అందరిని కర్తవ్యపారాయణు లను చేసిన మహత్తర సంస్థ ఆంధ్రపత్రిక.

నా జాతి, నా భాష, నా దేశము, వాని అభ్యుదయానికి పాటుపడుట నా కర్తవ్యం అని భావించిన దేశనాయకులు తొలినాటి పత్రికలకు సంపాదకత్వము వహించి ఉత్తమ సంప్రదాయా లనునెలకొల్పిరి. వార్తలలో యధార్థ కథనము, వ్యాఖ్యానాలలో నిష్పాక్షిక దృక్పథము కలిగి ప్రజా భిప్రాయాన్ని సక్రమంగా సరియైన పద్ధతులలో తొలినాటి పత్రికలు రూపొందించినవి. గాఢమైన అభిమానాలు, దురభిమానాలు తమకు యిష్టాలు గాని వ్యక్తులు శీలనిర్మూలన, అవకాశవాదము, సంకుచిత తత్వము మొదలైన దుష్టసంప్ర దాయాలను తొలినాటి పత్రికా సంపాదకులు ఆమడల దూరంలో ఉంచినారు –

ఒరులేయని యొనరించిన నరవర
యప్రియము తన మనంబునకగు దా
నొరులకు నవిసేయకునికి పరాయణము
పరమ ధర్మపథముల కెల్లన్.

అన్న సూక్తిని తొలినాటి పత్రికల సంపా దకులు చిత్తశుద్ధితో పాటించినారు. ఆ చిత్త శుద్ధి యీనాడు కూడ మిక్కిలి అవసరం– ●

గ్లేజ్‌డ్ టైల్స్‌లో
అనూహ్యం

బొంబే టైల్స్




తయారుచేయువారు :
బొంబే పోటరీస్ & టైల్స్ లిమిటెడ్, బొంబాయి 400 021

Market Movers/BPT/150

సీరియల్



# జీవనమురళి

## కొండముది శ్రీరామచంద్రమూర్తి

"ఏమిటి మీ తీర్మానం ?"

"ఎంక్వయిరీ లేకుండా డిస్మిస్ చేయడం అన్యాయమన్నది సారాంశం. ఆ అన్యాయాన్ని మేము సహించమన్నది మా నిశ్చయం !"

"పిల్లలేమంటారు ?" మురళీకృష్ణ అడిగాడు.

"క్రమశిక్షణ కాపాడే హెడ్‌మాష్టర్ని బర్తరఫ్ చేయడానికి ఇష్టపడమన్నారు !"

"క్రమశిక్షణ కాపాడమంటూ క్రమశిక్షణ లేకుండా హింసనాశ్రయించారు !" పరమేశ్వరం విషాదంగా అన్నాడు. "అది ఈ కాలం లక్షణంగా అనిపిస్తోంది."

పరంధామయ్య, విద్యార్థులూ మరికొంత సేపటికి వెళ్ళిపోయారు.

"ఒరేయ్ అబ్బాయీ, సగ్గుబియ్యం పరమాన్నం చేశాను. కాస్త తినిపోరా !" అంటూ కేకేసింది వర్ధనమ్మ.

"ఇప్పుడు పరమాన్నం ఏవిటే ?"

"పరమాన్నం ఒక్కటే ఏమిటి మావయ్య గారూ, ఇది గారెలు కూడా వండుకోవాల్సినంతటి శుభసమయం !" అన్నది జీవన నవ్వుతూ. "అయితే నువ్వెళ్ళి వాటికి ఏర్పాటు చెయ్ !" అన్నాడు మురళీకృష్ణ ఆమె గొంతులో గొంతు కలుపుతూ. పరమేశ్వరానికి ఓ చెంప తృప్తిగానూ వుంది. మరోచెంప ఏదో అసంతృప్తి అనిపిస్తోంది. ఏం మాట్లాడకుండా వాళ్ళననుసరించాడు.

( గత సంచిక తరువాయి )

**10**

"కిటికీ అద్దాలు రిపేర్ చేయించాలో అక్కర్లేదో తమరు చెప్పలేదు ?" మేనేజరు నాగలింగం భయం భయంగా అడిగాడు. రెండు రోజులుగా ఇంద్ర భవనంలో కళాకాంతులు కరవైనాయి. సంగీత నృత్యాలూ, సరస హాస్యోక్తులూ కనుమరుగైనాయి. విరిగిన కుర్చీలు విరిగినట్లే వున్నాయి. చినిగిన తివాచీ చినిగినట్లే వుంది. బయటి వారికి ఎప్పటికీ ప్రవేశం లేకుండా గేటు మూయించేశారు. పాటల మాలక్ష్మికి పని లేకుండా పోయింది. మూడు రాత్రులుగా ఆవిడ గదిలోకి ఇంద్రసేన్ రావడమే లేదు.

రెండు పగళ్ళూ, మూడు రాత్రులూ అయింతర్వాత ఇంద్రసేన్ తనగది తలుపులు తీసుకుని మొట్టమొదటి సారిగా హాల్లోకివచ్చాడు. అతని నోరంతా విస్కీ వాసన వేస్తోంది. అతని కళ్ళు ఎర్రగా జోతుల్లా జ్వలిస్తున్నాయి. మార్చుకోని దుస్తులు మాసిపోయి, నలిగి, తొడుక్కున్న వాడి బాధనంతా తామే మోస్తున్నట్లున్నాయి. యజమానిని చూడగానే అల్సేషియన్ తోకాడిస్తూ దగ్గర కొచ్చింది. దాన్ని చూడగానే, చేతులో వున్న హంటర్‌ని మెడలో వేసుకుని, వంగి ప్రేమగా దగ్గరకు రెండు రెండు చేతులతోనూ లాక్కుని రెండు చెవుల మధ్యనా ముద్దు పెట్టుకున్నాడు ఇంద్రసేన్. "రేయ్, నువ్వు లేకపోతే నా ప్రాణాలేమైపోయ్యేవో కదరా వాళ్ళ దగ్గర ?" పళ్ళు పటపట కొరికాడు హంటర్ ఝుళిపించాడు. "మేనేజర్ !" పెద్దగా అరిచాడు.

"ఇక్కడే వున్నాను దొరవారూ !" నాగలింగం అదిరిపడి లేచి నుంచుంటూ అణకువగా అన్నాడు.

"ఈ రెండ్రోజుల విశేషాలేవిటి ?"

"ఆ ముసలాయన స్కూల్లోకి వెళ్ళి ఛార్జి తీసుకున్నాడు. !"

"ఇంకా ?"

"వాళ్ళింట్లో వున్న పిల్ల గర్ల్‌ఫ్రెండూ కాదు, గాడిదగుడ్డూ కాదని తెలిసింది."

"ఏవిటేవిటి... మరి ఎవర్టా ?"

"ఎక్కణ్నుంచో లేచొచ్చిన బాపతని తెలిసింది !"

"ఎట్టెట్టా ?!" ఇంద్రసేన్ మరింతగా సావధానుడౌతున్నాడు. "ఇంకా వివరాలు లాగక పోయినారా ?"

"లాగుతా, లాగుతా, దొరవారు మళ్ళీకాస్త మాలోకంలోకి వస్తే, పుట్టలోంచి ఎన్నో పాముల్ని బయటకు లాగుతా !" నాగలింగం నశ్యం పట్టిస్తూ అన్నాడు.

"ఆఘోరించారు కాని...ఈ సోఫా సెట్టూ అదీ ఇట్లాగే వుంచారేం ?" ఇంద్రసేన్ కోపంగా అడిగాడు.

"ఉంచానండి !... తమరు చెప్పలేదు ?"

"చినిగిపోయిన తివాచీ కూడా అట్లాగే వుంచారేం ?"

"ఉంచానండి !– ఏం చెయ్యాలో తమరు విశదంగా చెప్పలేదు !"

"కిటికీ అద్దాలు రిపేరు చేయించారా ?"

"కిటికీ అద్దాలు రిపేర్ చేయించాలో అక్కర్లేదో తమరు చెప్పలేదు ?" భయం భయంగా అన్నాడు.

"చెప్పలేదు ! చెప్పలేదు ! మీరేమన్నా చిన్నపిల్లలా ప్రతిదీ చెప్పటానికి – మీ అంతట

**జరిగిన కథ – 7 :** ఇంద్రసేన్ పరమేశ్వరంగారిని సర్వీసునుంచి సస్పెండు చేస్తాడు. ఆయన స్కూలులో జరిగిన విషయాలన్నీ కుటుంబ సభ్యులతో చెపుతారు. తన తండ్రికి జరిగిన అవమానం విన్న మురళీకృష్ణ కోపంతో ఇంద్రసేన్ ఇంటికి వెళ్లి, తన తండ్రిని సస్పెండ్ చేయడానికి గల రీజన్స్ చెప్పమని అడుగుతాడు. ఇంద్రసేన్ సరైన కారణాలు చెప్పలేకపోతాడు. నాగలింగం పెట్టిన షరతులు విన్న మురళీకృష్ణ ఆవేశానికి లోనవుతాడు. ఇంద్రసేన్ తన మనుష్యులచేత మురళీకృష్ణను బయటకు గెంటిస్తాడు. అసలు ఇలా జరగటానికి కారణం జీవనే అన్నట్టుగా బామ్మ నిందించగా ఆమె వెళ్లిపోతుండగా బామ్మే జీవనను ఇంటికి తీసుకువస్తుంది. మురళీకృష్ణ, పరమేశ్వరం స్కూల్ స్టాఫ్‌తో కలసి యాజమాన్యంతో ఫైట్ చేయటానికి ప్రయత్నిస్తుంటారు. వీరికి విద్యార్థులు కూడా మద్దతు ప్రకటిస్తారు.

మీరు తెలుసుకుని చెయ్యలేరూ ?'' ఇంద్రసేన్ విసుక్కున్నాడు.

''దొరగారూ, అన్నీ నే చేస్తానుగానండి, ముందు నన్ను మీరు ఎప్పుడూ లేంది 'మీరూ, మీరూ, అనడం మానేద్దురూ, నాకేదో గొంగళీ పురుగు వొంటిమీద పాకినట్టుంది !''

ఇంద్రసేన్ భళ్ళున నవ్వాడు. ''ఇతర్లను మీరు మీరు అని పిలవడం ప్రాక్టీసుచేస్తున్నా నయ్యా ! ముందు నీతోనే బోణీ !''

''వద్దు బాబూ వద్దు. నా బోణీ వద్దు, మా ఇంట్లోకే అచ్చిరాదు, ఇంక మీకేం పని కొస్తుంది ? కావాలంటే పాటల మాలచ్మితో మొదలెట్టండి దొరా ! ఆడపిల్ల !! ఆటాపాటా వచ్చినపిల్ల —అదృష్టాన్నిగూడా తెస్తే తేవచ్చు!''

''ఆడదాన్ని మీరూ అని పిలవడం మన రక్తంలోనేలేదు. ఇంతకీ ఏది మాలక్ష్మి ?'' పాటల మాలక్ష్మి ఘల్లు ఘల్లుమంటూ వచ్చింది. కొప్పులో కొండ సెంపెంగల్ని గుత్తిగా తురుముకుని వచ్చింది. బుగ్గన చుక్కెట్టుకుని, కంటికి కాటుకెట్టి, మోకాళ్లపైకి చీరకట్టి, బొడ్డుకు రంగెట్టి, చెవులకు జూకాలెట్టి, తళుక్ తళుక్‌గా చమక్ చమక్, 'పిలిచావా నా బంగారు మావా?' అనుకుంటూ వచ్చింది. ''మూడు రాత్తుర్లూ మూగబోయినాయ్ ?'' అన్నది ముద్దుముద్దుగా. ''కోతులూ, కొండముచ్చులూ కల్లుతాగేయని మనం వొణ్ణంతినడం మానేత్తామా ?''

''బలే, బలేగా చెప్పారండి మహాలక్ష్మి గారూ !'' నాగలింగం చప్పట్లు కొట్టబోయి ఇంద్రసేన్ మొహం చూసి ఆగాడు.

''మాలచ్మిగారా, ఆదెవత్తె ?''

''మీరేనండీ ! — ఇవాళ్టినుండీ దొరగారు మిమ్మల్ని ఉత్తమ పురుషలోనే సంబోధిస్తారట !''

''అంటే ? కూంత అర్ధమయ్యేట్టు సెప్పండి మేనేజరుగారూ !'' పాటల మాలచ్మి తల గోక్కుంది.

''ఇహనుంచీ దొరగారు మిమ్మల్ని 'మీరూ' అని పిలుస్తారు. మిమ్మల్నేకాదు, కనిపించిన ప్రతి స్త్రీకీ నమస్కారం చేస్తారు, అన్యకాంత లడ్డంబైన మాతృభావముజేసి మరలునతడు. ఇహనుంచీ దొరవారు బ్రాందీ, విస్కీ, జిన్, రమ్, బీరు వగైరా కల్లోకూడా తాగరు. పేకాట ఆడరు.''

''ఏమిటయ్యా ఇదంతా ?'' ఇంద్రసేన్ కంగారుపడ్డాడు.

''ఉండండి దొరవారూ, నన్ను పూర్తిగా చెప్పనీండి. మీలో ఎంతో మార్పొచ్చేసింది. పాటల మాలచ్మిలాంటి అనాథస్త్రీలను చూస్తే మీ గుండె ద్రవించిపోతుంది. అందుకనే అటువంటి హతభాగినులకు మీ నీడలో వో ఆశ్రయం ఇచ్చి, పనీపాటా నేర్పి, మళ్ళీ జీవితం మీద వాళ్ళకో ఆశ కల్పిస్తున్నారు. పాంట్లూ, అమెరికన్ షర్టులూ అవతల పారేసి, పొందూరు ఖద్దరు ధోవతీ, పొడుగు చేతుల ఖద్దరు లాల్చీ తొడుక్కుంటారు. వెళ్ళేటపుడూ, వచ్చేటపుడూ బీదలకూ పైస పైసా దానం చేస్తారు.''

''నాగలింగం, నన్ను హిమాలయా పర్వతాల మీదినుండి కిందికి దూకమను, దూకుతా, కానీ ఈ పన్లు మాత్రం చేయమనకు. అవి నా వంటికి పడవు !''

''నాకూ పడవు దొరవారూ ! కానీ కొంత కాలం జనంలో మనకు పోయిన ప్రిస్టేజి మళ్ళీ మనకు వచ్చేదాకా, ఇటువంటి వేషాలు గడప అవతల మనం వేయక తప్పదు. మీరు అపర శ్రీరామ చంద్రమూర్తిలా నటించక తప్పదు!''

బరువు తీరినట్టే, గలగల నవ్వేశాడు ఇంద్రసేన్. ''అమ్మయ్య— నటించడమే గదా?— సరే, ముందు వీధి తలుపులు వేసేసిరా !''

ఇంద్రసేన్ చెప్పినట్లే చేశాడు నాగలింగం. ''కొత్త తివాచీ వేయించు, కొత్త అద్దాలు పెట్టించు, కొత్త సోఫాలు తెప్పించు. రేపు నా స్నేహితుల్ని నలుగుర్నీ పిలిచేవరికి అసలు ఏం జరగనట్టే వుండాలి !''

''అక్కడే పొరపాటు పడుతున్నారు దొరవారు. మీరు మరో అవతారం ఎత్తుతారు పబ్లిక్



దర్శనార్థం. ఆ అవతార సమయంలో ఈ పగిలిన తరిగిన సరంజామా మీకు ఇవేశే పెరగడానికి బాగా దోహదం చేస్తుంది. చూస్తూండండి !''

మర్నాటి సాయంకాలానికి రమ్మనమని తాము ఎన్నుకున్న వారందరికీ ఆహ్వానాలు వెళ్ళాయి. వూళ్ళో వున్న పెద్ద పెద్ద షాపుల యజమానులకు, ప్రముఖ డాక్టర్లకు, కొంతమంది ప్రభుత్వోద్యోగులకు, పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు, లాయర్లకు, వచ్చిన వార్నందరినీ ముక్కురిగిన గూర్ఖా, కాళ్ళు దెబ్బతిన్న కన్నదాసూ, చేతులు కట్టుకున్న నాగలింగం, విరిగిన సోఫాలతో, చిరిగిన తివాచీతో, పగిలిన కిటికీ అద్దాలతో వున్న హాల్లోనే ఎంతో మర్యాదగా కూచోపెట్టారు.

అందరికీ ఆత్రుతగా వుంది. ఎప్పుడో, ఎన్నడో తాము ఆ ఇంద్రభవన్‌లోకి అడుగుపెట్టారు. దశాబ్దాలుగా ఆ భవనానికీ తమకూ గొలుసు తెగిపోయింది. ఇప్పుడు మళ్ళీ ఆహ్వానం వచ్చింది. ఎందుకో ఈ ఆహ్వానం ?

వాళ్ళ ఆత్రుతకు సమాధానంగా ఎదుటి తలుపులు తీసుకుని ఇంద్రసేన్ ప్రవేశించాడు. ఖద్దరు ధోవతితో, ఖద్దరు లాల్చీతో, పక్కకు పెట్టుకున్న గాంధీ టోపీతో, చేతిలో నెహ్రూ ఆత్మకథతో అతను అసలుసిసలు ఆదర్శ రాజకీయ నాయకుడిలా కనిపిస్తున్నాడు. అతనందరికీ పేరు పేరున వరుసగా నమస్కారాలు పెట్టాడు.

పరమేశ్వరాన్ని చూడగానే పరుగున ఆయన దగ్గరకు వచ్చి పాదాభివందనం చేశాడు.

''ఆశీర్వదించండి మాష్టారూ !'' అన్నాడు నలుగురి ముందూ ఎంతో వినయంగా.

''ఎందుకు బాబూ?'' పరమేశ్వరం అతణ్ని బుజాలు పట్టుకుని పైకెత్తాడు. ''ఆశీర్వదించేవాడు ఆ భగవంతుడు. అభినందిచేవాడు ఈ మానవుడు'' అన్నాడు.

''నాగలింగంగారూ, అందరికీ టీలు సర్వ్ చేయించండి !''

టీలు సర్వ్ చేస్తుండగా శంకరశాస్త్రి వీణానాదం రికార్డు అందర్నీ తన్మయుల్ని చేసింది.

ఆ రికార్డు అయిపోయిం తర్వాత ఇంద్రసేన్ అన్నాడు – ''ఆహ్వానాన్ని మన్నించి అందరూ వచ్చారు. ధన్యవాదాలు. అయితే ఎందుకు మిమ్మల్ని ఆహ్వానించామో మీకు తెలీదు. తెలుసుకుందామని కుతూహల పడుతున్నారు. అవునా ? ఆ కిటికీల వేపు చూడండి !''

అందరూ యంత్రవత్ ఆ తలుపుల వేపు చూశారు.

''ఈ తివాచీని చూడండి !''

అందరూ చిరిగిపోయిన ఖరీదైన ఆ కాశ్మీరు తివాచీని చూశారు.

''ఈ సోఫాలను రోజ్ ఉడ్‌తో చేశారు మా నాన్నగారి హయాంలో. వాటిని చూడండి!''

అందరూ చిరిగిపోయిన ఆ పాతకాలపు సింహాసనం ల్లాంటి సోఫా కుర్చీలను చూశారు.

"ఇవి ఇట్లా కావటానికి కారణం నేనే!"

పరమేశ్వరం ఆశ్చర్యానికి అంతులేదు. ఇంద్రసేన్ లో ఏవిటీమార్పు? అందరూ 'మీరా?!' అంటూ నోళ్లు తెరిచారు విస్మయంతో.

"అవును. నేనే! నా అహంకారంతో దేవుడిలాంటి మాష్టారు పరమేశ్వరంగారిని అవమానించాను. దాంతో ఆయన శిష్యులకు, సహాధ్యాయులకు కోపం వచ్చింది. నాకు తగిన విధంగా బుద్ధి చెప్పారు. నా తప్పును పదిమంది ముందూ ఒప్పుకోటానికి, ఇహమీదట ఏం చెయ్య నిర్ణయించుకున్నానో తెలియజెప్పటానికి మిమ్మల్నందర్నీ శ్రమ పెట్టాను!"

"శ్రమేం లేదు!"

"మీలో మార్పు మా కెంతో ఆనందంగా వుంది!"

రకరకాల కామెంట్స్. పలు విధాలుగా ఇంద్రసేన్ను ప్రశంసలు, కృతజ్ఞతలు.

"మగవాడికి స్త్రీయే ప్రలోభం. స్త్రీకి బంగారం ప్రలోభం. మగవాడు తన ప్రలోభానికి లోనై స్త్రీని ఆటవస్తువుగా వాడుకుంటున్నాడు. డబ్బుకోసం ఆడది మగవాడికి ఆటకత్తె, పాటకత్తె అవుతోంది. నేను వీలయినంతవరకూ ఆ దురన్యాయాన్ని అరికట్టదల్చుకున్నాను. అట్లా పతనమైన స్త్రీలకో మార్గం చూపించదల్చుకున్నాను. అందుకు మీరు నాతో సహకరిస్తే...!"

"తప్పకుండా!" ఎన్నో కంఠాలు వంత పలికాయి.

"నాగలింగంగారూ!" అంటూ ఇంద్రసేన్ పిలిచాడు.

"మహాలక్ష్మిని పిలవమంటారా?" అంటూ ముందుకు వచ్చాడు నాగలింగం.

"మహాలక్ష్మిగారూ అనండి నాగలింగం గారూ! స్త్రీ అంటే ఎవరనుకున్నారు? మన తల్లి, చెల్లెలు, కూతురు. దురదృష్టవశాత్తూ ఈ ముగ్గుర్నీ మర్చిపోయి ఆమెను ప్రియురాలుగానే మనం భావిస్తున్నాం. టూ బ్యాడ్!"

పాటల మాలచ్మి వంటినిండా చీరకట్టుకుని ముక్కున పుడక పెట్టుకుని, జుట్టు ముడిగా చుట్టుకుని, పమిట కప్పుకుని, తల వంచుకుని వచ్చింది.

"ఈమె ఒక అభాగ్యురాలు. నాకు రైల్లో కలిసింది. ఏ దారీ లేదంటే నా ఇంటికి తీసుకు వచ్చాను. అద్భుతమైన కంఠం. ఈమెకు త్యాగరాజునూ, రామదాసునూ, క్షేత్రయ్యనూ నేర్పిస్తాను. ఈమెలాంటి వారికోసం ఈ క్షణమే నా ఆస్తిలో నాలుగో భాగం దానంగా ప్రకటిస్తున్నాను. ఎవండీ మహాలక్ష్మిగారూ, దయచేసి ఓ పాటపాడి నేను చెప్పింది అబద్ధమో నిజమో నిరూపించరూ?"

మాలచ్మి జవాబు చెప్పకుండా తలూపి, దూరంగా వెళ్లి ఓ కుర్చీమీద కూచుని బంగారి మామ పాట ఒకటి పాడింది. మాటలు అపశబ్దాలుగా వున్నా: రాగంలో లోపాలున్నా, స్వరంలో వున్న తీయదనం వాళ్ళందర్నీ కట్టిపడేసింది.

"మీరు తలపెట్టిన మహాత్కార్యానికి నాదీ ఓ చిన్న విరాళం- పదివేలు!!" అన్నాడు మర్చంట్ ఛాంబర్ ప్రెసిడెంటు మహంకాళయ్య.

"నాదీ వో అయిదేసుకోండి!" లయన్స్ క్లబ్ ప్రెసిడెంటు అన్నాడు.

ఫారెస్ట్ గూడ్స్ ఎక్స్‌పోర్ట్‌లో రెండు చేతులా సంపాదించిన వో కాంట్రాక్టరు ముందుకు వచ్చాడు. "దొరవారూ, సంతకం పెట్టి అంకె వేయని చెక్కు మీకదిస్తున్నా. ఎంత కావాలో మీరే వేసుకోండి.!"

పదినిముషాలు కూడా పట్టలేదు విరాళాల వర్షం ఆ ప్రదేశాన్ని ముంచెత్తటానికి. కొందరు చెక్కులు, మరి కొందరు వాగ్దానాలూ ఇస్తే, ఇంకా కొందరు చేతినున్న ఉంగరాలు తీసిచ్చారు.




నాటి నన్నింటినీ వొడుపుగా మూటకట్టాడు నాగలింగం.

"నేను తలపెట్టిన మహత్కార్యానికి మీరందరూ ఇంతగా ఆమోదాన్ని ప్రకటించి, విరాళాలందించడం చూస్తే మానవుడి మంచితనం మీద, భగవంతుడి కారుణ్యం మీద నా నమ్మకాన్ని ఎక్కువ జేస్తున్నది. తలపెట్టిన అభాగ్యుల కళాలయానికి నా కన్నా సమర్థులైన మరో వ్యక్తి నిర్వాకుడుగా వుండాలని అభిలాష పడుతున్నాడు. ఆ వ్యక్తి ఎవరో చెప్పగలరా?"

"మీకన్నా సమర్థులెవరు దొరవారూ?" నాగలింగం ప్రశ్నార్థకంగా నొసలు చిట్లించాడు.

"మీరే సమర్థులు!!" సభలో పదిమందీ అన్నారు.

"అందరికీ పూజ్యులూ, పెద్దలూ పరమేశ్వరం మాష్టారున్నారు. వారి అబ్బాయిగారు యూనివర్సిటీలో యం. ఏ చదివి వచ్చిన మురళీకృష్ణగారు వారి దగ్గరున్నారు. నిప్పుకు చెదలంటవచ్చు కానీ వారు ఉభయులూ మాత్రం కలలో కూడా స్వార్థం తెలియని మనుష్యులు, హాస్యానికైనా అబద్ధం ఆడని మనుష్యులు. పరమేశ్వరం గారిని నా రిక్వెస్టును మన్నించి నా కళాలయాన్ని నిర్వహించమని వేడుకొంటున్నాను. వారి అబ్బాయిగారితో కూడా చెప్పమనీ, ఒప్పించమనీ కోరుతున్నాను."

ముందు పరమేశ్వరం అందుకు ఒప్పుకోలేదు కాని, కాదూ కూడదని వచ్చిన వారందరూ అందుకు బలవంతం చేయడంతో చివరకు ఒప్పుకోక తప్పలేదు.

"అబ్బాయితో కూడా చెబుతానులెండి, మరి వాడేమంటాడో?" అన్నాడు మళ్ళీ.

"మీరు చెబితే అవునంటాడు!" మహంకాళయ్య అన్నాడు.

పరమేశ్వరం అంగీకారం ఇచ్చిన తర్వాత, ఇంద్రసేన్ విరాళాల మూటను ఆయన దగ్గరకు తీసుకు వచ్చి, ఎంతో నమ్రతగా అందించాడు. "ఇది మీ దగ్గరే వుంచండి."

"నా దగ్గరెందుకు బాబూ? తమదగ్గరే వుంచండి మొత్తాన్ని."

"తమ దగ్గర వుంచడమే సబబు. ఒకటి రెండు రోజుల్లో ఈ కళాలయానికి ఓ కమిటీ వేద్దాం. ఆ కమిటీ కో ట్రెజరరూ, సెక్రటరీ వుంటారు గదా! మీరీ సొమ్మును అప్పుడు బ్యాంకులో వేస్తే, ఖర్చులు వగైరా వాళ్లు చూసుకుంటారు."

"అంతవరకూ తమ దగ్గర వుంటేనే భద్రమనీ...!"

"వద్దు మాష్టారూ! కుడిచేత్తో చేసిన దానం ఎడంచేతికి తెలియకూడదు. ఈ డబ్బు నా దగ్గర వున్నప్పట్నుంచీ 'ఇది నేను చేశాను.' అనే అహంభావం నాకు కలుగుతుంది. అట్లా కలగడం నాకు ఇష్టంలేదు. కళాలయం ఒక ఆలయం కావాలి. ఎంత తొందరగా మీరా పని చేస్తే, అంత తొందరగా మహాలక్ష్మిగారినీ, వారి వంటి వారినీ అందులో జేర్పించేద్దాం! ఏమంటారు?"

అనడానికి పరమేశ్వరానికి ఏమీ మిగలలేదు. ఆ డబ్బు మూటను అందరిముందూ తీసుకోక తప్పలేదు. డబ్బును అతను లెక్కపెట్టనూ

లేదు. దానివైపు కన్నెత్తి అయినా చూడనూ లేదు. సభ ముగిసిన సూచనగా మరోసారి అందరూ వేడి తేనీరు పుచ్చుకున్నారు.

అభివాదాలతో సెలవు పుచ్చుకున్నారు.

"ఉండండి మాష్టారూ! కన్నదాసూ, నాగలింగం మిమ్మల్ని కార్లో దిగబెడతారు. దగ్గరున్నది పాపిష్టి డబ్బు కదా!" అన్నాడు ఇంద్రసేన్.

మహంకాళయ్య అన్నాడు "అక్కర్లేదు దొరవారూ, నా [illegible] సిడర్ వుందికదా, డ్రాప్ చేస్తాను!"

"అట్లాగే చెయ్యండి. మాష్టార్ని మాత్రం నడిపించకండి!"

పరమేశ్వరం, మహంకాళయ్య, షాపుల యజమానులూ, డాక్టర్లూ, లాయర్లూ, ప్రభుత్వోద్యోగులూ అందరూ వెళ్ళిపోయారు.

ఇంద్రభవన్‌లో గేటు దగ్గర గూర్ఖా, వాకిలి తలుపు దగ్గర కన్నదాసూ, కన్నదాసు ప్రక్కన అల్సేషియన్, లోపల చేతులు కట్టుకుని నాగలింగం, కళ్ళు మూసుకుని ఆలోచిస్తూ ఇంద్రసేన్, అతనివేపే అరమోడ్పు కన్నులతో చూస్తూ వయ్యారాల పాటల మాలచ్మి మిగిలారు.

ఇంద్రసేన్ కళ్ళు తెరిచాడు. "ఏవయ్యా నాగలింగం, నువ్విక్కడే వున్నావా?" అన్నాడు ఆశ్చర్యంగానూ, కోపంగానూ.

"తమరింకా చెప్పలేదని... !"

"ఆ డబ్బును ఆ ముసిలిమేస్టరు ఎక్కడ పెడుతున్నాడో ఏమో... !"

"అర్థమైంది దొరా! ఈ సంగతి తెలిస్తే, వాళ్ళతోనే వెళ్ళేవాణ్ణి కదా?" వివారంగా అన్నాడు.

"అందుకనేగా నిన్నూ, కన్నదాసునూ కారులో వెళ్ళమని అన్నదీ?"

"పోన్లెండి, కారు ఇంకా ఎంతో దూరం వెళ్ళివుండదు. ఇప్పుడే వస్తాను. వాళ్ళను కలుసుకుంటాను. ఆ మాష్టారి ఇంటిదాకా వెళ్ళి వస్తాను. మళ్ళీ వాళ్ళను కలుసుకొనేందుకు ఏదో కారణం చెబుతాను!"

నాగలింగం తన చేతికర్ర తీసుకుని గబగబా బయటకు వెళ్ళిపోయాడు. ఆ చేతికర్ర లోపల దాగివున్న పిడికత్తి సంగతి ఎవరికి తెలుసూ? తెలిసివున్న ఇంద్రసేన్ చూసికూడా మాట్లాడలేదు. పెద్ద హాల్లో ఉజ్వలంగా వెలుగుతున్న దీపాలను ఒక్కటొక్కటిగా ఆర్పేసింది మాలచ్మి. ఒకటి రెండింటిని మాత్రం స్పాట్‌లైట్స్‌గా అట్టే పెట్టింది. వాటి కాంతి ముద్దలో, గంభీరంగా కనిపిస్తున్నాడు ఇంద్రసేన్. అతని ప్రక్కనే ముద్దుగా కూచుని, "ఏం పుచ్చుకుంటారు?" అని అడిగింది ఆమె.

"కాక్‌టెయిల్ట్రా!"

మాలచ్మి రమ్మూ, బ్రాందీ కలిపి పట్టుకొచ్చింది. "మా స్ట్రాంగు సామీ ఇది?" అన్నది.

"అదే కావాలే! నా హృదయం భగ్గున మండిపోతున్నదే — మండిపోతున్నది! నా ఇంటిమీదకు దాడిచేయిస్తాడా ఆ కోన్‌కిస్కా? అల్ఫాట్ నెత్తిన దమ్మిడీపెడితే ఏగాని చెయ్యవు వాళ్ళ బతుకులు! వాళ్ళా ఈ దివాణాన్ని ఎదిరించేది? స్కూలు ఆ ముసిలాడిదా? ఆ పిల్లకుర్రాడిదా? నేను చీర కొనిస్తే ఆ పిల్లకు పనికిరాలేదా? నా స్కూల్లో నేను పాగతాగకూడదా?"

అతను పెగ్గుమీద పెగ్గు తాగుతున్నాడు. తాగుతున్నకొద్దీ అస్తవ్యస్తంగా మాట్లాడుతున్నాడు. మాటల్లో తన గుండె బరువు కొంత దించుకున్నాడు.

"ఆ ముసిలాడి బతుకు బండలు జేస్తాను. ఆ కుర్రాడి పొగరణుస్తాను. ఆ పిల్ల అందాన్ని బొట్టు బొట్టుగా పీలుస్తాను."

"ఆ పిల్లనేవన్నా చెయ్ మావా, నా సంగతేం చెబుతావ్ అని!"

"నువ్వు నా పాటల చిలకవి, నా ప్రేమ గూటి రామచిలుకవి, నా వన్నెల చిలకవి..."




"సిలక్కూడా ఓ గోరువంక కావాలి దొరా! ఎగిరిపోయే గోరువంకకాదు, మోజు తీరగానే పారిపోయే పిరికి గోరువొంక కాదు, గట్టిగా కౌగలించుకుని, ముద్దులెట్టి మురిపెం చూపి పక్కకు తప్పుకునే గోరువంకకాదు, తనకు తల్లితనం ఇచ్చే గోరువొంక! గూటిలోని సల్లదనం అందించే గోరువొంక, గుండెలోని వెచ్చదనం పట్టియిచ్చే గోరువొంక" ఆమె కంట్లో కనిపించకుండా కన్నీరు కనిపించింది.

"వొద్దొద్దు. కన్నీరెట్టుకోమాకు. నిన్ను మహరాణిని చేస్తా. నా మాట నమ్ము!" సేన్ మాట ముద్దముద్దగా వచ్చింది. ఆమెను అమాంతం గుండెలకు హత్తుకున్నాడు. ఆమెకు ఊపిరి సలపకుండా ముద్దులతో ఉక్కిరి బిక్కిరి చేశాడు. ఆమెకు మరో ఊహ రాకుండా చేశాడు.

కాలం వారిపట్ల స్తంభించింది. కన్నదాసూ, అల్సేషియన్ కుక్కా కళ్ళు మూసుకుని కునికిపాట్లు పడుతున్నారు. ఎంతసేపు వాళ్ళట్లా ఏగతలో వున్నారో వాళ్ళూ మర్చిపోయారు.

బయటకు హడావిడిగా వెళ్ళిన నాగలింగం, ఎంత హడావిడిగా వెళ్ళాడో అంత హడావిడిగానూ తిరిగి వచ్చాడు. తిరిగి వచ్చి "దొరవారూ!" అంటూ పిలిచాడు.

ఇంద్రసేన్ కళ్ళు తెరిచాడు. పాటల మాలచ్మి ఇంకా అతని గుండెలమీదే వుంది. ఆమె వులిక్కిపడి, చీర సర్దుకుని పక్కకు జరిగి కూచుంది.

"ఏం జరిగింది?" ఇంద్రసేన్ అసహనంగా అడిగాడు.

"ఇదిగో దొరా, డబ్బులసంచీ!"

"అరె — ఏం చేశావ్ ఆ ముసివాణ్ణి? — చంపేశావా?"

"చచ్చివుండడులెండి! ఒక్క దెబ్బకే మూలుగుతూ కిందపడిపోయాడు!"

"దెబ్బతిన్నవాడు కొట్టినవాణ్ణే గుర్తుపెట్టుకుంటాడు. నిన్ను చూశాడేమో?"

"అంతా చీకటి దొరా! అతనికి దెబ్బ ఎక్కడ తగిలిందో నాకే కనిపించలేదు. దెబ్బ తినడం మాత్రం తిన్నాడు. 'పరమేశ్వరా!' అంటూ కిందపడిపోయాడు. పడిపోయేముందే అతని చేతిలోవున్న డబ్బుసంచీని లాగేసుకున్నాను!"

"ఎట్లా?" మాలచ్మి ఆసక్తిగా అడిగింది.

నాగలింగం వికృతంగా నవ్వాడు. "ఏముందీ? వెరీ సింపుల్. మహంకాళయ్య కారు ఆయన్ని ఆయన సందు మొగదల దింపి వెళ్ళిపోయింది. 'ఇంటి దాకా వస్తాం తోడుగా' అన్నారు వాళ్ళు. 'అక్కర్లేదు — అక్కర్లేదు. సందు చివరేగా ఇల్లు.' అన్నాడా ముసిలాయన. నాలుగడుగులు వేశాడో లేదో దీపాలారిపోయాయి. అటూ యిటూ గుబురుగా చెట్లు. చెట్ల నీడల్లో చీకట్లు. మనిషి అలికిడిలేదు. వెనగ్గా అడుగులో అడుగేసుకుంటూ వెళ్ళాను. ముందున్న అలికిడిని బట్టి ఒక్క దెబ్బ వేశాను. ఆయన కుప్పకూలి పోయాడు."

"ఎట్లా కొట్టావ్? కర్రతోనా?... లోపలున్న...!" ఇంద్రసేన్ మాట పూర్తి చేయలేదు.

"అంత అవసరం రాలేదు దొరా! కర్ర దెబ్బే సరిపోయింది! ముసలి ప్రాణం కదా?"

"మాలచ్మీ! నాగలింగానికి ఓ పెగ్గి! ఆ బుర్ర నాక్కావాలి, శకుని మావ బుర్ర!!" అన్నాడు.

నాగలింగం పొంగిపోతూ అందుకున్నాడు గాజులచేతి నుండి నిషాద్రవాన్ని. ఇంద్రసేన్ డబ్బు సంచీ విప్పి కొన్నినోట్లుతీసి అతనిమీదకు విసిరివేశాడు. "తీసుకో పెగ్గువేసుకున్నావ్‌గా ఇంటికి వెళ్ళు. ఇంట్లో ఖుషీ చేసుకో. వెళ్ళు!" అతను మాలచ్మితో లోపలికి వెళ్ళిపోయాడు. నాగలింగం బయటికి నడిచాడు.

(ఇంకా వుంది)

# న్యూట్రముల్ శక్తి.

## ఛాంపియన్లు ఎంచుకునేది యిది.

న్యూట్రముల్. సమృద్ధి అయిన అమూల్ పాలు, ఎంచిన మాల్ట్. ఆరోగ్యాన్నిచ్చే విటమిన్లు, పుష్టినిచ్చే ప్రోటీన్లు. అత్యవసరమైన ఖనిజాలు. ఉల్లాసాన్నిచ్చే చాక్లెట్... యివన్నీ గూడా బోర్న్‌విటా, బూస్ట్, మాల్టోవా కన్నా చాలా తక్కువ ధరలో. మరో విషయం గుర్తుంచుకోండి, కేవలం న్యూట్రముల్‌కే ఐ ఎస్ ఐ నాణ్యతముద్ర వుంది.

**మరింత పొడుగ్గా, బలంగా, పుష్టిగా అవడం ఎలా?**

కనివిని ఎరుగని శక్తినిచ్చే పుస్తకపు కానుక!

To: Nutramul, P.O. Box 10148, Bombay 400 001. nn

ప్రియమైన న్యూట్రముల్,

దయయుంచి నాకు దారాసింగ్ గారి 'హైట్ ఇన్‌క్రీజ్ స్ట్రెంగ్త్ అండ్ ఫిట్‌నెస్' పుస్తకం పంపించండి. నేను రు. 1-50 పోస్టేజీ స్టాంపులూ. న్యూట్రముల్ 500 గ్రా. డబ్బా కొన్న క్యాష్ మెమోనీ జతపరుస్తున్నాను. సరుకు సరుకు వున్నంతవరకే యీ కానుక అని నాకు తెలుసు.

పేరు ________________ (పెద్ద అక్షరాలలో)

అడ్రసు ________________________________






మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లి.
ఆనంద్ 388 001.



daCunha/GCM/76/TL/

# బండ్లు ఓడలౌ!.. ఓడలు బండ్లౌ!..




## భానుమతీ రామకృష్ణ

*(గత సంచిక తరువాయి)*

**ఆ** తర్వాత అన్నపూర్ణమ్మ కోడలు వేరే కాపురం పెట్టడం, అన్నపూర్ణమ్మ ఇంటి నుంచే ప్రతి రోజూ పాలూ, నెయ్యీ మొదలుకుని అన్నీ చివరకు మనవడికీ, కొడుక్కీ ఇష్టమైన పాలకోవా బాదంకోరుదాకా ఆప్యాయంగా చేసి పనివాళ్లకిచ్చి కార్లో పంపించేది. అప్పుడప్పుడూ వెళ్లి కొడుకునీ, మనవణ్నీ చూసి వచ్చేది. శని, ఆదివారాలలో మనవడు నానమ్మ దగ్గరే ఉంటానని పట్టుబట్టి వచ్చి ఉండడం మొదలు పెట్టాడు. అలాగే అన్నపూర్ణమ్మ కొడుకు ఆఫీసు వదిలిన తర్వాత భార్యకు తెలీకుండా తల్లిదండ్రుల్ని తరచు చూసివెళ్తూ, తండ్రికి మందులూ, టానిక్కులూ కావాల్సినవి తెచ్చి ఇచ్చేవాడు. నెమ్మదిగా అన్నపూర్ణమ్మ మనసు కాస్త ఊరటజెందుతూ వచ్చినా భర్త ఆరోగ్యం పరిస్థితి నానాటికీ విషమించింది. యింత సంపాదించీ, పేరు ప్రతిష్టలుండీ — కొడుకూ, కోడలూ వేరే కాపరం అద్దె ఇంట్లో పెట్టడం ఆయనకు నయంగాని మనోవ్యాధిగా పరిణమించిందని ఏడ్చేది అన్నపూర్ణమ్మ. చివరకు అన్నపూర్ణమ్మ భర్త పోయాక మనవడు అరవింద్, తండ్రితో మాట్లాడి తల్లిని ఒప్పించి, నాయనమ్మ దగ్గరే వుండే ఏర్పాటు చేశాడు. కాలేజీకెళ్తున్నప్పటికీ అరవింద్, అన్నపూర్ణమ్మకు ఏం కావాలో అతి శ్రద్ధగా కూరగాయలు మొదలుకొని పనివాళ్ళున్నా తనే సైకిల్‌పై నాయనమ్మకు నచ్చినవన్నీ తెచ్చేవాడు. అన్నపూర్ణమ్మ ఆనందపడుతూ ఫోన్‌లో మా అత్తగారితో చెప్పేది. కొడుకూ కోడలూ తిరిగి వచ్చినా ఇంట్లో పట్టీపట్టనట్టుండేది భారతి! కొడుకు భారతికి భయపడి చాటుగా తల్లి యోగక్షేమం చూసేవాడు! విధిలేక పుట్టింటివాళ్ల చీవాట్లుపెట్టి పంపితే మళ్లీ అన్నపూర్ణమ్మ ఇంటికొచ్చిందేగాని ఆ ఇంట్లో క్షణం వుండేదికాదు!

అలాంటి అన్నపూర్ణమ్మ కోడలు భారతి అత్తగారై నేనూ అత్తగారైన తర్వాత భారతిని చూట్టం పడనేలేదు. అరవింద్ పెళ్ళిలో కలుసుకున్నాం. మా అబ్బాయి పెళ్ళిలో కలుసుకున్న తర్వాత చాలా కాలం తర్వాత భారతి ఫోన్ చేయడం; అదీ కోడలిమీద కంప్లయింట్‌తో. నాకు గతం అంతా బుర్రలోకొచ్చి తేరుకొనేసరికి చాలాసేపు పట్టింది.

ఇంతసేపూ భారతి ఏదో కోడల్ని గురించి చెప్తూనే వుంది. కాని, భారతి ఒకప్పుడు అత్తగార్ని పెట్టిన అవస్థలు ఆలోచిస్తూ నేను భారతి చెప్పేది చెవినే వేసుకోలేదు. అంతవరకూ ఏం చెప్పిందో వినని నేను ''పెళ్లాం మాట విని అరవింద్ దాని ఇష్టానికి తైతక్కలాడుతున్నాడు!...'' అంటున్న భారతి మాటలు విని, నాకు పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వొచ్చింది. ''హిస్టరీ రిపీట్స్ ఇట్ సెల్ఫ్,'' అన్నాను.

''వాట్! అంటే— నా కోడలు చేసేది నాక్కావాల్సిందే అంటావా?'' అన్నది ఉక్రోషంతో.

''అబ్బే! అలా అనలేదూ. అరవింద్ బుద్ధిమంతుడు గదా! అంత అవివేకంగా నడుచుకోడే అన్నాను... అంతే ...''

''అదంతా నాకు తెలీదు. వాళ్ళు నువ్వు రావాలంటున్నారు మధ్యవర్తిగా. నేను మాట్లాడగూడదట! నువ్వు వచ్చి న్యాయం చెప్పాలట. ఏది ఏమైనాసరే— నేను వాళ్లను అమెరికా వెళ్లనివ్వను! అంతగా వస్తే వాళ్ల కాళ్లూ చేతులూ విరగ్గొట్టిపడేస్తానుగాని, వాళ్లను గడప దాటనివ్వను తెలుసా? — నేను మా అత్తగార్ని కాను — నేను అనుకున్నది చేస్తాను!'' అంటూ ఇంకా అహంకారం చావని భారతి ఆవేశంతో చెప్తుంటే—

''మధ్య నాకేమిటే విషమపరీక్ష!'' అన్నాను.

''అరవింద్‌కి నువ్వంటే ఎంత అభిమానమో తెలుసుగా! 'ఆంటీ రావాలి. అప్పుడే నే మాట్లాడుతా నీతో', అని మొండిపట్టు పట్టాడు. అదీ నేనే పిలవాలట నిన్ను. అందుకే అర్జంట్‌గా ఈ విషయం అటో ఇటో తేల్చడానికే నిన్ను రమ్మంటుంది. మా అత్తగారూ, వాడూ, అదీ ఒకటే! మావారు నోరెత్తరు!''

నాకు నవ్వొచ్చింది ... ఆయనెప్పుడెత్తాడు గనక నోరు! పాపం భారతి చెప్పింది వినడానికే అలవాటుపడ్డ భారతి మొగుడి నోరు ఏ నాడో మూతబడ్డాది!...

''పోనీ నువ్వు వాళ్లతో అమెరికా వెళ్లరాదూ! అలా దేశాలు చూట్టం మోడరన్ లైఫ్ అంటే నీ కిష్టం కాదా?''

''నే నక్కర్లేదట! వాళ్ల నాయనమ్మని తీసుకెళ్తారట!... నేను కావాలంటే పుట్టింటి కెళ్లచ్చట! లేకపోతే మరో అద్దె ఇల్లు తీసుకుని బాడుక్కుండచ్చట! చూశావా పొగరు! ... దీని కంతటికీ మా అత్తగారి సపోర్టు గూడా

వుందని నా అభిప్రాయం వెనక నుంచి ! ... నా మీద పాత కసి తీర్చుకోవడానికే ఈ పన్నాగం పన్నిందేమో ?'' అంటూ భారతి చెప్తూంటే, పాపం అన్నపూర్ణమ్మగారి ఫ్రెండ్ మా అత్తగారు గూడా లేరే ఆమెను సపోర్ట్ చేయడానికి అనిపించింది.

''సరే ఇప్పుడేం చేయాలట నేనొచ్చి ? ఇది మీ కుటుంబ సమస్య గదా ? అరవింద్ చిన్న పిల్లవాడుకాడు. పైగా భార్య తెలివైందటు న్నావు గదా ! నీవు అన్నీ తెలిసిందానివి. మధ్య నేనొచ్చి ఏం చెయ్యగలను !''

''అదంతా నాకు తెలీదు! అరవింద్ ఆంటీ రావాలి నువ్వే పిలవాలి అంటూ పట్టుబట్టాడు ఎందుకో !''—నాకిప్పుడు అర్థమైంది ! భారతి కొడుకు అరవింద్ ఒకప్పుడు తన తల్లి అన్నపూర్ణమ్మను పెట్టిన అగచాట్లు గుర్తుంచుకొని, తల్లికి బుద్ధిచెప్పడానికే భార్యను సపోర్టు చేస్తున్నాడని తోచింది !

''సరే... వస్తానని అరవింద్‌తో చెప్పు'', అంటూ ఫోన్ పెట్టేశాను.

సాయంకాలం నేను ఒక్కత్తెనే అన్నపూర్ణమ్మ ఇంటికివెళ్లేసరికి భారతి బయట వరండాలో నా కోసం కాలుకాలిన పిల్లిలా అటూ ఇటూ పచార్లు చేస్తోంది.

ఇంకా మొహం నిండా పౌడరూ, లిప్‌స్టిక్కూ మా అత్తగారు చెప్పిన పగటి వేషంలోనేవుంది భారతి అంత వయసు వచ్చినా ! ...

## బంధాలు ఓడలూ...

కారుదిగి వరండాలోకెళ్తూనే భారతిని ఓవర్‌టేక్ చేసి అరవింద్, అతని భార్య అరుణా పరుగెత్తుకొచ్చి నా కాళ్ళకు నమస్కారం చేశారు.

''రండి, ఆంటీ ! మా పెళ్లయిన తర్వాత మీరిదే రావడం కదూ ?'' అన్నాడు అరవింద్.

''అవును, బాబూ ! అన్నట్లు నాయనమ్మ గారూ, నాన్నగారూ బాగున్నారా ?'' అన్నాను.

''ఓయస్ ! నానమ్మకిప్పుడు నేనే బాడీ గార్డ్ ! నా భార్య నర్స్‌గా పని చేస్తుంది నానమ్మకు !'' అని అరవింద్ చెప్తూంటే వినలేక ముఖం ముడుచుకుని ఉక్కురోషంతో చరచర లోపలికి వెళ్లిపోయింది భారతి !

భారతి అటు వెళ్తూనే అరవింద్ నా చెవి దగ్గరకొచ్చి, ''ఆంటీ ! మీరు నాకో సహాయం చేయాలి,'' అన్నాడు రహస్యంగా.

''ఏమిటి, బాబూ !'' అన్నాను నేనూ మెల్లిగానే.

''మా అమ్మ అహంకారం ఈ జన్మకి తగ్గేట్టులేదు ! ... మా తాతగారు పోవడానికీ, మా నాయనమ్మ ఆరోగ్యం పాడవడానికీ మా ఇంట్లో శాంతి లేకపోవడానికీ, మా అమ్మే కారణం అని మీకు తెలుసు గదా ?...''

''తెలుసు !''...

''యిప్పటికీ ఆమెకు బుద్ధిరాలేదు సరిగదా మా నాయనమ్మ మీద ఎలా అధికారం చెలాయించిందో కోడలిగా, ఇప్పుడు తను అత్తగారిగా నా భార్యమీద అదే విధంగా చెలాయిస్తూ అరుణను చాలా అవమానిస్తూ, మా ఇద్దర్నీ అయిదు నిమిషాలు సంతోషంగా ఉండనివ్వకుండా ఎప్పుడూ ఇంట్లో తగాదా పెట్టుకుంటోంది – కారణం మీకూ తెలుసు. తను చూసిన ఎవరో మినిష్టరు కూతుర్ని నేను చేసుకోకుండా మా నాయనమ్మ చూసిన బీద కుటుంబం పిల్లని చేసుకొన్నానని పెళ్ళయి నప్పట్నుంచీ కారాలూ మిరియాలూ నూరోంది మా మీదా, నాయనమ్మ మీదా ...

అవన్నీ చెప్పాలంటే చాలా ఉన్నాయి. మీకు తెలుసు మా అమ్మ స్వభావం. ఎంత భయంకరంగా ఉంటుందో ఆమెకు కోపం వస్తే !... మా నాయనమ్మ ఈ దిగుల్తో మళ్ళీ మంచాన పడేట్లున్నది. అందుకని నేను మా అమ్మకి స్ట్రాంగ్‌గా గుణపాఠం నేర్పించాలనుకున్నాను !... అందుకే అమెరికా ప్రయాణం. అర్థమైందా, ఆంటీ ?''

''ఆహా !'' అన్నాను అరవింద్ బుద్ధి బలాన్ని మెచ్చుకొంటూ ...

''మా అమెరికా ప్రయాణం అసలు నిజమైంది !'' అని అరవింద్ ఏదో చెప్పబోతూండగానే భారతి వచ్చేసింది తుఫాన్‌లాగా.

''అదుగో మళ్లీ మొదలెట్టాడు అమెరికా ప్రయాణం అంటూ ! ఎంత పొగరు !... తల్లిని కాదని ఈ ద్రాభముఖాన్ని తీసుకెళ్తాట్ట

అమెరికా !... హయ్యో ఖర్మ !... యోగ్యతలేని దరిద్రగొట్టు పీడ ! కోడలని చెప్పకోడానికే నాకు సిగ్గుగా ఉంది !...'' అంటూ అరుణని చూసి తల బాదుకొంది భారతి.

''అసలు నీలాంటి భూతాన్ని అత్తగారని చెప్పకోడానికే నా కవమానంగా ఉంది — ఖర్మ!'' అంటూ భారతిని చూసి అరుణ తల బాదుకొంది !...

అహం దెబ్బతిన్న భారతి, ''ఏం కూశావే పల్లెటూరి దోసకాయతొక్కా !...'' అంటూ లేచింది.

''నీవు అత్తగారి స్థానానికే అర్హత లేనిదాని వన్నానే, పట్నవాసం డొక్కా !'' అంటూ లేచింది అరుణ.

''మాటలు జాగ్రత్తగా రానీ'' అన్నది భారతి అరుణని బెదిరిస్తూ.

''నీ మాటలూ జాగ్రత్తగా రానీ !''

''ఓహో ! అందాకా వచ్చావా ?''

''ఎప్పుడో వచ్చాను !''

''ఎంత కొవ్వు !''

''ఎంత అహంకారం !''

''నోర్మూయ్ ! నేనెవరనుకుంటున్నావ్ ?''

''దేవత లాంటి అత్తగారి పాలిటి దెయ్యం అనుకుంటున్నాను...''

''ఏం కూశావ్ ?''

''కూశేది పక్షి !''

''అవునే దరిద్రపక్షీ ! నన్నెదిరించి మాట్లాడ్డానికి నీ కెన్ని గుండెలుండాలి ?''

''ఒకే గుండె చాలు !''

''నోర్మూయ్ ! మాటకు మాట సమాధానం చెప్తావా? మళ్లీ నోరెత్తావంటే చెప్ప తీసుకుని మూతిపళ్లు రాలగొడతాను !'' అంటూ కాలి చెప్ప చేతిలోకి తీసుకున్నది భారతి.

''నీ ఈ అహంకారం తగ్గించుకోక పోయావంటే చెప్పలేకుండానే నీ పళ్లు రాలగొడతాను !'' — అన్నది అరుణ ఒక అడుగు ముందుకువేస్తూ.

''ఏమిటీ ! నా పళ్లు రాలగొడతావా ? ఎన్ని గుండెలే నీకూ! ఏదీ? కొట్టూ చూస్తాను! కొట్టవే !'' అంటూ అరుణమీదికి దూకింది భారతి.

అపీమని అత్తగారి చెంప అదరగొట్టింది అరుణ. ఆ దెబ్బతో భారతి ముప్పయి రెండు కట్టుడుపళ్లూ కిందపడ్డాయి ! కోడలు అంత పని చేస్తుందని ఎదురుచూడని భారతి బోసి నోరు తెరిచి కొయ్యబారి నిలబడిపోయింది !

అత్తగారి దగ్గర్నుంచి అందర్నీ ఏడిపించడమేగాని, ఎన్నడూ ఏడ్చి ఎరగని భారతి, ఆ సమయంలో ఒక్కసారి వెక్కి వెక్కి ఏడవడం మొదలెట్టింది... తెగిందాకా బిగించి ఆ పరిస్థితి కొచ్చిన భారతిని చూస్తే జాలివేసింది !

నేను మాట్లాడకుండా అరవింద్ చెప్పింది గుర్తుంచుకుని చూస్తూ నిలబడ్డా — అరుణ వంగి కిందపడ్డ భారతి కట్టుడుపళ్లు తీసి భారతి చేతికిస్తూ !

''మై డియర్, అత్తగారూ ! ముందు మీ చేతిలో ఉన్న చెప్ప కాలికి వేసుకోండి ! ఇంకెప్పుడూ ఎవరిమీదికీ ఇలా వెళ్లకండి ! రాజకీయాలు తెలిసి మినిష్టర్లు అధికారాన్ని అర్థం లేకుండా చెలాయించినట్లు మీ అహంకారంతో ఈ కుటుంబంలో చాలా అనర్థాలు జరిగాయి ! ... ఇకమీద అలా జరగడానికి లేదు. ఇన్నేళ్లూ స్వర్గంలా వుండాల్సిన ఈ ఇల్లు నరకంలా తయారయింది మీ వల్ల ! ... నా భర్త చిన్నప్పట్నుంచీ, మీ దెబ్బలాటల్తో కూడిన అశాంతిలో ప్రతిక్షణం టెన్షన్‌లో పెరిగారు. ఆయన గతి మాకు పుట్టబోయే బిడ్డకు పట్టగూడదనే ఒక నిర్ణయానికొచ్చాం ! ... మీరు ఈ ఇంటి కోడలిగా, తల్లిగా, అత్తగారిగా మీ బాధ్యత మీకు ఇంకా తెలీలేదని, మీకు తెలియజేసే బాధ్యత నా కప్పగించారు మీ అబ్బాయి ! ఈరోజు నుంచీ నేను చెప్పేది మీరు వినక తప్పదు !... అదేం పెద్ద కష్టమైంది కాదు... చాలా సింపుల్ !... మీరు క్లబ్బులూ, మీటింగులూ, షికార్లూ పూర్తిగా తగ్గించుకోవాలి!... మీ అత్తగార్ని,మా మామగార్ని మీరు ఆదరణతో చూసుకోవాలి — ఒకప్పుడు మీరు అత్తగార్నీ, మామగార్నీ పనివాళ్ల పాలబడేసి ఒక్కగానొక్క కొడుకును ఆయాల కప్పగించి క్లబ్బులూ, షికార్లూ కెళ్లినట్లు నేను వెళ్లను—

''నేను బీద ఇంటిదాన్నయినా కుటుంబాన్ని కూడగట్టుకుని అందరం సంతోషంగా కలిసి ఉండాలనుకొనే దాన్ని. ఇంటి పనీ, వంట పనీ పనివాళ్లు లేకుండానే నేను చేయగలను — మీకేం కావాలో గూడా నేను చూసుకుంటాను !...''

''ఊహూ నాకేమొద్దు !'' అన్నది దెబ్బతో హడిలిపోయిన భారతి... నాకు నవ్వొచ్చి ఆపుకొన్నాను.

''నే చెప్పింది మీరు సరిగ్గా చేస్తున్నారా లేదా అని చూట్టానికి ఒక మనిషిని పెట్టాను... ఓబ్‌లెన్స్ !'' అని కేకేసింది అరుణ.

ఒక నల్లటి నీగ్రో ఆడది పీపాలాగా వచ్చి నిలబడ్డది చేతులో పెద్ద కర్ర పట్టుకుని.

దాన్ని చూసి బావురుమని ఏడుస్తూ వచ్చి భారతి నన్ను కావలించుకుంది.

నేనిక ఊరుకోడం బాగాలేదని, ''అరుణా, ఇక చాలు నాటకం !...భారతి ఇకమీద మీ అందరి మనసులకూ నచ్చే విధంగా నడుచుకుంటుంది ! ఎంతయినా ఈ ఇంట్లో భారతి తర్వాతనేగదా మీరంతా !... ముందా ఓబ్‌లెన్స్‌ని బయటికి పంపించెయ్, అరుణా !'' అన్నాను.

ఓబ్‌లెన్స్‌ని పొమ్మని చెప్పి, అరుణ వచ్చి భారతి కాళ్లు పట్టుకుని కన్నీళ్లతో ''అత్తయ్యా నన్ను మనస్ఫూర్తిగా క్షమించండి! మన యింట్లో మళ్లీ అందరం కలిసి సంతోషంగా వుండాలనే మీ అబ్బాయి ఇదంతా చేశారు'' అంది.

ఆనందంతో నా కండ్లల్లో నీళ్లు తిరిగాయి ! అత్తా కోడళ్లను లేవదీసి చెరోపక్కా నిలబెట్టుకున్నాను ! ''నానమ్మా ! నాన్న ! త్వరగా రండీ !'' అంటూ ''ఆంటీ ! అలాగే ఉండండి'' అని చేతిలో ఉన్న కెమెరాతో పరుగెత్తుకొచ్చాడు అరవింద్ సంతోషంతో ! ''ఇదుగో వచ్చేశాం, బాబూ !'' అంటూ ఎన్నడూలేని సంతోషంతో అన్నపూర్ణమ్మ కొడుకుతో సహా వచ్చి మా పక్క నిలబడ్డారు. ''స్టడీ ప్లీజ్ ! క్లిక్ !'' అన్నాడు అరవింద్.

అంతా నవ్వాం. ''అలాగే నవ్వుతుండండి... స్టడీ ప్లీజ్ ! క్లిక్ !'' అని మరో ఫోటో కూడా తీశాడు అరవింద్ !

నేను అన్నపూర్ణమ్మగారి కాళ్లకు నమస్కరించాను. నన్ను కావాలించుకున్నది ! అదే సమయంలో భారతి అన్నపూర్ణమ్మగారి కాళ్లమీద పడి ''నన్ను క్షమించండి!! అత్తయ్యా !'' అంటూ ఏడ్చింది.

''ఛీ ! పిచ్చిదానా ! లేవ్వే !'' అంటూ కోడలిని ప్రేమగా లేవదీసి భారతి కండ్ల నీళ్లు తుడిచింది.

''థ్యాంక్యూ, ఆంటీ ! పదండి...అందరం కలిసి అలా సరదాగా వెళ్దాం'' అంటూ అరవింద్ కారు వైపు నడిచాడు. ●





# సరాగమాల

## వి.ఎ.కె.రంగారావు

(గత సంచిక తరువాయి)

ఇక ప్రైవేటు పాటలు.

ఆ రోజుల్లో రెండే కంపెనీలు, గ్రామఫోన్ కంపెనీ, సరస్వతీస్టోర్సు, పేరుకి హెచ్, ఎం.వి. కొలంబియా రెండైనా నిజానికవి అవినాభావ సంబంధంకల్గిన పులినతులామానం గోమయ తులామానం. 1940 నుంచి 1955ప్రాంతాల వరకు ప్రైవేటు పాటలలో వినిపించిన సంగీత సాహిత్య సౌరభం తుంచిన ఘనతా, కామిక్‌పాటల పేరిట బూతు బురదను పెంచిన న్యూనతా 1958 నుంచి 1970 వరకూ ఆయా కంపెనీల రికార్డింగ్ శాఖాధిపతుల దురాశకూ, దుండగీడు తనానికీ చెందవలసిందే. తెలియక జరిగిన లోటు కాదది ఉద్దేశపూర్వకంగా ఆర్థిక దైన్యమో, నైతిక హైన్యమో అనుభవిస్తున్న రచయితలనూ, గాయకులనూ బలవంతపెట్టి చేయించుకొన్న ఘాతుకం పర్యవసానం? మంచిపాటలు కొనేవారు రికార్డుషాపుల గడప తొక్క మానడం. ప్రమాదవశాత్తు ఆ కాలంలో ఒకటీ అరా మంచి పాటలు యెవరికోసమో చేసినా అవి కొనేవారికి తెలియరాక విఫల మవడమూ.

అప్పటి రెండిటి స్థానే యిప్పుడు ఆరు కంపెనీలు మద్రాసులో వుండటం ముదావహ మైన ముందడుగే. అవి "కొలంబియా – హెచ్. ఎం. వి.", "సీ – ఏస్", "సంగీతా", "ఏ. వి. ఎం.", "మ్యూసిక్ ఇండియా", "పల్లవి". త్వరలో యీ సంగీత సంతలోకి జొరబడనున్నవి. "సి. బి. ఎస్.", రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ కటారు నాగభూషణం మనవడు గంగాధర్ స్థాపించిన "స్టార్", రమేశ్‌నాయుడూ సన్నిహితులూ సంరంభించిన "మయూరా". వీటిలో పరస్పర స్పర్థ, ఉండవలసినదే, అందరికీ మంచే చేసింది.

ఈ రోజుల్లో రికార్డులమీద కాకపోయినా, కాసెట్లమీద దొరుకుతున్న విషయ సమృద్ధి గత నలభై యేళ్లలో లభించలేదంటే అతిశయోక్తి కాదు. తెలుగువారికి సంబంధించినవే తీసు కొంటే శాస్త్రీయ సంగీతంలో గాత్రం, వివిధ వాద్యాలు, హిందుస్థానీ, కార్ణాటక పద్ధతులలో. భరతనాట్యం, కూచిపూడి నాట్యాల సంగీతం. వేదాలవల్లెలూ, స్తోత్రాల మాలలూ. భగవద్గీతా ప్రవచనం, హరికథలు, జాతీయ గీతాలు, భక్తి గీతాలు, జానపద గేయాలు, నాటకాలు, పాత చింతకాయ పచ్చడీ, కొత్తావకాయ, మీరా వంటి భక్తుల భజనలు. జయదేవుని అష్టపదులు, లీలాశుకుని శ్రీకృష్ణ కర్ణామృత శ్లోకాలు, పద కవితా పితామహుడు అన్నమయ్య కీర్తనలు. ఇక సినిమా పాటలు సరేసరి.

ఈ మూడు పువ్వులు ఆరు కాయల నవ వసంత విజృంభణలో చెట్టున మగ్గిన ఒకే ఒక పండు, "ఆనందభైరవి"లోని సర్వజనాకర్షక మైన తెలుగు సినిమా పాటలు.

ఉత్తరాదిన కిశోర్ సాహు నిర్మించిన హిందీ "హామ్లెట్" (1954) లో రంగ ప్రవేశం చేసి దక్షిణాన కృష్ణవేణి. కృపతో, బాలసరస్వతి కంఠంతో "దాంపత్యం" (1957) లో కాలూనిన సంగీత దర్శకుడు రమేశ్‌నాయుడికి చేతగానిది ఒకటి వుంది. అది సంగీతం పేరిట గోల–గొడవ సరఫరా చేయడం, అతనికి చేతయి నదీ ఒకటే. ఇది ఆ సాహిత్యానికే తగిన సమ్మోహన సమ్మేళన అనిపించేటట్లుగా వరసా, వాద్యగోష్ఠి అమర్చడం. గతవత్సరం "మేఘసందేశం" తో రాష్ట్రీయ; జాతీయ స్థాయిలో సంగీతానికీ, నేపథ్యగానానికీ (సుశీల – జేసుదాసులకు) బహుమతులందుకొన్న రమేష్ నాయుడు చేసిన యెన్నో చిత్రాలలో అంతటి విలువున్నవి. "కళ్యాణి" లో (1979 : దాసరి: సి. నారాయణరెడ్డి, వేటూరి, దాసం గోపాల కృష్ణ) అంతటికి మించినవీ వున్నవి. త్వరలో వాటితో పోటీపడే సంగీతం, రమేశ్‌నాయుడు




చేసినదే, కల్యాణి ఆర్ట్సు ఫిలివ్సు వారి "ఆనంద భైరవి" లో వినరానున్నది (మయూరా రికార్డులు, కాసెట్లు).

"నాకు కర్నాటక సంగీతం తెలియ"దని రమేశ్‌నాయుడనడం నేను విన్నాను. నిజమే కానచ్చు. కాని యీ చిత్రంలో చిత్రాలలో అరుదైన రాగాలు, అమృత వర్షిణి, ఆనంద భైరవి ఉపయోగింపబడిన తీరు అమృతోప మానం, ఆనందదాయకం. 'చైత్రము కుసుమాంజలి' బాలసుబ్రహ్మణ్యం పాడగా వినడం అమృతాన్ని చెవులారా గ్రోలడం. తనూ, జానకి 'పిలచిన మురళి'ఆలాపించడం ఆంధ్రుల అభిమాన పాత్రమైన ఆనందభైరవిని మూర్తీభవింప చేయడం (అన్నమయ్య కీర్తనల రాగాల వాటి రూపాలు వేర్పరచడంలో నేర్పరి, వాటికి మెట్లు






# మీ దినచర్య టాన్‌టెక్స్® తోనే ప్రారంభించండి

పగలు మొదలు రాత్రి వఱకు టాన్‌టెక్స్‌నే ధరించండి. దాని అమరిక, పొందిక మీ దినచర్య లందు ఎంతో తోడ్పడును.

IS : 4964



మీకు ఖచ్చితంగా
సరిపోతుంది
టాన్‌టెక్స్

బ్రీఫ్‌లు • వెస్ట్‌లు • క్యాజుయల్స్ • స్పోర్ట్స్
పిల్లల దుస్తులు




ttk తంపహారీ

Imageads-M- TT.1568 Tel

# సరాగమాల

కూర్చడంలో ఆద్యుడైన తీర్పరి రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు ఆనందభైరవి అసలు పేరు ఆంధ్రభైరవి అని అభిప్రాయపడ్డారు.)

మరొక పాట 'రారా రాగమై' బాలసుబ్రహ్మణ్యం పాడింది గొప్ప ప్రయోగం. ఒక్క పంక్తిలో భైరవి, నటభైరవి, ఆనందభైరవి రాగాలు ఆయా రాగాలపేర్లలో మెరుస్తాయి. ఇది వరలో బాలమురళీకృష్ణ వంటి మేధావులు పల్లవి పాడుతూ చేసిన మహత్కార్యమే యిది. అయితే సినిమాలలో యిటు వంటిది యింత పండిత పామర జనాకర్షకంగా జరగటం అపురూపం.

శైలజ, బాలసుబ్రహ్మణ్యం పాడిన 'సుడి గాలిలోన దీపం' (రమేష్‌నాయుడు మద్రాసులో రికార్డుచేసిన మొదటిపాట దాదాపు యిదే పల్లవితో ప్రారంభమవుతుంది 'సుడిగాలిలో దీపమూ, నడివీథిలో జీవితం' ఆరుద్ర రచన) బొమ్మరాటద్వారా తత్త్వబోధ చేస్తుంది. బొమ్మరాటని పాడినతీరూ వాద్యరచనా నిరూపిస్తాయి.

ఈ పాటలన్నిటికీ వేటూరి సుందర రామమూర్తి అండ యెంతటిదో విన్నవారందరూ గ్రహించగలరు. దర్శకుడు జంధ్యాల దండ యెటువంటిదో నేమూహించగలము.

వెంపటి చిన్నసత్యం తమ నాట్య ప్రదర్శనల ద్వారా వినుతికెక్కించిన రెండు పాటలీ చిత్రంలో చోటు చేసుకొన్నవి. తోడి రాగంలో 'బ్రహ్మాంజలి' (బి. ఎల్. ఎన్. ఆచార్య రచన), రామప్రియ రాగానికి రజనీకాంతరావు రమ్యమైన రూపకల్పన 'కొలువైతివా రంగశాయి' (దేవులపల్లి సాహిత్యం) చైత్ర నాట్యగీతాలలో అగ్రగణ్యాలు కాగలవు. మొదటి ప్రార్థన గీతంలో బాలసుబ్రహ్మణ్యం దరువులు పల్కగా బాలసుబ్రహ్మణ్యం పాడినతీరు, రెండవ 'పరాకు' గీతంలో బాలసుబ్రహ్మణ్యం జతులు చెప్పగా జానకి పాడిన సొరు, వారు గాయకులు కారు గంధర్వులన్నమాట చెప్పక చెప్పుచున్నవి.

ఇటువంటి సంగీతం తెలుగు సినిమాలలో వినబడుతున్నంత కాలం సినిమా సంగీతానికి చేటు కాలం రాదు. చేవకాలమే రహిస్తుంది. తెలుగు, కన్నడ భాషలలో తయారవు యీ "ఆనంద భైరవి" సంగీతానికి వచ్చేయేడు జాతీయ, రాష్ట్రీయ బహూమతులందితే సంతోషించదగిన సంగతి. స్వయం ప్రభతో ఆ నిక్కు మరొక్క చిత్రానికి దక్కితే అది యింకా గొప్ప విషయం!

అందరూ అమ్మడానికి
ఎంతో తంటాలు పడుతూంటే
**Planet**
గ్యాస్ హాట్ ప్లేట్ కోసం
ఎందరో కాసుకుని వున్నారు.
ఎందుకంటే, ప్లానెట్ పేరు పూర్తి భద్రత మరియు
నాణ్యతతో ముడి పెట్టబడినది,
బరువుతో కాదు మరి.



IS: 4246

రెండు సంవత్సరాల
గ్యారంటీ.

ప్లానెట్ కి గల ప్రత్యేకతలు:

- 20 సంవత్సరాలకన్నా ఎక్కువగా గల గొప్ప అనుభవం.
- అమెరికన్ సాంకేతిక సహకారంతో అద్భుతంగా తయారైంది.
- దిగుమతి చేసిన, విశిష్ట నాణ్యత గల
హెవీ-గేజ్ స్టీల్ తో తయారు చేయబడినది.
- ప్రతి భాగమూ అత్యుత్తమమైన ముడి పదార్థాలూ
నిశితంగా మెషీన్ చేయబడి, పూర్తి సామర్థ్యానికీ, చూపులకీ
అందానికీ, మన్నికకి పూర్తిగా పరీక్షింప బడినది.

ప్లానెట్, అనుమతింపబడిన అందరు ఎల్.పి.జి డీలర్ల వద్ద దొరుకుతుంది.

Planet
బంగారు పతకాన్ని,
నాణ్యత కోసం
ఇంటర్నేషనల్
ట్రోఫీని
గెలుచుకుంది.

Planet పేరు అసలైనది... జ్వాల ఉజ్వలమైనది.

ఆంధ్రప్రదేశ్ కు పరియా డిస్ట్రిబ్యూటరు:

**వెంకటేశ్వరా ఎంటర్ ప్రైజెస్**

27/20/31, మ్యూజియం రోడ్, విజయవాడ-2.

VEEYES • Baby

ఆంధ్రసచిత్ర వారపత్రిక
వజ్రోత్సవం జరుపుకొంటున్న సందర్భంగా
**మా శుభాకాంక్షలు !**



# గౌతమ్ వైన్స్

క డ ప

హృదయపూర్వక
శుభాకాంక్షలతో



లయన్
## బొబ్బా కృష్ణమూర్తి
ఉపాధ్యక్షులు
లైన్సు క్లబ్బు : : నిడదవోలు

హృదయపూర్వక
శుభాకాంక్షలతో




Fertiliser & Pesticides Wholesale &
Retail Dealers

Managing Partner : Alluri Satyanarayana
MAIN ROAD
NIDADAVOLE - 534 301

*Phone No.* : Shop. 114
Resi. 140

సీరియల్

# మూగ ముత్యాలు

## యలమంచిలి ఝాన్సీలక్ష్మి

(గత సంచిక తరువాయి)

**జరిగినకథ — 8:** సలీంకు సారధిపట్లగల ఆరాధనను మనస్సులోనే మెచ్చుకొంటుంది శశిరేఖ. సారధి శశిరేఖతో విసిగి ఆమెను వదిలేసి సీత దగ్గరకు వెళుతాడు. సీత భర్త శ్రీనివాస్ అని తెలుసుకుంటాడు. శశిరేఖను చూడాలంటుంది సీత. తను విజయకు తగనని సోమయాజులు గారితో అంటాడు సారధి. మనిషికి మనస్సు ముఖ్యం కానీ, కులం ప్రధానం కాదని చెపుతాడు సోమయాజులు. సోమయాజులుగారికి పక్షవాతం వస్తుంది. విజయను, రాజ్యంను ఆయన దగ్గరకు తీసుకెళతాడు సారధి. సోమయాజులుగారికి సలీంను పరిచయం చేస్తాడు. సీత సారధి ఇంటికి వచ్చి అక్కడ శశిరేఖను చూస్తుంది. శ్రీనివాస్‌కన్నా మంచివాడిని తెచ్చి పెళ్లి చేస్తానని సారధి శశిరేఖకు చెప్పబోగా ఆమె అతని మాట వినకుండా అతనితో ఘర్షణ పడుతుంది. మెల్ల మెల్లగా విజయ మనస్సును సారధి ఆకట్టుకొంటుంటాడు. సారధి తీసుకు వచ్చిన కుర్రాడు తనకు నచ్చలేదని చెబుతుంది విజయ.

"అబద్ధాలా ?! నేనెపుడు చెప్పాను ?"

"మీకు పెళ్ళయిపోయిందటగా?! ఇన్నాళ్ళూ ఎలా దాచుకున్నారండీ బాబూ ఇంతగొప్ప రహస్యాన్ని ?"

"ఓహో ! అదా! మీరూ విన్నారన్నమాట ! లేకపోతే నన్ను వదిలేట్టు కన్పించలేదాయన !" సారధి నవ్వాడు.

"మీరు నిజంగా నటులండీ !"

"మీలో యింత హాస్యం దాగివుందని నాకింత వరకు తెలీదు !" సారధి మాట మార్చాడు.

"తెలిస్తే ఏం చేసేవారో ?" కవ్వించిదామె మనస్సు.

"ప్రతాప్‌కి యీ సంగతి కూడా చెప్పే వాణ్ణి !"

"అలాగా ! మీరూ నేనూ చిన్నప్పటి నుంచీ ప్రాణస్నేహితులమా సారధిగారూ ?"

ఆమె ఆ ప్రశ్న ఎందుకు వేసిందో అర్థం గాలేదతనికి.

"నా గురించి మీ స్నేహితుడికి ఏమేమో చెబుతూంటే విన్నాను లెండి ! అందుకే అడిగాను !"

"మీతో గెలవడం కష్టం !" అతడు నవ్వి వరండాలోకి వెళ్ళిపోయాడు.

ఆ తరువాత అతడు కావాలనే విజయతో మాట్లాడలేదు. సోమయాజులుగారితో ఏమేమో మాట్లాడుతూ కూర్చున్నాడు కొంతసేపు ! ఆ తరువాత పశువుల చావిట్లోకి వెళ్ళి రాఘవులు చెప్పే కబుర్లు వింటూండి పోయాడు.

"తాతయ్యా ! అలా పొలాల దాకా వెళ్ళొస్తాను !" అని రాఘవులితో కలిసి వెళ్ళాడు. చీకటి పడిన తరువాత యింటికి వచ్చారిద్దరూ.

"మీ వూళ్ళో మల్లెపూల తోటలు చాలా వున్నాయి తాతయ్యా ! ఆ తోటల నిండుగా మల్లెపూల పరిమళమే ! మనస్సునిట్టే మంత్రించి వేస్తోంది !" అన్నాడు వచ్చి.

సోమయాజులుగారు ప్రతాప్ గురించి చెబుతారేమోనని చూశాడు. కానీ ఆయన అతని పేరే ఎత్తలేదు.

"ప్రతాప్ గురించి మీ అభిప్రాయం ఏమిటి తాతయ్యా ?" ఆఖరికి ఉండబట్టలేక అడిగాడు.

"విజయకి నచ్చలేదట సారథీ ! నేను మార్కండేయుణ్ణి కాదని చెప్పి వెళ్ళు బాబూ !" విజయ గుమ్మం ప్రక్కనే ఉన్నదని గ్రహించి అలా అన్నారాయన.

"ఈ ముసలివాణ్ణి ఆధారం జేసుకొంటే— గాలిలో దీపం బెట్టిన చందమవుతుందయ్యా !"

సారధి ఏమీ అనలేకపోయాడు. ఆ రాత్రి సోమయాజులుగారు భోజనం వద్దన్నారు.

"తాతయ్యా ! నీకు కోపం తెచ్చుకోవడం కూడా సరిగ్గా రాదు! మూతి ముడుచుకుంటారు నిజంగా కోపం వున్నవాళ్ళు ! అంతేగానీ ఇలా 'నాకీ పూట ఆకలిగా లేదమ్మా.' అని మృదువుగా చెప్పరు ! సరే ! నీ యిష్టం ! నా కెందుకు మధ్యన ? అయినా నిన్ను వదిలి పెట్టే సారధి గారెలా భోంచేస్తారనుకున్నావు ? ఆ మాత్రం మర్యాద తెలీదనుకున్నావా ? ఆయనకి ?"

విజయ, సారధిపైన నెట్టివేసిందా బాధ్యతని.

"పోనీ యిద్దరూ మానేయండి, నాతో పాటు ! నాక్కాస్త పని తగ్గుతుంది !" వంటింట్లోంచి అరిచిందామె.

"సారథీ ! విజయ మహా మొండిది ! అనుకున్న పని సాధించేవరకు తాను నిద్రపోదు ! ఎదుటివాళ్లని నిద్ర పోనీయదు! వడ్డించమను!" సోమయాజులుగారు ఓడిపోయినట్లు అంగీకరించారు.

"మీరే చెప్పండి ! వెళ్తే నన్ను వేళాకోళం పట్టిస్తుంది !"

"అమ్మా ! విజయా ! ప్రొద్దుబోతుంది!"

"సారధిగారున్నారు గనుక వదలి వేశాను తాతయ్యా ; లేకపోతే నీ భరతం పట్టేదాన్ని ! నన్నిలా ఆడించడం నీకు సరదా అయిపోయిం దీమధ్యన !" విజయ వడ్డిస్తూ తాతగారిని బెదిరించింది ప్రేమతో.

"ఇలా నా నోరు నొక్కేస్తుంది బాబు !"

'అయ్యొయ్యో ! ఆయన్ని పలకరించకు తాతయ్యా ! ఆయన మధ్యాహ్నం నుంచి మౌన వ్రతం పట్టారూ!" విజయ నవ్వకుండా అన్నది.

సారధి నవ్వాడు, యాజులుగారితోపాటు ఆ పరిహాసానికి.

భోజనాలయిన తరువాత అతడు మంచినీళ్ళు త్రాగి వస్తూంటే అడిగిందామె.

"నాతో మాట్లాడరా ఏమిటి ?"

"అబ్బే ! అదేం లేదు ! వచ్చి నాలుగయిదు రోజులు గడిచిపోయాయి. ఇంటి దగ్గర సీత వుంది ! కాలేజికి సెలవు పెట్టకుండానే వచ్చేశాను! సీత ఏలూరు వెళ్ళాలన్నది ! నా కోసం ఎదురు చూస్తుందేమో !"

"రేపెలాగూ వెళ్ళిపోతున్నారు గదా ! దానికింత మౌనవ్రతం బూని మరీ ఆలోచించా లంటారా ?"

సారధి ఆమె వంకే చూశాడొక్క క్షణం !

"తాతగారన్నట్లు మీరు మహా మొండి మనుషులు !"

"మీలాగా మొహం ముడుచుకుని కూర్చో వడం అందరికీ రావద్దూ !"

"వూ! చెప్పండి! ఇంకా! ఆగిపోయారేం!"

"మీరు వినడం లేదని !"

"ఏం వినమంటారు ? నా మాటని కాదన్నారుగా ! మీరే గెలిచారు కదా !"

"ఏం మీరందుకు సంతోషించడం లేదా?"

విజయ అతని మనస్సులోని వూహల్ని కదిలించింది కావాలనే.

"ఎలా సంతోషిస్తాను ? వాడికి నేనేం సమాధానం చెప్పను ?"

"విజయకి ఎప్పుడో, పెళ్ళయిపోయిందని చెప్పండి ! మీరు నేర్పిన విద్యలెండి ! అబద్ధాలు

కూడా అందంగా వుండాలి గదా మరి !''

''తాతగారి బాధని గమనించడం లేదా మీరు ?''

''నా బాధ నెవరు గమనిస్తారు ?'' విజయ గంభీరంగా అడిగింది. అతడు చేతులు కట్టుకొని నిలబడిపోయాడలాగే ఏం చెప్పాలో తోచక.

''మీకన్నిస్తున్నది మరో విజయ సారధి గారూ ! నాకూ కోరికలున్నాయి ! నా మనస్సుకీ కొన్ని యిష్టాయిష్టాలున్నాయి ! నేనింకా మీరు ప్రసాదించిన ఘోర పరాభవం నుంచి పూర్తిగా తేరుకోలేదు ! తాతయ్య పక్షవాతంతో మంచం పట్టారు ! రాజ్యం మెడిసిన్ చదువుతోంది ! నా దారి నేను చూసుకుంటే తాతయ్య నెవరు చూస్తారు ? రాజ్యానికి కావలసిన డబ్బు సంగతేమిటి ఉన్నది కాస్తా నేను పట్టుకపోతే ! స్కాలర్‌షిప్ సరిపోవడంలేదు దానికి ! ''

''తాతగారిని కూడా మీ యింటికి తీసుకెళ్ల వచ్చుగదా ! ప్రతాప్‌కి ఈ సంగతి ముందే వ్రాశాను ! అతను ఒప్పుకున్నాడు !''

''కానీ నేను ఒప్పుకోను ! తాతయ్య భీష్ముడిలా బ్రతికారు ! మరొకరి దయా దాక్షిణ్యాలపైన ఆధారపడవలసి వస్తే ఆయన క్షణం కూడా బ్రతకరు !''

''పోనీ మీరిక్కడే వుండండి ! ప్రతాప్ వచ్చి పోతూంటాడు !''

''ఆయన కెందుకంత ప్రయాస ? నా అంత అందమైన వాళ్ళీ ప్రపంచంలో లేరంటారా ?'' విజయ సూటిగా ప్రశ్నించింది.

''మీరేమీ దిగులు పడకండి ! మీరు చేసింది అపరాధమైనా కాకపోయినా శిక్షించడం నాకు రాదు లెండి ! తాతయ్య పుణ్యమా అని మనస్సుని నిగ్రహించుకోడం నేర్చుకుంది విజయ !''

సారధి మౌనంగా కదిలి వెళ్ళిపోయా డక్కడి నుంచి.

''ఎన్నాళ్ళిలా మనసు దాచుకుంటారో చూస్తాను లెండి !'' విజయ అతడినే చూస్తూ అనుకొన్నది లోలోన.

''రేపు వెళ్తాను తాతయ్యా !'' సోమయాజులుగారితో చెప్పాడతను.

''మంచిది బాబూ ! నీ ప్రయత్నం నీవు చేశావు ! ఫలితం దక్కలేదని విచారించకు ! ఎప్పుడేమి జరుగవలసి వుంటే అప్పుడదే జరుగుతుంది !'' అన్నారాయన.

''ఇది రాత్రి తాతయ్యా ! పగలు గాదు ! నిద్రపోండి !'' విజయ కేక పెట్టింది.

''ఏ జన్మలోనో నన్ను కన్న తల్లి అయి వుంటుంది !'' సోమయాజులుగారు గొణుక్కున్నారు.

ప్రొద్దున్నే లేచిన సారధికి రాఘవులు కంగారుగా చెప్పాడు –

''బాబుగారూ ! అమ్మాయిగారు నూతికాడ కాలు జారి పడిపోయారయ్యా ! లేవలేక పోతుండారు. ఓసారి వచ్చి చూడండి !''

సారధి వెంటనే పెరట్లోకి పరుగెత్తాడు. విజయ లేవాలని ప్రయత్నిస్తోంది, బాధ నణచుకుంటూ.

''ఏమైంది విజయా !''

''కాలు బెణికినట్టుంది ! లేద్దామంటే నొప్పితో కదల్లేకపోతున్నాను !''

కాలు అప్పటికే వాచిపోయింది పాదంపైన.











## మూగ ముత్యాలు

ఆమె కళ్ళల్లో నీరు తిరిగింది బాధ నణుచుకోలేక.

"ఏదీ ! చూడనీ !"

"అబ్బా ! ముట్టుకోకండి. అయ్యో! నొప్పి ! నొప్పి ! తాతయ్య నడగండి ? ఏదైనా మందు చెబుతాడు !" ఆపై ఆతడి చేతిని తీసి వేసింది మృదువుగా.

"మందు లోపలికి పద! రాఘవులూ! నువ్వా వైపున పట్టుకో !" సారధి ఆమె వాదిస్తున్నా వినకుండా నెమ్మదిగాలేవదీశాడు. విజయ నొప్పితో విలవిలలాడిపోతోంది ! సారధి భుజం పైన వాలిపోయింది పూర్తిగా ఆ బాధలో !

సారధి ఓ వాలు కుర్చీలో కూర్చో బెట్టాడామెని.

సోమయాజులుగారాందోళనతో ప్రశ్నించారు ఏమైందని.

"నూతిదగ్గర పడిపోయారయ్యా ! కాలు బెణికింది !" రాఘవులు చెప్పాడు.

"కర్పూర తైలం వుంది చూడు ! అల మార్లో ! కాస్త రుద్దు నాయనా !"

సారధి సీసా తెచ్చాడు. ఆమె రాఘవుల్ని రుద్దమన్నది, సిగ్గుపడి. "వాడికేం తెలుసమ్మా! మొరటుగా రుద్దితే బాధకోర్చుకోలేవు ! నువ్వు రాయిబాబూ నెమ్మదిగా !"

"ఇందులో సిగ్గు పడవలసిందేముంది విజయా ! ఏదీ ? ఆ! నొప్పిగా వుందా ?" సారధి మృదువుగా తైలం రాసి తోమాడు.

కానీ విజయ బాధ రవ్వంతయినా తగ్గ లేదు. కొంతసేపు ఓర్చుకుందలాగే ! ఆ తరువాత అన్నది.

"ఆపండి ! నొప్పితో ప్రాణాలు పోయేట్టున్నాయి ! తాతయ్యా లోపలికేదైనా మందివ్వరాదూ ఈ నొప్పి పోయేట్లు ?"

ఆమె చెక్కిళ్ళపైన కన్నీటి ధారలు !

"సారధీ ! ఫ్రాక్చరయి నట్టుందయ్యా ! కాలు బాగా వాచిపోయింది. గవర్నమెంటు డాక్టరున్నాడు ! పిలుచుకురమ్మను ! కట్టు వేస్తే గాని తగ్గదు !"

రాఘవులు వెళ్ళి డాక్టర్ని పిలుచుకువచ్చాడు. అతను ఎక్సరే తీయాలన్నాడు.

ఎక్సరే తీసి, ఫ్రాక్చరని చెప్పి బేండేజి వేసే సరికి సాయంత్రం అయ్యింది.

సోమయాజులుగారు రాఘవులి సాయంతో యింటిపట్టునే వుండిపోయారు. ఆ రోజు సారధే వంట చేసాడు.

"మీ ప్రయాణం ఆగిపోయింది నా మూలాన ! పైగా వంటపని అప్పగించాను ! క్షమించండి !" విజయ నొచ్చుకుంటూ అంది.

"నాకీ పని క్రొత్తేమీ గాదు లెండి ! సీత వెళ్ళిపోతే నాకు తప్పదుగదా! శశిరేఖ వంటింటి వైపు తొంగిచూడదు."

"అదేం ? వంటరాదా ?"

"రాదు. హాస్టల్లో పెరిగింది మొదట్నుంచీ!"

ఆ రాత్రి ఆతడే వడ్డించాడు.

"నీవు మాకు రుణపడి వున్నావు బాబూ ! అందుకే ఇంత కష్టపడి పోతున్నావీ వేళ !" అన్నారు సోమయాజులుగారు.

"మామ్మగారికి ఒంట్లో బావుండలేదట ! లేకపోతే సారధిగారి నింత యిబ్బంది పెట్టే వాళ్ళం గాదు తాతయ్యా !"

"నువ్వుండబట్టి యీ గండం గట్టెక్కింది నాయనా ! వెళ్ళి రాజ్యానికి చెప్పు ! ఓ నాలుగు రోజులు వుండి వెళ్ళమని !"

"ఎందుకు తాతయ్యా!చదువు పాడయిపోదూ! రాఘవులున్నాడుగా ! ఎలాగో అలా వంట చేయగలనులెండి ! రేపటికింత నొప్పి వుండదుగదా ! విజయ వారించింది."

"నాకు సెలవుల్లేవు విజయా ! లేకపోతే నేనే వుండిపోయేవాణ్ణి !" అన్నాడు సారధి ఆమెతో పడుకోనేముందు.

సోమయాజులుగారు నిద్రపోయారప్పుడే.

"భలేవారు మీరు ! మీతో నన్ను సేవలు చేయించుకోమంటారా ? ఈ వేళ చేసింది చాలు! జన్మ జన్మలకి గుర్తుంచుకుంటాను ! మీరు లేకపోతే, తాతయ్య లేవలేక నానా గొడవ జేసేవాడు ! ఊళ్ళో వాళ్ళందరికీ కబురంపేవాడు !"

"జాగ్రత్తగా వుండండి తగ్గే వరకు !"

"మళ్ళీ మీరు మన్నిస్తున్నారెందుకు నన్ను ?"

"అలవాటు పోదు అంత తొందరగ !"

"కాదులెండి ! మీరు కావాలనే అలా అంటున్నారు ! నేనంటే మీకు భయం తప్ప మరేమీలేదు !"

"సీతని పంపిస్తానుండు ! చక్కగా సరిపోతుంది మీ యిద్దరికీ ! మాటకి తకీమని జవాబిచ్చేస్తుంది !"

"వద్దులెండి ! ఆమె వున్నంతసేపూ మీ కథే చెబుతుంది ! విసుగెత్తిపోతుంది వినలేక !"

విజయ కావాలనే అతడిని రెచ్చగొట్టింది. అతడు మౌనం వహించాడు.

"మాట్లాడరేమిటి ? కోపం వచ్చిందా అలా అన్నానని ?"

"ఎందుకూ ? ఆదేంలేదు నిద్రొస్తోంది!" అన్నాడతడు.

"నా ముందేనా ? లేక అందరిముందూ యిలాగే అబద్ధాలు చెబుతారా ?"

"సరే ఏమిటో చెప్పు !" అతడు లేచి కూర్చున్నాడు నవ్వుతూ.

"మళ్ళీ మీరెపుడు వస్తారో చెప్పండి !"

"సెలవు దొరికినపుడు వీలుంటే తప్పకుండా వస్తాను ! మీ కాలు తగ్గిన తరువాత లెటరు వ్రాయండి !"

"ఏం ? ఈ లోపల వ్రాయగూడదా ?"

"అలా అని అనలేదుగా నేను ! ప్లీజ్

వస్తానన్నాడు! వాడికి పల్లెటూర్లంటే సరదా! వాడిని పంపిస్తానుండండి!''

''ఏం మీరు రారా!''

''రాకుండా ఎలా వుంటాను? తాతయ్యని చూడకుండా వుండగలనా? నాకు క్రైవేట్లు చెప్పవలసిన పని వుంది! ఆ పైన కాలేజి! క్షణం తీరిక దొరకదు ఆ మహానగరంలో!''

''మీకు డబ్బంటే మహా ఆశలా వుందే!''

''సలీమ్‌కి నేను చాలా రుణపడి వున్నాను! నెలనెలా తీర్చవద్దూ మరి!''

''పోనీ నేనిస్తాను తీసుకోండి! అప్పుగానే సుమా!''

''మీ కివ్వడానికే వాడి దగ్గర అప్పు తీసుకున్నాను!'' సారధి నవ్వాడు.

''ఏమిటి మా కివ్వటానికా?''

''ఆ! మరి! మీ పదిహేనువేలూ ఎక్కడి నుంచి వూడి పడ్డాయనుకున్నారు? అమ్మ మీరిచ్చిన డబ్బుతో సీత పెళ్ళి జేసింది!''

విజయ క్షణంసేపు మాట్లాడ లేకపోయింది.

''మీరు నన్నెందుకు తిరస్కరించారో చెప్పగలరా?''

''నా కలా అమ్ముడుబోవటం యిష్టం లేదు! అంతే! మీ గురించి నేనేమీ అనలేదసలు! అమ్మే కోపంతో అన్నది!''

''ఆమాట తాతయ్యతో చెప్పారా? మీరు?''

''చెప్పాను! విజయకి నేను తగనని కూడా చెప్పాను!''

''ఏం నేనంత గొప్పదాన్నా?''

''అవును. నీ అందానికి నేను సరిపోను! నా సమస్యలతో నిన్ను సుఖపెట్టలేను. నేనసలు ఏ విధంగానూ నీకు తగినవాణ్ణిగాను?'' అంటు మనసు విప్పి చెప్పాడు.

''మీ కెవరు చెప్పారు? నా అందానికి మీరు సరిపోరని?''

''నాకే తెల్సింది మిమ్మల్ని చూడగానే!''

''మీరు కూడా తాతయ్యలాగా మిమ్మల్ని గురించి తక్కువ అంచనా వేసుకుంటారన్న మాట! పోన్లెండి! అందులో నిజం లేకపోయినా నమ్మలేకపోతే మీరూరుకోరుగదా! మరో చిన్న ప్రశ్న! సమస్యలు లేని మనిషి వున్నాడంటారా? సమస్యలకి భయపడి మరొకరి మనస్సుని ముక్కలు చేస్తారా ఎవరైనా?'' విజయ మనస్సులో రగుల్తున్న బాధనంతటినీ వెళ్లడించింది.

అతనికిపుడు స్పష్టంగా తెలిసిపోయింది. విజయ మనసులో తనకి స్థానం వుందని. కానీ అదెంతగా తన గుండెల్ని చీల్చివేస్తుందో విజయకి చెప్పాలనిపించలేదతనికి.

''మాట్లాడరేమిటి? భయం వేస్తోందా మీకు? మాటలతో మిమ్మల్ని యిక్కడే కట్టి వేస్తానేమోనని! నేనంత పిచ్చిదాన్ని కాదులెండి అలా ఆశల్ని పెంచుకోవటాన్కి!''

## మూగ ముత్యాలు

సారధికి ఎలా ఆమెని ఓదార్చాలో అర్థం గాకుండా పోయింది.

''తాతయ్యతోనైనా చెప్పగూడదా మీ సమస్యల్ని?''

''ఆయనకీ వయస్సులో నా సమస్యలెందుకు చెప్పండి? మీరు ... శశిరేఖ పెళ్ళి కుదర్చండి! అపుడు ఎన్ని సమస్యలున్నా యిక్కడే వుండి పోతాను.''

''శశిరేఖ మాత్రం నా మాట వింటుందా? ఆమె మీ చెల్లెలుగాదూ? అయినా ... ఆమె మీకెలా చెల్లెలయింది?''

సారధి యిబ్బందిగా కదిలాడు.

''భలేవారే! మీరు! రాజ్యం మీకెలా చెల్లెలయిందో శశీ అలాగే!''

''మీకు నేను ఓ పరమశత్రువులా కన్పిస్తున్నానా?''

''మళ్ళీ యిదేం ప్రశ్న?''

''మరి నా ముందు మీ రెండుకిలా నిజాన్ని చెప్పకుండా దాచుకుంటున్నారు?''

''తాతయ్య లేచినట్టున్నారు! పడుకోండిక!''

''నాకు సమాధానం చెప్పడం యిష్టం లేదని చెప్పరాదూ?''

ఆమె నిష్ఠూరంగా అన్నది.

సారధి నవ్వాడు.

''నేను మీకు సమాధానము చెప్పలేనివాణ్ణి గనుకే మీకేమీ గాలేకపోయాను?''

## మరమనుషుల భీమా!

జపానులో మరమనుషులకు సయితం భీమా సౌకర్యాన్ని ఏర్పాటు చేస్తున్నారు. వివిధ పరిశ్రమలలో మరమనుషులను ఉపయోగించటం ప్రారంభమైన తరువాత కర్మాగారాలలో ఉత్పత్తి మరింత యాంత్రికమయింది. కానీ, మరమనుష్యుల వలన ఏమైనా చిక్కులు ఏర్పడితే ఉత్పత్తి పూర్తిగా స్తంభించిపోగల ప్రమాదం ఉంది. జపానులో యంత్రాలకు భీమా సౌకర్యం కలిగించే సంస్థల యూనియన్, దీనిలోని లోతుపాతులను పరిశీలించి ఈ కొత్త భీమా ప్రతిపాదనను ప్రవేశపెట్టింది. ఈ పథకం కింద, కంపెనీలకు మర మనుషుల వలన ఏదైనా నష్టం సంభవిస్తే, దానికి నష్టపరిహారం లభిస్తుంది. జపాను ఆర్థిక మంత్రిత్వశాఖ అంగీకారం లభించిన తరువాత ఈ పథకం అమలులోకి వస్తుంది.

''మీకందుకు సంతోషంగా వుందను కుంటాను!''

''నేనసలు మాట్లాడను! ఏం అన్నా యుద్ధం చేస్తున్నారు!''

''రేపు నేను లేవకముందే వెళ్ళిపొండి! మళ్ళీ నాలో చెప్పవలసి వస్తుంది లేకపోతే!''

''ఇంకా ఏమైనా వున్నాయా? చెప్పండి!''

''వెళ్ళి పడుకోండి! నిద్రొస్తోంది నాకు!''

''మీకు నన్నజ్ఞాపించడం అలవాటయి పోయింది! సరే! గుడ్‌నైట్!'' అతడు లేచి సోమయాజులుగారి గదికి వెళ్ళిపోయాడు.

మరునాటి వుదయం అతని కంటేముందే ఆమె లేచింది. స్నాన పానాదులయిన తరువాత బయలుదేరాడతడు.

''విజయ కన్పించలేదు తాతయ్యా!'' అంతవరకు అతడు విజయని చూడనేలేదా రోజున.

''కోపంవస్తే యిలాగే దాక్కుంటుంది. బహుశా పూజ గదిలో వుండి వుంటుంది. చెప్పి వెళ్ళు!''

సారధి పూజగది ముందుకెళ్ళి నిలబడ్డాడు. తలుపులు దగ్గరా వేసివున్నాయి.

''అమ్మాయిగారినిపుడే పూజగదిలో కూర్చొబెట్టి వచ్చాను బాబూ! పిలవమంటారా?'' రాఘవులు వచ్చి అడిగాడు.

అతడు పిలవమని చెప్పాడు— ఆమె రాఘవులు ఎన్నిసార్లు పిలిచినా జవాబివ్వలేదు!

''పూజలో వున్నట్టుండారు బాబూ! కాసేపు కూకోండి!'' రాఘవులు తన పనిమీద తాను వెళ్ళిపోయాడు.

ఓ పది నిమిషాలు గడిచిపోయిన తరువాత విజయే రాఘవులూ! అని పిల్చింది.

''ఏం కావాలో చెప్పండి! రాఘవులు లేడిక్కడ! కాస్త లోనికి రానిస్తారా?'' సారధి మృదువుగా అడిగాడు.

''నా పూజ యింకా పూర్తి కాలేదు!''

''సరే! అయితే మరి నేను వెళ్తున్నానని చెప్పండి మీ కోపానికి! ఆ! కాస్త కోపాన్ని ఉత్తరంలో కూడా పెట్టి పంపించండి! అవసరం వచ్చినపుడు వాడుకుంటాం!'' సారధి చెప్పి వెళ్ళిపోయాడు.

విజయ కోపాన్నంతా రాఘవులిపైన గ్రుమ్మరించింది.

''నీ కెన్నిసార్లు చెప్పాను! రాఘవులూ అయ్యగారికి కాఫీతో పాటు కాస్త ఫలహారం కూడా పెట్టమని!''

''మతి లేని వాణ్ణి అయిపోయానమ్మా! అయినా బాబుగారు అడగొద్దూ?''

''ఆయనసలే హరిశ్చంద్ర మహారాజు! అడిగి తింటే పరువు పోదూ!''

|ఇంకా వుంది|

# అర్ధశతాబ్దిలో పత్రికలలో కలిగిన పరిణామం

శ్రీ తిరుమల రామచంద్ర

(గత సంచిక తరువాయి)

**(9)** తెలుగు పత్రికలలో ఇంతటి మార్పు వస్తున్నప్పటికీ హిందూ పత్రిక మాత్రం ఏ మార్పూలేక నడుస్తూ వుండేది. దాని మొదటి పుటలో వార్తలు వుండేవి కావు, వ్యాపార ప్రకటనలే వుండేవి. సంపాదకీయ పుట నుంచి వార్తలు మొదలయ్యేవి. 1947 ఆగస్టు 15న భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన వార్తనుకూడ హిందూ పత్రిక లోపలి పుటలో సింగిల్‌కాలం శీర్షికలో ముద్రించింది. కాని, ఆ సాంప్రదాయికపు పట్టుదలను అద్రికమంగా విడనాడక తప్పలేదు. 1948 జనవరి 29న ఒక క్రూరుడు గాంధీజీని హత్యచేసినప్పుడు ఆ వార్తను సంపాదకీయ పుటలో, డబుల్ కాలం శీర్షికతో, డబుల్ కాలంలో ప్రచురించింది. హిందూ పత్రిక చరిత్రలో ఇదే తొలి డబుల్ కాలం. దీనిని ఆనాడు హైదరాబాద్‌నుంచి అడివి బాపిరాజుగారి సంపాదకత్వంలో వెలువడుతున్న మీజాన్ దినపత్రిక బాక్సుకట్టి ఒక వార్తగా ప్రచురించింది. హిందూలాంటి ప్రతిష్ఠగల పత్రిక భారతదేశ స్వాతంత్ర్యం సిద్ధికన్నా గాంధీజీ హత్యకు ఎక్కువగా చలించిపోయి వుంటుందని అనుకోవాలిమరి ! అప్పటినుంచి ఆ పత్రిక కొంతకాలం పాటు సంపాదకీయ పుటలో వారానికొకనూరు ఒక సంచలనాత్మక వార్తను డబుల్ కాలంలో ప్రచురిస్తూ వచ్చింది. అప్పటికే తెలుగు పత్రికలు, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ వంటి ఇంగ్లీషుపత్రికలు స్ట్రీమర్లు, బ్యానర్లు, డబుల్ కాలాలు, ట్రెబుల్ కాలాలు, యాంకర్‌కాలాలు ఇవ్వడం మొదలుపెట్టాయి. కాని, హిందూ పూర్వాచారపరాయణత్వాన్ని గాంధీజీ అంతటివాని హత్య మాత్రమే తొలగించగలిగింది. దానిలోను వార్తలు క్రమంగా మొదటి పుటకు పాకాయి.

**(10)** ఆంధ్రపత్రిక తర్వాత వచ్చిన పత్రికలకన్నిటికీ ఆదిగురువయినట్లే వార్షిక సంచికలు, ప్రత్యేక సంచికలు వెలువరించడంలోను మార్గదర్శకమైంది. ఆంధ్రపత్రిక వారపత్రికకు అనుబంధంగా 1910లో మొదటి ఉగాది సంచిక వెలువరించింది. నాగేశ్వరరావు పంతులుగారు దాని 'విన్నపము'లో ''భగవదనుగ్రహము వలనను, నాంధ్ర మహాజనుల యాదరాతిశయము వలనను నీ సంచిక బహిర్గతముగాజాలినది. గ్రంథాదిని స్వకీయ విషయక ప్రశంసను జేయుట సామాన్యము.'' అంటూ సాధకబాధకాలు వివరించారు. జాతీయోద్యమ సమయంలోను, స్వాతంత్ర్యానంతరమూ ఫీల్డ్ సర్వే, పేపర్‌సర్వేలను కొంత ఆంధ్రపత్రిక చేసింది. కాని, అది తర్వాత బలం పుంజుకోలేదు. వాటితోపాటే పరిశోధనాత్మక (ఇన్‌వెస్టిగేటివ్) పత్రికారచన కూడ మన పత్రికా రంగంలో వికసించలేదు.

**(11)** బ్రిటిష్ పాలకులు విదేశీయులు. వారికి తమ దేశంలోను. పొరుగు దేశాలలోను తమ ప్రతిష్ఠ ముఖ్యం కనుక ప్రజాభిప్రాయానికి, దానిని తీర్చిదిద్దే పత్రికలకు కొంతకు కొంత భయపడేవారు. స్వాతంత్ర్యానంతరం మన పాలకులకు ఆ భయం పోయింది. స్వాతంత్ర్యమనేది స్వైర విహారమయింది. కనుక పూర్వం కల్తైనేశన్ వంటి సినిమా పత్రికల లాగే పరస్పరం బురదచల్లుకొనే పత్రికలు ఆయా నాయకుల చలవవల్ల వెలువడ్డాయి. ఇవి కొన్నే అయినా, ఈగల వల్ల జబ్బులు వ్యాపించినట్టు వీటివల్ల తక్కిన పత్రికల స్వాస్థ్యమూ దెబ్బ తింటుంది.

**(12)** పూర్వం వ్యంగ్య చిత్రాలు విరివిగా వుండేవి కాదు పత్రికలలో. ఏ తలిసెట్టి రామారావుగారి వంటి వారు కొందరే వుండేవారు వ్యంగ్య చిత్రకారులు. ఇప్పుడు వ్యంగ్య చిత్రాలు చిన్నవి, పెద్దవి దిన, వార పత్రికలకు తప్పనిసరి. ఒక బొమ్మ పది వార్తల పెట్టు అన్నది పత్రికా రచనా సూత్రాలలో ఒకటి. కనుక ఛాయా చిత్రాల వాడకం కూడ పెరిగింది.

**(13)** వార్తల ప్రచురణలోను చాల మార్పులు వచ్చాయి. పూర్వం హెడ్డింగుకు, వార్తాముఖానికి (లీడ్‌కు) నియమం వుండేది. ఎనిమిది కాలాల బ్యానరుకు 84 పాయింట్ల అక్షరాలు వాడితే, దాని కింద తప్పనిసరిగా 72, 60, 48, 36, 24, 18 పాయింట్లలో ఉపశీర్షికలు క్రమంగా అవరోహణ క్రమంలో వుండాలే తప్ప మరొక విధంగా వుండడానికి వీలులేదు. అప్పటి బాడీటైపులో ప్రధానమైనవి గ్రేట్ ప్రైమరు (జి. పి.), ఇంగ్లీషు బాడీ (ఇ. బి.). 18 పాయింట్ల శీర్షిక తర్వాత జి. పి. లో వార్తాముఖం (లీడ్) వ్రాసి, అటు తర్వాత ఇ. బి. లో వార్తలిచ్చేవారు. డబుల్‌కాలం హెడ్డింగు కింద మరొక డబుల్‌కాలం హెడ్డింగు రాగూడదనే నియమమూ వుండేది. క్రియాంత సంపూర్ణ వాక్యాలు శీర్షికలలో వుండరాదనేది మరొక నియమం. అందువల్ల నాటి ఉప సంపాదకులకు పెద్ద పాయింట్లలో శీర్షికలకు, ఉపశీర్షికలకు వాక్యాలు స్ఫురించడం ప్రాణ గొడ్డమయ్యేది. ఇటీవల పత్రికల పుటల తీర్పులో (మేకప్పులో) మరీ పెద్ద మార్పులు వచ్చాయి. ఒకే పాయింట్లో సింగిల్ లైన్ హెడ్డింగులూ, డబుల్ కాలం కింద డబుల్ కాలం, ఒకేపాయింటులో నాలుగైదు వరుసల హెడ్డింగులూ మొదలయినవి. వార్తా ముఖానికి ప్రత్యేకమైన టైప్ వాడడం పోయింది. ఈ పద్ధతిని మొదట ఆచరణలో పెట్టింది ఈనాడు దినపత్రిక.

**(14)** ఇంతవరకూ వెలువడి నిలబడిన దినపత్రికలలో ఒక్క ప్రజాశక్తిలోతప్ప—ఆద్యంతాలలో ఎక్కడో ఒకచోట ఆంధ్రశబ్దం వుంటూనే వచ్చింది. అంతేకాక హిందూ పెట్టిన వరవడి ప్రకారం పత్రికా నామధేయ మకుటం (మాస్ట్ హెడ్) అక్షరాలు పాత ఇంగ్లీషు కాపిటల్ అక్షరాల అనుకరణగానో, అనుసరణగానో వుంటున్నవి. 'ఈనాడు' నామధేయ మకుటం మాత్రం తెలుగక్షరాల గుండ్రదనం విసర్జించి చతురస్రాకారం సంతరించుకొంది. ఈ అక్షరరూపం బాడీ టైపులోను వస్తే ఫొటో కంపోజింగు, కంప్యూటర్ ఆపరేటింగు సుగమమై తెలుగు పత్రికల ముద్రణలో ఇమిడిక ఏర్పడి మరింత అభివృద్ధికి వీలుంటుంది.

**(15)** స్వాతంత్ర్యానంతరం పద్మశాలి, చేనేతవంటి కులాలు, వృత్తుల పత్రికలుకూడ విరివిగా వెలువడ్డాయి. ఆంధ్ర వారపత్రిక తన సైజును మార్చుకుని, రాజకీయ ప్రాధాన్యాన్ని కథలకు, నవలకు అందించి పెక్కు పత్రికలకు ఆదర్శమైంది. ఒకేవిషయానికి, కేవల సాహిత్య చరిత్రాది పరిశోధనకు, ప్రాధాన్యమిచ్చే ''పరిశోధన'' వంటి పత్రికలూ వెలువడ్డాయి. 'పరిశోధన' సర్జనాత్మక రచనలను, వ్యాపార ప్రకటనలను నిరాకరించి కేవలం పరిశోధనకే అంకితమైన పత్రిక. ఈ నా సమీక్ష అద్దంలో కొండను చూపడం వంటిది.

**(16)** జననం మొదలుకొని నేటివరకూ పెక్కు విషయాలకు వరవడిపెడుతూ జాతి శ్రేయస్సే ధ్యేయమైన ఆంధ్రపత్రిక (వార పత్రిక) 75 సంవత్సరాలు నిండి వజ్రోత్సవం చేసుకొనడం ఎంతో ఆనందదాయకం. ఇది నాగేశ్వరరావు పంతులుగారి, శివలెంక శంభుప్రసాదుగారి చేతిచలవ. ఇలాగే ఈ పత్రిక శతజయంతి చేసుకుంటుందని, దానిని నేనూ చూస్తానని విశ్వసిస్తున్నాను. ●

e Season's finest: **24K PEARLEYE 5&Z ELAN**

# "రండి. మగవారి ఫేషన్లలో
## మార్పు చేర్పుల గురించి మాట్లాడుకుందాం."






అక్బర్ షాపూర్‌వాలా
కచ్చిన్స్, బొంబే.

"<u>మీ కోటు కథ.</u> పొడుగు: మీ చేతిని నిటారుగా ఉంచండి. తెరచిన మీ బొటనవేలు కన్నా ఒక్క అర అంగుళం మేరకు తక్కువ పొడుగుంటే చాలు, మీ కోటు మీకు చక్కగా నప్పుతుంది. ఇహ మిగత వివరాలు: పేచ్ పాకెట్లు పాత ఫేషన్. లేపెల్స్: 3 అంగుళాల వెడల్పు మాత్రమే. బటన్స్ అంటారా, చేతులకు నాలుగు, ముందు భాగంలో రెండు.

<u>పేంట్, చొక్కాల ఫేషన్లు:</u> పేంట్‌కి ఓపెన్ బాక్స్ ప్లీట్స్ చాలా ముఖ్యం. పేంట్ స్లీవ్ వెడల్పు 18" మాత్రమే. ఇహ చొక్కా కాలర్ వెడల్పు $2\frac{1}{2}$"; కఫ్ వెడల్పు కూడా $2\frac{1}{2}$".

<u>సూట్ ధరించినప్పుడు ఏక్సెసరీస్‌ను మరువకండి:</u>
కఫ్ లింక్స్, టైపిన్స్ పాత ఫేషన్. సాక్స్, హేండ్ కర్ఛీఫ్స్, బూట్లు...మీరు ధరించిన సూటు అందాన్ని పెంచాలేగాని, అవి కొట్టొచ్చినట్లు కనబడకూడదు."

<u>సూటింగ్:</u> మారుతున్న ఫేషన్లలో, మారనిదల్లా తరగని క్వాలిటీ. ఈ విషయంలో మీరు నిశ్చింతగా విమల్ వర్‌స్టెడ్ సూటింగ్స్‌ను నమ్మవచ్చు. ఈ సీజనుకై ప్రశస్తమైన పలురకాల సూటింగ్స్. అన్నీ అద్వితీయమైనవే.





# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## నమోదు చేయబడిన చిత్రాల పేర్లు

సతీష్ ఫిలిమ్ ఎక్స్‌పోర్ట్స్ "సితార", మహేశ్వరి ఆర్ట్ మూవీస్ "గడుగ్గాయి", దేవి కమల్ మూవీస్ "స్రామాట్", శ్రీ పల్లవి ఫిలిమ్స్ "సీతకాదు సావిత్రి", శంభు ఆర్ట్ పిక్చర్స్ "ప్రేమ కిరీటం", రాశీ మూవీస్ "బావామరదళ్ళు", వినయ్ ఫిలిమ్ "యువశక్తి", నీలో ఫిలిమ్స్ "పాస్‌పోర్ట్", శ్రీ భ్రమరాంబికా ఫిలిమ్స్ "పెళ్ళికొడుకు అమ్మబడును", "అమ్మకానికో అబ్బాయి", ఎస్. వి. ఎస్. క్రియేషన్స్ "భామ—రుక్మిణి". దినేష్ ఆర్ట్స్ "సి. ఐ. డి. సింహ", సింహపురి ఆర్ట్ క్రియేషన్స్ "ఈ తరం అబ్బాయిలు", శ్రీ సౌజన్య ఆర్ట్ క్రియేషన్స్ "కడలితరంగం", సంధ్య సినీ క్రియేషన్స్ "నర్తకి", కోస్టల్ ఫిలిమ్స్ "ప్రేమరథం", శ్రీ విష్ణుకుమార్ పిక్చర్స్ "రగిలే గుండెలు", సంచిత్ర ఆర్ట్ క్రియేషన్స్ "సహనం తిరగబడింది", కృపాసాగర్ పిక్చర్స్ "తెలుగు దేశంలో నీలిమ".

## "ఈ పిల్లకు పెళ్ళవుతుందా ?" లో ఆఫీసులో హంగామా

రేఖ (పూర్ణిమ) ఇచ్చిన ఫైల్‌ను మేనేజర్ (పొట్టి ప్రసాద్) అలా చూశాడో లేదో ఆకాశమంత్తెత్తుకు లేచాడు. "ఏమ్మా, గ్రాడ్యుయేట్ వేనా నువ్వు ? ఏమిటమ్మా ఈ డ్రాఫ్టింగు — ఫస్ట్‌పర్సన్ లోంచి థర్డ్ పర్సన్‌లోకి జంప్ చేస్తావేంటి ? కాలేజీలో వేసిన కుప్పిగంతులు ఇంకా మర్చిపోలేదా ?"

"మీరు చూసిన డ్రాఫ్టు—ఎస్. ఓ. గారు డిక్టేట్ చేస్తే నేను రాశాను, సార్ !" అంది రేఖ.

"వాడో బడుద్దాయ్ ... చూసి కాపీ కొట్టి డిగ్రీ సంపాదించిన బాపతు ... చూడమ్మాయ్ ! నీకేదైనా డౌట్ వస్తే, పర్సనల్‌గా నన్ను కలువు —నేను చెబుతాను," అని వెర్రి నవ్వుతో ఫైల్ ఇచ్చాడు. రేఖ తన సీటులోకి వచ్చి కూర్చొని నిట్టూర్చింది.

పక్కన్న సుబ్బారావు (సుత్తివేలు) "ఏమండీ, రేఖగారూ ! నూనెలో వేసిన అప్పడం లాగా మీ మొహం అలా మాడిందే ! మేనేజర్ తిట్టాడా ? ఆహా — తిట్టే ఉంటాడు. వాడసలే కారం తిన్న కాకి ... కా— కా — కా — కా అని అరుస్తూనే ఉంటాడు. మీరేం బాధపడకండి. ఇంట్లో పెళ్ళాన్ని ఏమీ అనలేక ఇక్కడకొచ్చి మన మీద ఎగురుతుంటాడు పొవులో ఆవాల్లాగా" అన్నాడు.



'కురుక్షేత్రంలో సీత' జయసుధ, మోహన్‌బాబు



జయప్రద 'ప్రజారాజ్యం'

"ఆయన నన్నేమీ అనలేదు. నేనేమీ బాధ పడటంలేదు. మధ్యలో మీకెందుకండీ బాధ ?"

"బాధ ... మీ పక్కసీట్లో ఉన్న వాడ్ని, మీతో నడవాలనుకుంటున్న వాడ్ని. మీరు కాదనుకున్నా మీకు కావలసినవాడ్ని—ముందే చెబుతున్నా" అంటున్న సుబ్బారావు వంక రేఖ చుర చుర చూసింది.

వేజెళ్ల సత్యనారాయణ దర్శకత్వంలో బి. హెచ్. అజయ్‌కుమార్ నిర్మించిన శ్రీ బాల బాలాజీ కంబైన్స్ "ఈ పిల్లకు పెళ్ళవుతుందా?" చిత్రానికి వి. కనకరాజు నిర్మాణ సారథి.

## శోభన్‌బాబు—రాధిక, సుహాసిని "బావా మరదళ్ళు"

"నేటి వివాహ వ్యవస్థకున్న విలువను తెలియజేసే చక్కని ఇతివృత్తం," అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఈయన దర్శకత్వంలో ప్రముఖ పారిశ్రామికవేత్త మంతెన దేవేంద్రరాజు సమర్పించే రాశీ మూవీస్ "బావా మరదళ్ళు" చిత్రంలో శోభన్‌బాబు సరసన సుహాసిని తొలిసారిగా నటిస్తోంది. రాధిక, మురళీమోహన్, రావుగోపాలరావు, నూతన్ ప్రసాద్, గుమ్మడి, అల్లు రామలింగయ్య, అన్నపూర్ణ ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. సత్యానంద్, చక్రవర్తి, వెంకట్, సహదర్శకుడు చక్రవర్తి తెర వెనుక కృషిచేస్తున్నారు. "షూటింగ్ ముహూర్తం సెప్టెంబర్ 5న. అక్టోబర్ 6 నుంచి 20 వరకు జరిగే రెండో షెడ్యూల్‌తో పూర్తవుతుంది," అని నిర్మాత ఎం. నరసింహారావు తెలియజేశారు.

## "ఖైదీ" చిత్రంలో

### నాయకా నాయికలు

బాగా చదువుకుని, బంగారు భవిష్యత్తు కోసం కలలు కంటున్న సూర్యం (చిరంజీవి)ని కొన్ని దుష్టశక్తులు అక్రమంగా ఎదుర్కొన్నాయి. పరిపరి విధాల అతన్ని విసిగించాయి. వేధించాయి. ఆ నరరూప రాక్షసులపై సూర్యం నరనరాలలో ప్రతీకారవాంఛ పెరిగింది. సమయం కోసం, అదనుకోసం ఎదురు చూస్తూంటాడతను. డాక్టర్ పట్టాపుచ్చుకుని, ఎంతో మందికి సాయపడుతూ, బోలెడంత పరపతి, డబ్బు సంపాదించింది సుజాత (సుమలత). ఎంతో సున్నితంగా, ప్రశాంతంగా కనిపించే సుజాత వెనుక కూడా ఓ విషాద గాథ ఉంది. తన అయిన వాళ్ళకు జరిగిన అన్యాయాల్ని ఎదుర్కొనేందుకు రంగంలోకి దిగి, తనకు తోడ్పడే తగిన వ్యక్తి కోసం ఎదురు చూస్తూంటుంది సుజాత.

నాయకా నాయికల పాత్రల గురించి పై విధంగా వివరించారు ఎ. కోదండ రామిరెడ్డి. ఈయన దర్శకత్వం నెరిపే సంయుక్త మూవీస్ "ఖైదీ" చిత్రంలో రంగనాథ్, రావుగోపాలరావు, నూతన్‌ప్రసాద్, రాళ్ళపల్లి, సుత్తివేలు, డాక్టర్ శివప్రసాద్, మాధవి, సంగీత, కొత్తనటి సంయుక్త ఇతర పాత్రధారులు. కథ, మాటలు పరుచూరి సోదరులు రాశారు. వేటూరి గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు. వి.ఎస్.ఆర్.స్వామి ఛాయ, భాస్కరరాజు శిల్పం, కె. వెంకటేశ్వరరావు కూర్పులో డాక్టర్ ఎం. తిరుపతిరెడ్డి నిర్మించే ఈ చిత్రానికి కె. ధనంజయరెడ్డి నిర్మాత.

'అగ్ని సమాధి'లో పూర్ణిమ





పూర్ణిమా జయరాం, చిరంజీవి 'మంత్రిగారి వియ్యంకుడు'

### ఎ.ఎన్.ఆర్. "తాండవకృష్ణుడు"

"ఆగస్ట్ 28న అన్నపూర్ణా స్టూడియోలో తొలి షెడ్యూల్ ప్రారంభమవుతుంది," అన్నారు పి. చంద్రశేఖరరెడ్డి. ఈయన స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో గోపాలరెడ్డి నిర్మించే కృష్ణా క్రియేషన్స్ "తాండవకృష్ణుడు" చిత్రంలో ఎ.ఎన్.ఆర్., జయప్రద, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, గిరిబాబు, అల్లు రామలింగయ్య, ముచ్చెర్ల అరుణ, అన్నపూర్ణ ఆదిగాగలవారుంటారు. పరుచూరి సోదరులు, చక్రవర్తి, వి.ఎస్.ఆర్. స్వామి ప్రభృత సాంకేతిక వర్గం, కథకుడు, నిర్మాణ సారథి: చెన్నారెడ్డి.

## సినిమా జోక్స్!

### అడ్వాన్స్ న్యూస్

"ఏమండీ! ఒక సినిమా వారపత్రికలో వచ్చేనెలలో నటి తారశ్రీకి ఎవరితోనో వివాహం – అని వార్త వేశారు. మరి మీ సినిమా వారపత్రికలో వచ్చేనెలలో ఆ నటికి శ్రీమంతం అన్న న్యూస్ పడిందే! ఏమిటది ?"

"మా సినిమా వారపత్రిక ఎప్పుడూ అడ్వాన్స్ న్యూసే ఇస్తుంది."

### కథలో మలుపులు

"రచయితగారూ! ఎన్నో మలుపులున్న కథ కావాలి నాకు. మీ దగ్గర అలాంటి దేదైనా ఉందా ?"

"ఉందండి. హీరో అసలు కొండ ప్రాంతంలో వాన్‌డ్రయివర్. ఇక ఊహించుకోండి ఎన్ని మలుపులు ఉంటాయో !"

### సినిమా కవి

"మీ పిక్చర్‌లో మూడు పాటలే ఉన్నాయే! కాని, టైటిల్స్‌లో నలుగురు కవుల పేర్లు వేశారేమిటి ?"

"హీరోయిన్ ఆనందంతో ఒకసారి వంటగదిలో 'లలలా...లలలా...' అని హమ్ చేస్తుంది చూడండి అది నాలుగో పాటన్నమాట. దాన్ని రాసింది మా నిర్మాత బావమరిది."

### డూప్

"గుర్రాల ఫైట్ సీన్‌లో మా హీరో డూప్ లేకుండా తనే ఫైట్ చేస్తానన్నారు. పట్టుబట్టి అలాగే ఫైట్ చేశారు కూడా."

"భలే !"

"చెప్పేది పూర్తిగా వినండి. ఆ తర్వాత ఆయనలో తీయవలసిన మిగతా రెండు మూడు సీన్‌లను డూప్ వేసి తీయవలసి వచ్చింది."

— జి వి జి.



'భోళాశంకరుడు' మురళీమోహన్, సుమలత

## "భార్యాభర్తల సవాల్"లో

## పరిణయానికి ముందు ప్రణయం!

అడవి ప్రాంతం... ఫారెస్ట్ ఆఫీసర్ విజయ్ (మోహన్‌బాబు) కాటేజ్ నుంచి బయలు దేరాడు. కోయపిల్ల(సుమలత) "దొరా, దొరా!" అంటూ పరుగున వచ్చి, "దండాల్, దొరా !" అంది.

"ఏంటి, పిల్లా, బాగున్నావా ?" అన్నాడు విజయ్.

"యేం బాగున్నా, దొరా.. యిద్దెలేవి మనిషి యింత పసువన్నట్టు విన్నాను."

"చదవకపోయినా పెద్దమనిషితలొచ్చున్నమాట ? అవునూ— పలక, బలపం తీసుకొస్తున్నావ్. బడి నుంచి వస్తున్నావా ?"




"యేడ, దొరా! తమరు బడి పిల్లల కెట్టించినారు గాని, మా బోటోళ్ళకు బడి యెట్ట లేదుగా! అందుకే, మీచేత నాలుగచ్చరాలు రుద్దించుకుందామని వొచ్చినా, దొరా! తమ రేలెట్టి రుద్దించు, దొరా!" అంటూ విజయ్ చెయ్యి పట్టుకుంది కోయపిల్ల.

"అమ్మాయ్! చెయ్యొదులు!" అంటూ విజయ్ విదిలించుకున్నాడు.

కోయపిల్ల బుంగమూతిపెట్టింది. "యేం, దొరా! నే సదూకోడం తమకిట్టం లేదా, లేదా నాకు సదువు సెప్పడమే తమకిట్టం లేదా ?"

"రెండూ ఇష్టమే కాని, నీతో

# సినిమా

## "దోపిడి దొంగలు"

"కౌబాయ్ యాక్షన్ చిత్రం," అన్నారు ఈడ్పుగంటి వెంకటేశ్వరరావు ఈయన నిర్మించే దేవతా కంబైన్స్ "దోపిడి దొంగలు" చిత్రం షూటింగ్ తడకు 17 కిలో మీటర్ల దూరంలోని కాంబాక్కం అడవుల్లో ప్రారంభ మైంది. నరేష్, గీత, సుధాకర్, కవిత, సత్య నారాయణ, జీవా, అనూరాధ నటిస్తున్నారు. కథను శోభ రాశారు. రాజశ్రీ గీతాలకు సత్యం స్వరకల్పన చేశారు. వాలి శిల్పం, తరణి సహకార దర్శకత్వం, బాబు నృత్యాలతో సంకలనకర్త ఈడ్పుగంటి నాగేశ్వరరావు నిర్మాణ సారథ్యం వహిస్తున్నారు. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: ఎస్. ఎ. చంద్రశేఖర్.

## "చదరంగం"

"సెప్టెంబర్ 4న విశాఖలో షూటింగ్ మొదలెడుతున్నాం," అన్నారు పి. త్రినాధరావు. ఈయన నిర్వహణలో బి. భాస్కర రావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే శ్రీ విజయకళామందిర్‌వారి పై చిత్రానికి ఆగస్ట్ 17న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది. నరేష్, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, రాజేష్, పూర్ణిమ, నవనటి భానుప్రియ పాల్గొంటారు. మద్దిపట్ల సూరి సంభాషణలు, జె. వి. రాఘవులు సంగీతంతో పి. వి. రమణ మూర్తి నిర్మాత.

'పోలీస్—పోలీస్'లో నరేష్, సిల్క్‌స్మిత



మాట్లాడ్డమే కష్టం,'' అంటూ విజయ్ బయలుదేరాడు.

కోయపిల్ల అతని వంకే రెప్పలార్పకుండా చూస్తూండి పోయింది.

ఎస్. వి. సుబ్బరాజు కథ ఆధారంగా ఆర్. రామకృష్ణంరాజు, కె. ఎల్. ఎస్. ఎస్. రామచంద్రరాజు నిర్మించిన పద్మజా కళామందిర్ ''భార్యాభర్తల సవాల్'' చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

## నెల్లూరులో అక్కినేని జన్మదినోత్సవం!

సెప్టెంబరు 20వ తేదీన అక్కినేని నాగేశ్వరరావుగారి జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని, నెల్లూరు అక్కినేని ఆర్ట్సువారు

శ్రీదేవి 'శ్రీరంగనీతులు'



సెప్టెంబరు 19, 20 తేదిలలో అక్కినేని జన్మదినాన్ని అతివైభవంగా నెల్లూరు టౌన్ హాలులో జరుప నిశ్చయించినారు. ఈ సందర్భంగా లలిత సంగీతం, సినిమా పాటలలోను, ఏకపాత్రాభినయంలోను, జానపద నృత్యము మరియు రికార్డు డాన్సులలోను అఖిల భారత స్థాయిలో పోటీలు నిర్వహిస్తారు. పై పోటీలకు న్యాయనిర్ణేతలుగా సినీ సంగీత దర్శకులు, సినీ నృత్య దర్శకులు, సినీ దర్శకులు వ్యవహరింతురు. వివరాలకు సెక్రెటరీ, అక్కినేని ఆర్ట్సు, నియర్ అనితా హాల్, నెల్లూరు–524 003కి రాయాలి.



ప్రభ, భానుచందర్ 'శ్రైలుదోపిడీ'

## సినిమా

### "గాంధీ" చిత్రం చూడని మొరార్జీదేశాయ్ !

''గాంధీ చిత్రాన్ని నేనుచూస్తే, అందులోని ఎన్నో లోపాలను పేర్కొనవలసి వస్తుంది. పైగా ఆ చిత్రం అన్నిచోట్లా బ్రహ్మాండంగా ఆడుతోందని నే విన్నాను. ఇక దాన్ని చూడడ మెందుకు ?'' అన్నారట మొరార్జీదేశాయ్. ★



తెలుగు పత్రికా ప్రపంచంలో శ్రీ నిమ్మగడ్డ వెంకట కృష్ణారావుని గురించి తెలియని వారు చాలా కొద్ది మంది ఉంటారు. జాతీయోద్యమంలో, ఖద్దరు ప్రచారంలో ఆయన బహుముఖ సేవ చేశారు. పత్రికల విక్రయం, ప్రకటనల విడుదల — వీటిలో శ్రీ వెంకటకృష్ణారావుకి ఒక ప్రత్యేక స్థానం ఉంది. ఆంధ్రపత్రిక ''సీనియర్ ఏజెంట్లు''లో ఆయన ఒకరు. ఆయన ఆంధ్రపత్రిక జన్మించిన తరువాతి సంవత్సరంలో జన్మించారు ... [ఒ.వి.]




## (గత సంచిక తరువాయి)

సాయంత్రం అయిదుగంటల ప్రాంతాల కృష్ణమూర్తి కారు అతని ఆఫీసు ఎదుట ఆగింది. కృష్ణమూర్తి కారు దిగి ఆఫీసు గదిలోకి నడిచేడు. ఆఫీసు గదిముందు బల్లమీద కూర్చున్న ప్యూన్ వెంకటస్వామి వినయంగా లేచి వించున్నాడు. గదిలోకి అడుగుపెడుతూ 'వెంకు బాబుగార్ని పిలు' అన్నాడు కృష్ణమూర్తి.

ఎయిర్ కండిషన్ గదిలో తన సీటుకి ఎదురుగా కూచుని శ్రద్ధగా పేపరు చదువు కుంటున్న మిత్రుడ్ని వెనకనుంచి చూచే పోల్చు కున్నాడు. తన సీటు దగ్గరికి వెడుతూ అతన్తో అన్నాడు —

'ఎప్పుడొచ్చేవురా శేషు! వచ్చేవాడివి తిన్నగా యింటికే రాకపోయేవా ?'

శేషు వెంటనే జవాబు చెప్పలేదు. కృష్ణమూర్తి కూచున్న తర్వాత, ఇద్దరూ సిగరెట్లు ముట్టించుకున్నారు. అగ్గిపుల్లను ఆర్పేస్తూ అన్నాడు శేషు —

'బెంగుళూరునుంచి ఉదయమే వచ్చేన్రా! మధ్యాన్నమంతా నిద్రతోనే సరిపోయింది. నిద్ర లేచి ఆఫీసుకి ఫోన్ చేసేను. నువ్విక్కడికి వచ్చే వేళయిందని నీ సెక్రటరీ చెప్పేడు. నువ్విక్కడికి రావడానికి సరిగ్గా మూడు నిమిషాల క్రితం నేనిక్కడకి వచ్చేను. అన్నట్టు, ఇవాళ నీ పుట్టిన రోజటగా — '

'అవును ఇవాళ్తో ముప్ఫై అయిదు పూర్తయ్యేయి. ముసలాడ్ని అవుతున్నాను గదూ?'

'అప్పుడే ?'

'మనిషి బతికే సగటు కాలంలో సగం దాటిపోయేనుగదా !'

'ఇప్పుడు సగటు లెక్కలు చెప్పి బోర్ కొట్టొద్దు. మంచి ప్రోగ్రాం ఏర్పాటు చేయి. నీ బర్త్‌డేని అందంగా సెలిబ్రేట్ చేసుకుందాం. అన్నట్లు, మరిచేను. రాఘవగాడిక్కూడా ఫోన్ చేసి చెప్పు. లేకపోతే ఏడ్చిపోతాడు ఫూల్! ఏదీ... ఆ ఫోనిలా తగలెయ్ ... నేనే వాడిని పిలుస్తాను' అంటూనే ఫోనందుకున్నాడు శేషు. డయల్ చేసేడు.

వెంకుబాబు ఫైల్‌తో లోపలికొచ్చేడు. అతని దగ్గరున్న చెక్కుల్ని తీసుకుంటో అన్నాడు కృష్ణమూర్తి —

'బాపూజీ అనాధాశ్రమానికి వెయ్యిన్నూట పదహార్లకి చెక్కు రాయండి. నా చారిటీ ఎకౌంట్ నుంచి డ్రా చేయండి.'

వెంకుబాబు తలూపేడు. రాఘవతో ఫోన్‌లో మాట్లాడుతున్నాడు శేషు. రెండు చెక్కుల్ని సంతకం చేయడం పూర్తిచేసి హాయిగా నవ్వేస్తూ వెంకుబాబుతో మళ్లీ అన్నాడు కృష్ణమూర్తి —

'నా బర్త్‌డే నా కంటె ఎక్కువగా జ్ఞాపకం వుంటుంది, బాపూజీ అనాధాశ్రమం సెక్రటరీకి. నేనెక్కడ మరిచిపోయేనో అని మధ్యాన్నం ఫోన్ చేసి గుర్తుచేసేరాయన. ప్రతి బర్త్‌డేకి నాకు తోచింది వాళ్లకి యివ్వడం నా కలవాటు. ఈ పని పూర్తయిన తర్వాత వాళ్లకో చెక్కు రాసి పట్టుకురండి.'

'అలాగేనండి' అన్నాడు వెంకుబాబు.

ఫోన్‌లో రాఘవతో ఏం మాట్లాడు తున్నాడోగాని అవతల్నుంచి వినిపించే ప్రతి మాటకీ అలాగే, ఆలాగే అంటూ బదులు చెబు తున్నాడు శేషు. చివరికి విసుగుపుట్టింది కాబోలు ఫోన్ కృష్ణమూర్తికిచ్చి వూరుకున్నాడు.

ఫోన్లో రాఘవని వింటూ, మందహాసంతో తలూపుతూ చెక్కులు సంతకం చేస్తున్నాడు. కృష్ణమూర్తి. అటు ఫోన్‌లో వ్యవహారమూ, ఇటు చెక్కుల పని రెండూ ఒకేసారి పూర్తయ్యేయి. చెక్కులు తీసుకుని వెంకుబాబు వెళ్లబోతుండగా అతన్ని ఆపి అడిగేడు కృష్ణమూర్తి —

'అన్నట్టు — మీకివాళ్లేమైనా అర్జంటు పనులున్నాయా బాబూ ?'

'లేవండి' అన్నాడు వెంకుబాబు.

'దట్స్‌గుడ్ ! అయితే ఇవాళంతా మీరు మాకూడనే వుండిపోతారు. అనాధాశ్రమం చెక్కు పూర్తిచేసి తీసుకొస్తే సంతకం చేస్తాను. దాన్ని వెంకటస్వామికిచ్చి పంపించండి. ఆ తర్వాత మాతోపాటు వచ్చేయండి. ఒ.కే ?'

'అలాగే సార్ !' అని ఆ గది వొదిలేసి వచ్చేసేడు వెంకుబాబు.

వెంకుబాబుకివాళంతా చాలా ఆనందంగా వుంది. అదృష్టవశాత్తూ తనకీ జే.కె. అండ్ కంపెనీలో ఉద్యోగం దొరికిందని అతనివాళ్ల







## పాలు

చాలా తడవలనుకున్నాడు. జె. కె. ఇలా నిండుగా, హుందాగావుండగలుగుతున్నాడంటే దానిక్కారణం అతనికున్న సిరిసంపద లొక్కటేకాదు. సిరిసంపదలు పుష్కలంగా వున్న ఎంతమంది ధనికులు జే. కె. లాగా వుండగలుగుతున్నారు! ఎందరు హుందాగా వున్నారు? మనిషికి అరుదైన దైవత్వం ఈ జే. కె. లో వుంది. అందుచేతనే అతనంత నిర్మలంగా వుండగలుగుతున్నాడు — అని కూడా వెంకుబాబు అనుకున్నాడు.

బాపూజీ అనాథాశ్రమం సెక్రటరీ పేరున అందంగా రాసేడు చెక్కుని. వెయ్యిన్నూట పదహార్లు రాస్తున్నప్పుడు వెంకుబాబు మనసారా ఆనందించేడు.

వెంకుబాబుకి కూడా 'నా' అన్నవాళ్లు లేరు. ఆశ్రమంలోనే పెరిగి పెద్దవాడయ్యేడు. దేశంలో దానధర్మాల ఉనికివల్ల అతను చదువుకుని యోగ్యుడయ్యేడు. ఈ జే. కె. లాంటి దాన కర్ణులూ, బాపూజీ అనాథాశ్రమం లాంటి ఆశ్రయాలూ లేకపోతే తన గతేమయ్యేది?

'వెయ్యేళ్లు వర్ధిల్లండి బాస్! మీ సిరి సంపదలు, మీ భార్యా పిల్లల్తోపాటు కలకాలం సుఖంగా వుండి — అభాగ్యులకూ, నిరుపేదలకూ సాయపడండి' అనుకున్నాడతను.

చెక్కు రాయడం పూర్తయింతర్వాత, జే. కే. గదిలోకి వెళ్లేడు వెంకుబాబు — చెక్కుతోసహా. అప్పటికే ఆ గదిలోకి రాఘవ వచ్చి కూచున్నాడు. ఛలోక్తులు విసురుతూ మిత్రులిద్దరితోనూ ఆనందంగావున్నాడు కృష్ణమూర్తి. వెంకుబాబు రావడం చూచి మాటలాపేసేడు. అతను తెచ్చిన చెక్కుమీద సంతకం చేసి, చెక్కుని వెంకుబాబు కిస్తో అన్నాడు —

'మా ఫ్రెండ్సిద్దరూ రెడీగా వున్నారు. మీదే ఆలస్యం. ప్లీజ్... తొరగా తెమిలి రండి.'

* * *

ఊరికి దూరంగా సముద్రముంది. ఆ బీచ్‌లో అత్యాధునిక వసతులుగల చక్కటి రహదారి బంగళా వుంది. ఆ బంగళాను చేరుకున్నాడు కృష్ణమూర్తి — మిత్రులిద్దరూ, వెంకుబాబులతో.

రహదారి బంగళాలో ఆ రాత్రి కృష్ణమూర్తి బర్త్‌డే చాలా సరదాగా సెలిబ్రేట్ చేసుకోడం ప్రారంభించేరు.

విదేశీ విస్కీ సీసాలు ఆరున్నాయి. స్వదేశీ దినుసులు వాటికి జత చేసేరు. ఒక సీసాను స్వహస్తాలతో ఊడదీసేడు కృష్ణమూర్తి. మిత్రులిద్దరి గ్లాసుల్లోనూ పోసి, తన గ్లాసులోనూ పోసుకుని, వెంకుబాబు గ్లాసులో పోయబోతుండగా — వెంకుబాబు చెయ్యడ్డంపెట్టి, 'అలవాటు లేదు క్షమించండి' అన్నాడు.

వెంకుబాబు తాగనందుకు రాఘవ్ విసుక్కున్నాడు. కానీ, గ్లాసెత్తి ఒక గుటక గొంతులో పోసుకోడంతోటే — తాగడం అలవాటు లేని వెంకుబాబుని చాలా మెచ్చుకున్నాడు. కనీసం, దగ్గరుండి తమ గ్లాసులైనా నింపే కార్యక్రమం ప్రారంభించమని కోరేడు.

కృష్ణమూర్తి కూడా అదే అన్నాడు!

నిలువెల్లా కంపించిపోయేడు వెంకుబాబు. ఇంత మంచి మనిషికి ఈ క్షుద్రమైన అలవాటు ఎందుకు అంటుకుందోనని అతను బాధపడ్డాడు.

మత్తులోనున్న మనిషి సంస్కారానికి దూరమవుతాడని అతని భయం! కృష్ణమూర్తికి సెక్రటరీగా వున్నందుకు అతను సిగ్గుపడటంలేదు గానీ, విస్కీని ఆ మూడు గ్లాసుల్లో తన చేత్తో పోసేటందుకు మాత్రం అతను అల్లాడిపోతున్నాడు. అయితే, అతన్నెవరూ పట్టించుకునే స్థితిలో లేరు.

— మూడు సీసాలు పూర్తయింతర్వాత వాళ్ళకి మరొక తాజా కొత్త కోరిక కలిగింది. శేషు బయటపడిపోయేడు. కృష్ణమూర్తిని అడిగేడు —

'అన్నట్లొరేయ్! గంగాభవాని యిప్పుడిక్కడ మన మధ్య వుండివుంటె ఎలాగుంటాదంటావ్?'

'మజాగా వుండి, మజా మజాగా వుంటుందుంటుంది' సమాధానం చెప్పింది మాత్రం రాఘవ.

'కాని, ఇక్కడలేదు. బొంబాయిలో ముఖర్జీ దగ్గిరికెళ్లిపోయింది. ప్రస్తుతం దాన్ని వాడు వాడుకుంటున్నాడు.' అన్నాడు కృష్ణమూర్తి.

వెంకుబాబుకి కృష్ణమూర్తి మాటలు కటువుగా, రోతగా వినిపించేయి. మనిషి పడిపోవడం ప్రారంభిస్తే — అతనెంతవరకూ పడిపోతాడో వూహించడం కష్టమనిగూడా తోచింది. ఆ పడిపోవడం కళ్ళారా చూచేదానికంటె (కృష్ణమూర్తి అనుమతిస్తే) ఆ గదినుంచి పారిపోవాలనుకుంటున్నాడు.

'అంత వుపకారం చేసేవ్ గదా, అది నిన్నెట్లా మరిచిపోయింది?' శేషు అడిగాడు.

## పొట్టితనం

పొట్టివాడికి
పుట్టెడు బుద్ధులు!
పొట్టి వరి వంగడాలకు
రాలుబడి ఎక్కువ —
పొట్టివాడు లాల్‌బహదూర్
గట్టివాడనిపించుకున్నాడు,
వామనావతారం
జగత్ప్రసిద్ధం
కనుక —
పొట్టి కవితలను
గట్టివనడం మంచిది!

— పైడిపాటి సుబ్బరామశాస్త్రి

'నన్ను మరిచిపోయిందని ఎవడన్నాడోయ్? ముఖర్జీ ప్రస్తుతం దాన్ని వుంచుకున్నాడని అన్నానంతే !' అన్నాడు కృష్ణమూర్తి.

'ఎలాగైనా నీది మా చెడ్డ లీగల్ బ్రురా కిష్టుడూ ! మరి... నీ రెండో ఖాతా మమత అడ్రస్సేమిటి ? ఈ వూళ్లోనే వుందా ? లేకపోతే మరో చెటర్జీగాడు ఎగరేసుకుపోయేడా?'

రాఘవ నిగ్గదీసి అడిగినప్పుడు కృష్ణమూర్తి సమాధానం ఏం చెబుతాడోనని శేషు కుతూహలంగా వున్నప్పుడు కృష్ణమూర్తి నీళ్లు నమిలేసేడు.

కాసేపు నిశ్శబ్దానంతరం 'ఆత్మహత్య చేసుకుంది. కారణాలు అడగొద్దు' అన్నాడు.

వెంకుబాబుకి భయం (మళ్ళా) వేసింది. కృష్ణమూర్తి తాలూకు కుటుంబం గుర్తుకొచ్చింది. అన్నపూర్ణలాటి అన్నపూర్ణమ్మ, ముత్యాల్లాటి ఆవిడ ముగ్గురు బిడ్డలూ జ్ఞాపకంరాగా అతను వణికిపోయేడు.

'మిజరబుల్... టూ మిజరబుల్ ఇటీజ్! అయితే ఇప్పుడిక్కడికొచ్చే ఆడగాలే వూళ్లో లేవా ఏంట్రా ?' అడిగేడు శేషు.

'ఎందుకు లేదు! ఈ వూళ్లోనే వుంది. ఎంతో అందమైంది. అణకువగా వుండి చెప్పేది శ్రద్ధగా వింటుంది... నీలవేణి!' అన్నాడు కృష్ణమూర్తి.

'దణ్ణం పెడతానోరేయ్... బాబ్బాబు దాన్నిక్కడికి పిలిపించు వెంటనే...' ప్రాధేయపడ్డాడు రాఘవ.

'డేం నీలవేణి ! ఇటీజ్ బోర్ !... అది బాలింతరాల్రా !' బాధగా అన్నాడు శేషు.

'ఎప్పుడు ? ఎనిమిది నెలల క్రితం ! ఇప్పుడా టెక్నికల్ దోషాలేమీ వుండవు' కృష్ణమూర్తి సముదాయించేడు.

గ్లాసుల్లో విస్కీనిపోస్తూ విన్నాడు వెంకుబాబు. కృష్ణమూర్తి ఇప్పుడతనికి దేవుళ్లాగా కనుపించడం లేదు. మనిషిలా గానూ కాకుండా పచ్చి నెత్తురుతాగే రాక్షసపీనుగులా కనుపిస్తున్నాడు. మళ్లా కృష్ణమూర్తి కుటుంబసభ్యులు గుర్తుకురాగా వెంకుబాబు కళ్లల్లో నీళ్లు తిరిగేయి.

'ఆలస్యం తగదోరేయ్... వెంటనే తొరగా పిలిపించు... మండిపోతోంది ఆనక ఇబ్బంది పడిపోవాలి...తొరగా పిలిపించు.' అన్నాడు రాఘవ.

కృష్ణమూర్తి వెంకుబాబుని చూసేడు.

'మిస్టర్ బాబూ !... నీకు నీలూ తెలుసా? మిస్ నీలవేణి... తెలుసా ?'

'నాకు తెలీదుసార్ !'

'డేం నాన్‌సెన్స్... తనేం సెక్రటరీ సెండ్ హిమవుట్ !' శేషు కేకలుపెట్టేడు.

వెంకుబాబుకి కోపం వచ్చింది. కానీ దాచేసుకున్నాడు. ఇంత విశాలమైన ప్రపంచంలో ఒకానొక వేశ్య, నీలవేణి తెలీకపోతే సెక్రటరీ పదవికే భంగమా ? మనిషి ఉన్మాదుడవుతున్నప్పుడు ఇలాంటి అపశృతులే వినిపిస్తాయని వెంకుబాబు అనుకుని కోపాన్ని దిగమింగుకున్నాడు.

'నీకు తెలీకపోతే...నా డ్రైవర్‌కి తెలుసు.. గో విత్ ది కార్ ! హి విల్ టేక్యూ టు నీలవేణి ! నేను రమ్మన్నానని చెప్పు... నోరెత్తకుండా వస్తుంది...అసలు, నా కారునిచూస్తేనే చాలు... ఎగిరి గంతేసి కూచుంటుంది... గో మేన్ ! గో ...' కృష్ణమూర్తి మధ్య మధ్య కళ్లు మూసుకుంటూ తాను చెప్పదలుచుకున్న దంతా చెప్పేసేడు.

పుట్టెడు దిగులుతో వెంకుబాబు రహదారి బంగళాను వదిలేడు. రేపు ఉద్యోగమే వదిలేసేయాలని నిర్ణయించుకున్నాడు.

* * *

నీలవేణి ముగ్గురు మిత్రులమధ్య చాలా విలాసంగా కూచుని వుంది. ఆమె ముందు ఒక గ్లాసు నుంచేడు కృష్ణమూర్తి. వెంకుబాబు వేపు చూసేడు.

వణుకుతున్న చేతుల్తో ఆ గ్లాసులో కూడా విస్కీని పోసేడు వెంకుబాబు. నీలవేణి వెకిలిగా నవ్వింది. నవ్వి ఆ గ్లాసునెత్తి ముగ్గురిమిత్రులకు జైకొట్టింది. ఒకే ఒక్క గుటకలో సగంగ్లాసుని పూర్తిచేసి గొంతు తడుపుకుంది.

వెంకుబాబు ఆశ్చర్యపోయేడు. దేవుడు ఈ స్త్రీకి ఇంత అందాన్నీ సొగసునీ ప్రసాదించి— దురలవాట్లను కూడా ఎందుకు జత చేసేడని వాపోయేడు.

మిత్రులు ముగ్గురూ నీలవేణి చొరవకి హర్షం వెలిబుచ్చేరు. ఆడదంటే అంత దమ్ములో వుండాలన్నారు. స్వచ్ఛమైన ఆడది నీలవేణి ఒకర్తేనని అన్నారు. ఆడది నీలవేణిలాగా వుండకపోతే మగవాడనేకమైన ఈతిబాధల్లో యిరుక్కుంటాడనీ అన్నారు. ఇంకా ఆ బాపతు పలుకులే చాలా చాలా అన్నారు.

వెంకుబాబుకి అప్పుడు అన్నపూర్ణమ్మ గుర్తుకు వచ్చింది. అందువల్ల. ఇక్కడి గుంపు మీద రోత కలిగింది.

'నాకు మందక్కర్లేదు ఫ్రండ్ ! నీలు కావాలి.. నా ప్రియమైన నీలూ కావాలి నా నీలుని నాకిచ్చేయండి' మత్తుగా అంటున్నాడు రాఘవ.

'అలాగే' అన్నాడు శేషు.

'నో!...ముందు నాక్కావాలి ఆ తర్వాతనే మీరు...ఏది రైటో కావలిస్తే నా నీలునే అడగండి' అంటున్నాడు కృష్ణమూర్తి.

రాఘవ నీలుని అడిగేందుకు సిద్ధమయ్యేడు.

అంతలో...

ఎక్కడ్నుంచో ఏడుపు వినిపించింది, పసిపిల్ల ఏడుస్తోంది. డ్రైవరు పెద్ద గొంతుతో సముదాయిస్తున్నాడు. అయినా, ఏడుపు ఆగడం లేదు. గుక్కతిప్పుకోకుండా ఏడుస్తోంది. కృష్ణమూర్తికి చిరాకనిపించింది. నీలవేణివేపు కోపంగా చూస్తూ అడిగేడు —

'ఎవరది ఏడ్చేది ? '

నీలవేణి కంగారుగా లేచి నించుంది. రాఘవ ఆమె చేతిని గుంజి కూచోపెట్టేడు. నీలవేణి అన్నది...

'నా పిల్ల !'



'నీ పిల్ల? ఎందుకు తెచ్చేవ్ ? ... నిన్ను రమ్మని ఖబురంపేనేగానీ ... నీ పిల్లా జెల్లాని తీసుకు రమ్మనలేదే ?' అన్నాడు కృష్ణమూర్తి.

నీలవేణి బిక్కు బిక్కుగా సమాధాన మిచ్చింది—

'మీకు చూపిద్దామని తీసుకొచ్చేను.'

'ఇప్పుడెందుకా ముచ్చట ?' కోపంగా అరిచేడు కృష్ణమూర్తి.

'అది మనపిల్లండి !' అన్నదామె.

...మాటకి మిత్రులిద్దరూ పక పకా నవ్వేసేరు.

'స్టాపిట్ ! స్టాప్ ది నాన్‌సెన్స్' కృష్ణమూర్తి గట్టిగా అరిచేడు.

నవ్వు లాగిపోయేయి.

'ఎవరైనా నవ్వేరా మీ ప్రాణాలుతీస్తాను. నీలూ ! నువ్వేం మాట్లాడుతున్నావో వాళ్ళ తెలిసే మాట్లాడుతున్నావా ? డొక్క చీరేస్తాను జాగ్రత్త ! మన పిల్లట—మన పిల్ల ! కావలిస్తే డబ్బుదుగు. నా దగ్గరది చాలా వుంది. దానం చేస్తాను. నా యిష్టమొచ్చినంత దానం చేస్తాను. డబ్బుకి కక్కుర్తిపడే ముండవి ... మన పిల్లట — మన పిల్ల ! బజారు పిల్లని నా పిల్లన్నావంటె నీ నాలిక తెగ్గోస్తా ! బి కేర్‌ఫుల్ ! ... బాబూ, నువ్వెళ్లి ఆ పిల్ల నోరు నొక్కేయ్ ...' అన్నాడు కృష్ణమూర్తి.

నీలవేణి గభాలున లేచి నించున్నది.

'వొద్దొద్దు, పసిపిల్ల నోరు నొక్కి పాపం మూట కట్టుకోవద్దు. అది పాలకోసం ఏడుస్తోంది. నన్నెళ్లనీండి. దానికి పాలిచ్చి వస్తాను.' అంటోంది నీలవేణి.

రాఘవా, శేషూ కలిపి ఆమెను కూచో పెట్టేసేరు !

'నో ... నో ... నువ్వెళ్లిపోతే మేం చచ్చిపోతాం. ఇదికూడా పాపమే ... బాబూ... పాలు బాబిస్తాడు. బాబూ, బయటికెళ్లి పిల్లకి పాలివ్వు గో...' అన్నాడు రాఘవ.

'పిల్లను తెచ్చింది చాలక దాన్ని ఏడిపించి పాలిచ్చి ముచ్చట తీర్చుకుంటావా ?

# పాలు

యూ బ్లడీ బిచ్! ఐవిల్ పనిష్‌యూ !' బాబూ, ఆ ఖాళీసీసా అందుకో' అన్నాడు కృష్ణమూర్తి.

బాబు సీసా తీసుకోలేదు.

'బాబూ !' అరిచేడతను.

బయట పసిపిల్ల ఏడుస్తునే వుంది. వెంకుబాబుకి కృష్ణమూర్తి పిల్లలు ముగ్గురూ గుర్తుకొచ్చేరు. ముఖ్యంగా, ఆ అందమైన బుజ్జి అతని మనంతా నిండిపోయి వున్నాడు. అతనికి ఏడుపు ముంచుకొస్తోంది. ఏం చేయడానికి తోచలేదు. కృష్ణమూర్తి ఆజ్ఞ ప్రకారం ఖాళీసీసాని తెచ్చి కృష్ణమూర్తి ముందుంచేడు.

ఆ సీసాలో కృష్ణమూర్తి విస్కీ పోసేడు. ఆ విస్కీపోసిన సీసాని వెంకుబాబు కిస్తూ అన్నాడు—

'ఇవి పాలు ! అండర్‌స్టాండ్... వెళ్ళ ... వెళ్లి ఈ పాలు దానిచేత తాగించి ఏడుపునాపు వెళ్ళ.'

వెంకుబాబు సీసాని తీసుకున్నాడు—

'నిజమేసార్ ! తెల్లనివన్నీ పాలు నల్లనివన్నీ నీళ్ళు కానేకావు...ఇవిపాలే ! ... ఈ విస్కీ పాలని దానం చేస్తున్న మీరు మాత్రం దానకర్ణులు ... పరమభక్త శిఖామణులు ... ఆదర్శ గృహస్థులు. ఆ పిల్లచేత ఈ విస్కీని తాగించే దానికంటె, సముద్రంలో ఆ పిల్లను ముంచేయడమే మేలు ... మత్తులో వుండి మీరు నా చేత చేయించబోయే దుర్మార్గాన్ని సహించలేను. ఈ రాత్రంతా ఆ బిడ్డ నా దగ్గరే వుంటుంది. నగరంలో ఈ రాత్రంతా పాలకోసం తిరుగుతాను. పాలు సంపాయించి, ఆ బిడ్డకిచ్చి తృప్తిపడతాను. ఈలోగా నీలవేణితో మీరు పాపం చేసుకోండి. వస్తాను' అనుకుంటో వెంకుబాబు విస్కీ సీసాతో కదిలేడు.

నీలవేణి తన బిడ్డకోసం పెనుగులాడుతోంది. రాఘవ, శేషు ఆమె నక్కణ్నుంచి కదలనీడంలేదు. వెళ్లిపోతున్న వెంకబాబుని మైకం కమ్మిన కళ్లతో చూసేడు కృష్ణమూర్తి !

చిత్రం !

వెంకుబాబు ఎవరోకాదు ... సాక్షాత్తు వేణుగోపాలస్వామి ... అతని చేతిలో వున్నది విస్కీసీసా కానేకాదు — వెన్నెల్లా హాయిగా నవ్వుతూన్న పసిబిడ్డ, అపరంజి బొమ్మ, ఆడపిల్ల !

వెంకబాబుని ఆగిపొమ్మని కేక పెట్టబోయేడు కృష్ణమూర్తి —

ఇంతలో ...

ఫోన్ మోగింది. బహుశా ఈ పిలుపు తనకోసమే కావచ్చు. ఇంట్లోంచి అన్నపూర్ణ చేస్తోంది కాబోలు ! కాదు కాదు ... పెదబాబు పిలుస్తున్నాడేమో ! ఏ ఖబురు చెబుతాడో ... ఏం వినవలసి వస్తుందో ...

'భగవంతుడా !' అనుకుంటో, వణుకుతూన్న చేతుల్తో ఫోనెత్తేడు కృష్ణమూర్తి ! ●

# విఘ్న రాజాయనమః !

కుడుము లుండ్రాళ్ళు పాయసం కూర్మిజేసి
పూలు ఫలములు పత్రులు పొందుపరచి
వినయముగ ధూప దీప నైవేద్యములను
పెట్టి పూజింతుమయ్య ఓ విఘ్నరాజ !

మూడు కోట్ల దేవతలును ముందు నీకు
పూజగావించి పనులకు పూనుకొంద్రు
గాన మేమెంత ! విను గొల్వబూనకున్న
శాపగతిని బొందమె ? నీలాపనింద

సీత జాడను దెలియంగ సేతుగట్టు
ముందు, శ్రీరాముడే నిన్ను ముదము గొల్చె
ద్యూత క్రీడలో రాజ్యంబు దోచినపుడు
రణమునకు ముందు విను ధర్మరాజు గొల్చె

అట్టి గణనాథ ! విఘ్నేశ ! అఖిల విజయ
మూషికము నెక్కి విహరించు ముదిత హృదయ
అక్రమార్గాలు ఆపదల్ అదుపుచేసి
మమ్ము కాపాడుము అనుగ్రహమ్ము తోడ.

— తమ్మిశెట్టి రామారావు

ఇదిగో! నేను మా పుట్టింటికి వెళ్ళి ఓ పదిరోజుల దాకా రాను! రేపట్నుంచీ నేనొచ్చేవరకు నీ బదులు పన్లోకి మీ అమ్మను పంపించు తెల్సిందా??



మనకో మంచి శుభవార్త! మరో పదిరోజుల్దాకా రానంటూ మా ఆవిడ ఉత్తరం రాసింది!!



# కొత్త గొంతులు

**— టి.యల్. కాంతారావు**

గుండెల్లో అగ్నికి ఆజ్యం
ప్రజ్వరిల్లుతున్న కులమత తత్వం
ఉచ్ఛనీచాల పైశాచిక నృత్యం
మంటకలుస్తోంది మానవత్వం
దేశద్రోహుల సర్వాలాలసత్వం
పదవులపై వ్యామోహం
కక్షల కావేశాల నడుమ
సామాన్యుని నిరంతరభేదం
స్వార్థానికి రక్తాభిషేకం.

**– శ్రీమతి వాణీరంగారావు**

తెలుగు కవిత్వాన్ని సుసంపన్నం చేస్తున్న ఆధునిక కవయిత్రులు ఎంతోమంది లేరు. అట్లాంటి అతి తక్కువ మందిలో శ్రీమతి వాణీరంగారావుగారు ఒకరు. రచయిత్రులు తెలుగు పాఠకుల్ని ఊహాగానాల్లో, కాల్పనిక మత్తుల్లో, ప్రేమ పురాణాల్లో, వాస్తవ దూరమైన ఇతివృత్తాల్లో ముంచి లేవనెత్తుతుంటే అల్పసంఖ్యాకులైన రచయిత్రులు కవయిత్రులు మాత్రమే ఈ సంఘాన్ని గురించి, దాని పోకడను గురించి, దాని జీవితాన్ని గురించి పట్టించుకుని రాస్తున్నది. వాణీరంగారావు గారు కవిత్వంలో వచన కవితా ప్రక్రియకు నిబద్ధమై రాస్తున్నారు. కొంత వైయక్తికంగా, కొంత సామాజికంగా ఈమె రచన సాగుతుంది. వైయక్తిక భాగంలోకూడా అర్థంగాని అయోమయంగాని, అరాచకత్వం గాని ఈమె కవితల్లో ఉండవు. సామాజిక స్పృహ కలిగిన కవితాభాగంలో ఏ ఇజానికి కట్టుబడని మానసిక స్థితి కనబడుతుంది. రచయితల వర్గాలతో ఈమెకు ఏమాత్రమూ సంబంధంలేదని కవితాఖండికలే ఋజువుచేస్తున్నాయి. దానవత్వం అంతరించి మానవత్వం అవతరించాలని ఈమె ఆశ.

స్కాచ్ విస్కీలో కలం ముంచి ఆకలి కవిత్వాన్ని రాసేవాళ్ళను, దేశాన్ని కొల్లగొట్టి పేదవాళ్ళకు దానం చేస్తానసే వాళ్ళను, దేశమంటే మనుషులన్నది మరచిపోయి దేశానికి సేవ చేస్తాననేవాళ్ళను, దేవుణ్ణి అశుద్ధంలో నిలిపి నిత్యం స్తోత్రం చేసేవాళ్ళను, అనుచరులను గొర్రెల్ని చేసి నాయకత్వం చెలాయిస్తున్న వాళ్ళను, ప్రేక్షకుల్ని గుడ్డివాళ్ళను చేసి అమోఘంగా నటిస్తాననేవాళ్ళను ఈమె తన కవిత్వంలో అపహాస్యం చేసిన తీరు మెచ్చతగింది. పేదరికం కళ్ళల్లో దుఃఖాన్ని దర్శించారు ఈమె. జీవితాల్లో అవినీతి పెంచుకుంటూ, గుండెల్లో దురాశను నింపుకుంటూ, అనుభవం కోసం అంతర్యాన్ని చంపుకుంటూ, ఆర్జించిన కీర్తిని మెట్లుగా ఎంచుకొంటున్న వాళ్ళకు కవితా చురకలనంటించారు.

దీర్ఘకాలపు నిద్రనుండి తన దేశం మేల్కొనాలని, కన్న కలలు వాస్తవాలుగా మారాలని, కాలుతున్న డొక్కలు నిండుగా నిండాలని, తన దేశంలో శ్రమజీవుల స్వేదం, మేధావుల జ్ఞానం వృథా కారాదని ఆశిస్తున్న కవయిత్రి ఈమె. గుండెలలో కులాల కత్తులు చేస్తున్న గాయాలను, గొంతులకు అడ్డం పడుతున్న వర్గాల వెలక్కాయలను, చేతులకు తగిలించబడ్డ పార్టీల సంకెళ్ళను, కాళ్ళకు పెనవేసుకొన్న మతాలతీగలనుదాటి మహోన్నత మానవత్వం వైపు పయనించమని తన కవిత్వంలో సందేశం వినిపిస్తున్నారు శ్రీమతి వాణీరంగారావు.

తన చుట్టూ తానే గోతులు తవ్వుకుంటూ, స్వార్థపు ఊబిలో తనకు తానే మునుగుతూ దిక్కు తెలియకుండా ప్రయాణిస్తున్న మనిషి, మృగంలోంచి పుట్టిన మనిషి తనలోని మృగానికి ప్రాణప్రతిష్ట చేస్తున్నప్పుడు మానవత్వానికి స్థానమెక్కడ ? మనిషికి విలువెక్కడ ? అని ఈ మె ప్రశ్నించటంలో ఆశ్చర్యం ఏముంది ?

అస్తి నాస్తి విచికిత్స ఈమెకు కూడా ఉంది. అనంత శక్తి స్వరూపం ఒక భావన అయితే దానికోసమే తన తపన అని, అది సత్యమూ, సాకారమూ అయితే అదే తన కాలంబనమని కవయిత్రి చెప్పారు. యూమెర్సీరెస్ అనే ఖండికలో భగవంతుని రూపంలో



ఉన్న రాయికి, ఆకలితో బాధపడుతున్న మనిషికి గల వ్యత్యాసాన్ని ఈమె చెప్పిన తీరులో 'భగవంతుడు' అనే కాన్సెప్ట్‌మీద వ్యంగ్యం కనబడుతుంది. రాయికి విశ్వమంత లోగిళ్ళు, బంగారపు వాకిళ్ళు. బీదలు నోరు తెరచి అడిగినా ఛీత్కారాలూ, చీదరింపులూ అంటారీమె. అంతేకాదు దేశాన్ని ధర్మభూమిగా, కర్మభూమిగా భావింపచేస్తూ, మనుషుల్ని పురాకృత కర్మలకు బానిసలనుచేసి, శరీరాల్లోని రక్తాన్ని నీళ్ళుగా మార్చి, జాతిని నిర్వీర్యం చేసి ఒక్కొక్క మహానుభావుడు ఒక్కొక్క దేవుడుగా మారిపోతున్నాడని ఇది దేశానికి అరిష్టమని, ఇది జనులపాలిట ఘోర శాపమని వాపోతున్నారు కవయిత్రి. ఎందుకు అని ప్రశ్నించేవాళ్ళకు కష్టాలేతప్ప సుఖాల్లేవని ఇంకా సూర్యుణ్ణి పాము మింగేస్తుందని, చంద్రుడిలో స్వర్గముందనీ నమ్మేవాళ్ళకు సుఖమే తప్ప కష్టంలేదని 'ఇంకా అజ్ఞానం'లో సెటైరికల్‌గా చెప్తారీమె.

వచన కవిత్వం కనిపెట్టిన ప్రతివాళ్ళకూ అందుబాటులో ఉన్నమాట నిజమేకాని కవిత్వ రహస్యం బోధపడకుండా కవిత్వం రాయటం కష్టమని చాలామందికి తెలియదు. వాణీరంగారావుగారి వచన కవిత్వంలో ఒకే ఒక్క లోపం అంత్యప్రాస కోసం వెంపర్లాడటం. అంత్యప్రాస చాలాచోట్ల కవిత్వాన్ని క్రిందకు లాగుతుంది. వాణీరంగారావుగారి దీపం కవితా సంకలనంలో ఆమె అంత్యప్రాస ఉపయోగించిన చోటల్లా కవిత్వం తన శక్తిని పోగొట్టుకొన్నట్టు స్పష్టంగా కనబడుతుంది. భాషలో ఆమె సాదించిన సారళ్యం గొప్పది. చదువరిని తికమకపెట్టే ధోరణి ఈమె రచనలో కనపడదు. వస్తు దృష్ట్యా ఈమె దృక్పథం విశాలమైనది. అందరికీ కవిత్వం రాయటం సాధ్యం కాదని, పండితులైన వారందరూ కవులు కారని, కవిత్వం హృదయంలోంచి పుట్టి హృదయాలను కదిలిస్తుందని ఆమె చెప్పారు. ఆధునికీ కవిత్వంలో సామాన్యునికి ప్రాముఖ్యం గురజాడతోనే ఆరంభమైందని ఆమె విశ్వసించి ఆ ఒరవడి తన నుడిగా మార్చుకున్నారు. తిలక్ అన్నట్లుగా కవిత్వ రహస్యం కవికే తెలుస్తుంది. "సంఘంలో రచయితకి ఒక స్థానం కావాలి. సమాజాన్ని మార్చేవిధానం కావాలి, అంటారు ఆమె. నిజమే కొన్ని వేల తుపాకులు సాధించలేనిదాన్ని ఒక మంచి వాక్యం సాధించగలగడం ఈ దేశానికి, ఈ జాతికీ అనుభవైకవేద్యమే. నీరెండ — తొలకరి వెన్నెల కలిస్తే ఎలా ఉంటుందో ఈమె సాహిత్యం అలా ఉంటుంది" అన్నారు చిట్టిబాబుగారు ఈమె సంకలనానికి పీఠికలో.



# కొత్తరకం శిక్ష!

ఎవ్స్వర్త్ నగరంలోని వో పబ్లిక్ టెలిఫోను బూత్‌లో 20 ఏళ్ల ఇంగ్లీషు వనిత షూ చెర్మన్ అనే ఆమె తనకిష్టమైనవారితో టెలిఫోనులో చాలాసేపు మాట్లాడసాగిందట. బయట పెద్ద క్యూగా నిలబడిన జనం విసిగి, ఆ జనంలో కొందరు మేధావులు ఆమెకో కొత్త రకం శిక్ష ప్రసాదించి, అంతా వెళ్ళిపోయారట. ఈ సుందరి రోజంపావు మాట్లాడాక "హా బై" అని ఫోనుపెట్టేసి బూత్‌లోంచి బయటపడదామని చూస్తే తలుపు రానేలేదట కారణమేమని చూస్తే — విసుగెత్తిన క్యూజనం ఫుట్‌పాత్ వైడానికి పెట్టిన సిమ్మెంటు పలకలుతీసి ఆ తలుపుకు అడ్డుగాపెట్టి సిమ్మెంటు పూసి వెళ్ళిపోయారట!




## అతి తెలివి!

బత్తాయికాయల రసంతో తయారైన మెండరిన్ స్పిరిట్ అనే వాహ రకం ఆల్కహాలుతో జపాను విజ్ఞానులు వో కారును, రెండు మోటారుసైకిళ్ళనూ నడిపి, ఆనంద జయోత్సాహాలతో జబ్బలు చరుచుకుని, అంతలో నీరు కారిపోయారట. వో లీటరు మెండరిన్ స్పిరిటు తయారవడానికి పదకొండువేల బత్తాయికాయలు కావాలట — తెలివి ఒక్కోప్పుడు పట్టు తప్పుతుందంటారిదేనా!

## పాఠాలు చెప్పడం చేతకాక ....!

పోర్చుగీసు దేశంలోని కొన్ని ఇంగ్లీషు స్కూళ్ళలో యీనాటి క్కూడా టీచర్లు చదువు చెప్పే సందర్భంలో చిన్నపిల్లలను దారుణాతి దారుణంగా కొట్టి చంపుతున్నారట. 1982వ సంవత్సరపు లెక్కలలో యిలా టీచర్ల చేత హింసింపబడి, మానసికంగా దెబ్బతిన్న చిన్న




పిల్లలు వో రెండొందలపైగా తేలిందట. ఏటేటా చాలమంది చిన్న పిల్లలు సైకియాట్రిక్ ఆసుపత్రుల పాలవుతున్నారట— సరిగా పాఠం అర్థమయ్యేలా చెప్పలేని ఉపాధ్యాయుడే పిల్లల్ని కొడ్తాడనే నానుడి వోటుంది.

## దొంగతనం చెయ్యబోయి ఉరిపోసుకున్న వడ్రంగి!

సేలం స్టీల్‌ప్లాంటు కాలనీలో వాహ ఆఫీసరు గారింట్లో వడ్రంగి పని చేస్తూన్న రాజప్పన్ అనే 25 ఏళ్ళ వ్యక్తి ఆ ఆఫీసరుగారు ఆఫీసుకు వెళ్ళాక ఆయన భార్య వంటరిగా వుండడం చూసి కత్తి చూపి ఆమెను ఝడిపించి నగలన్నీ తీసివ్వమన్నాడట. కానీ ఆవిడ తెలివిగా పెరటి దోవన బయటపడి గావుకేకలేసి సరికాతను తాను బయటకుపోలేక తలుపులు వేసేసుకుని, లోపల వురిపోసుకు చచ్చిపోయాడట భయంతో.

## సీటురాని విద్యార్థి ఆత్మహత్య!

సేలం అమ్మాపేటకు చెందిన 25 ఏళ్ళ రాజేంద్రన్ అనే కుర్రాడు పాలిటెక్నిక్ పరీక్ష ప్యాసయి, అంతతో తృప్తి పొందక ఇంజనీరింగు పట్టా పొందాలని సేలం ఇంజనీరింగ్ కాలేజీలో సీటుకు దరఖాస్తు పెటుకుంటే అది రాప్పన తిరిగి వచ్చేసిందట. దాంతో అతనికి భావావేశం కలిగి, పోలీసులకో వుత్తరం రాసి జేబులో పెట్టుకుని త్రివేంద్రం నుంచి మద్రాసు వెళ్ళే రైలు క్రిందపడి ఆత్మహత్య చేసుకున్నాడట.

## విరసంగా మారిన సరసం!

తమిళనాడు నుంచి బొంబాయి వెళ్ళి అక్కడ స్థిరపడి, వో రకంగా బానే సంపాదించుకున్న 25 కాళిముత్తు, ఆతని తండ్రి ఆరుముగమూ మారియమ్మ పండుగకు సేలం వచ్చారట. కాళిముత్తు తన తండ్రిని తన వద్దనున్న అయిదువేలూ యిచ్చి, దాచి పొద్దున్నివ్వమన్నాడట. ఆ మర్నాటి వుదయం డబ్బేదనడిగితే ఆర్ముగం తన కుడిచై గాలిలో తారంగం తిప్పాడట. దాంతో తిక్కరేగిన కాళిముత్తు తన తండ్రిని క్రింద పడేసి, కాలుతో పీకమీద అడుగేసి తొక్కాడట దాంతో ఆర్ముగం అక్కడికక్కడే చచ్చూరుకున్నాట్ట.

## స్త్రీ బుద్ధి....!

ఛండీఘర్‌లో దొంగలు యీమధ్య బాగా అలంకరించుకున్న (నగలతో) ఆడవారిని పట్టుకు ఆ నగల్నొక్కుపోడానికి అనేక రకాల కొత్త పథకాలు వేసి, సినిమా హాళ్ళ దగ్గర ఆటో డ్రయివర్లలా ఆటోలతో కాపులు కాసి, తమ పనులు చకచక చేసుకుపోతున్నారట. దీనిని నివారించ మార్గాంతరాలు ఆలోచించిన అక్కడి స్త్రీ పోలీసు అధికారిణి వో పథకం వేసి, ఆ ప్రకారం తామూ, తన సిబ్బందిలో ఆడవారూ మామూలుగా చీరలు కట్టుకు, నగలు వేసుకుని రెండో ఆట సినిమాలకు వెళ్ళి, ఆ దొంగలకు దొరికినట్టు దొరికి, ఆనక వారిని లాఘవంగా నెట్టెయ్య నారంభించారట — స్త్రీణాం... బుద్ధి శ్చాపి చతుర్గుణం... అననే అన్నారు కదా!




## భూమిపై 450 కోట్ల జవాభా!

పోయిన ఏడు తీసిన లెక్కల ప్రకారం యీ భూప్రపంచంలో 450 కోట్ల 80 లక్షల మంది జనులున్నారట. ఇందులో 290 కోట్లకు పైగా ఆసియా ఖండంలోనే వున్నారట.

## అమెరికాలో బానిసలుగా పోర్చుగీసు పిల్లలు!

పోర్చుగీసు దేశంలో చిన్నపిల్లలు పుష్ కాకి అన్నంతగా మాయమై యునైటెడ్ స్టేట్స్ నగరాలలో తేలుతున్నారట. యునైటెడ్ స్టేట్స్‌లో పిల్లలను బానిసలుగా కొనే గిరాకీ వున్నందువల్ల పోర్చుగీసులో మాంచి పిల్లలను మటుమాయించేసే గ్యాంగులు ఆ దేశపు రాజకీయ, స్థానిక పెద్దల అండదండలతో అలరారుతున్నాయట.



సీరియల్

# మానస మురళి

కొమ్మూరి సాంబశివరావు

(గత సంచిక తరువాయి)

విజయ్ ఏమైనా ఆ ముసలి బ్రాహ్మణునికి సాయం చేయాలనిగట్టిగా అనుకున్నాడు. వెంటవెంటనే నలుగురు పి. సి. లను బస్టాండువైపు— స్టేషను వైపు— నేరస్థుల వివరాలు చెప్పి తలో వైపు పంపించాడు. నగరంలో వున్న అన్ని లాడ్జింగులకు ఫోన్ చేసి— తనకు కావల్సిన వాళ్ల వివరాలు పోలికలు చెప్పి 'అలాంటివారు ఎవరైనా అనుమానించ తగ్గట్లు వున్నట్లయితే తనకు తెలియపరచమని' చెప్పాడు విజయ్.

మరో గంట తరువాత ఊరి చివరగా వున్న రఘురామ్ లాడ్జి నుంచి ఫోను వచ్చింది. "సార్ ! నిన్న ఉదయం ఒక అమ్మాయి— అబ్బాయి భార్యాభర్తలమని చెప్పి రూమ్ నెంబరు సెవెన్‌లో దిగారు. మాకు కాస్త అనుమానం కలిగింది గానీ, భార్యా భర్తలమని చెప్పడంతో నమ్మాల్సి వచ్చింది—" అని ఫోన్‌లో చెప్పాడు లాడ్జి మేనేజరు.

"అలాగా ! వాళ్లిప్పుడు రూమ్‌లోనే వున్నారా ?—" ఆత్రుతగా అడిగాడు విజయ్.

"వున్నారు సార్. నిన్న ఉదయం నుంచీ ఎక్కడికీ కదల్లేదు—"

"ఆల్‌రైట్ ! వారినొక కంట కని పెట్టండి. నేనిపుడే వస్తాను—" ఫోన్ పెట్టేసి చకచకా బయటకు వచ్చి మోటర్ బైకును ముందుకు దూకించాడు వేగంగా.

విజయ్ వెళ్లేసరికి వాళ్లిద్దరూ రూమ్‌లోనే వున్నారు. వాళ్ల రూపురేఖల్ని చూశాక తను వెదుకుతున్నది వాళ్లనేనని అనుమానం దృఢపడింది. రకరకాల ప్రశ్నలు వేశాడు. భయపెట్టి వాళ్లచేత నిజం కక్కించాడు.

"సార్ ! మేము ప్రేమించుకున్నాం. ఇది తప్పంటారా ? ఒకరంటే ఒకరం ఇష్టపడి వచ్చాం—" అని శశికర్ కాస్త ధైర్యం తెచ్చుకుని అన్నాడు.

విజయ్ అతనివంక కోపంగా చూశాడు. రెండు అడుగులు ముందుకు వేసి— "ఏమన్నావ్? ప్రేమించావా? అంత ప్రేమించినవాడివే అయితే ధైర్యంగా పెద్దవాళ్లకు చెప్పి పెళ్లిచేసుకోవాలి. ఇలా ఎవరికీ తెయకుండా ఆ అమ్మాయిని లేపుకు రావడం ఎంత నేరమో తెలుసా ?—" విజయ్ కంఠంలో ధ్వనించిన కాఠిన్యతకు— కరుకుతనానికి శశికర్ మళ్లీ పెదవి విప్పలేకపోయాడు.

"ఏమిటి మాట్లాడవు ? చేసిన వెధవ పనిని ప్రేమ పేరిట సమర్థించుకుంటావా ? పద స్టేషనుకు—" అని ఉరిమి చూశాడు విజయ్.

శశికర్ నిర్లక్ష్యంగా తల ఎగరేశాడు.

"మేము రాము. మా ఇద్దరికీ ఇష్టమైనపుడు మీకేమిటి మధ్య —" మొండిగా రోషంగా అన్నాడు శశికర్. అంతే విజయ్ అతని చొక్కా కాలరు పట్టుకుని విసురుగా చెంప ఛెళ్లుమనిపించాడు. ఆ దెబ్బతో శశికర్ ధైర్యం నీరుగారిపోయింది. దొరికిపోయిన దొంగలాగ తల దించేసుకున్నాడు. ఆ ఇద్దర్నీ రిక్షాలో ఎక్కించి స్టేషన్‌కు తీసుకువచ్చాడు. మధ్యలో రిక్షాలోంచి దూకి పారిపోవాలని చూసాడు శశికర్. కానీ, విజయ్ అతని ఆటల్ని సాగనివ్వలేదు.

శశికర్ని లాకప్‌లో పడేశాడు. దమయంతిని తన పరసనల్ గదిలోకి పిలిపించుకున్నాడు. ఆమెకు అనేకరకాలుగా హితబోధ చేసాడు.

"చూడమ్మా. నీ వయసెంత ? పద్దెనిమిదేళ్లు. ప్రేమను గురించి నీకేం తెలుసునని వాడివెంటబడ్డావు ? వాడో పిరికి వెధవ. నీ కళ్లారా నీవే చూసావుగా. ఒక్క దెబ్బతో ఎలా మారిపోయాడో...అలాంటి పిరికివానిని కట్టుకుని నువ్వేం సుఖపడదామనుకున్నావు ?"

"లేదుసార్. మీరు పోలీసాఫీసరు కాబట్టి మీ ముందు భయపడ్డాడు. నిజానికి శశికర్ చాలా ధైర్యవంతుడు. అతనిలో తెగువ, ఆ ధైర్య గుణాల్ని చూసే ప్రేమించాను. నా వయసు చిన్నదే కావచ్చు. నాకూ ఓ మనసుంది. ఆ మనసులో తనికి తప్ప మరొకరికి చోటివ్వలేను—"

"ఏమిటి అతను ధైర్యవంతుడా ! అంత ధైర్యవంతుడయితే రిక్షాలో నన్ను వదిలేసి ఎలా పారిపోవాలని చూస్తాడు ?" తీవ్రంగా అడిగాడు విజయ్.

ఆ మాటలకు సమాధానం చెప్పలేక తల దించుకున్నది దమయంతి.

రెండు క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి.

"నిన్ను చూస్తుంటే జాలేస్తుందమ్మా ! నిజమే ప్రేమకు వయసుతో నిమిత్తం లేదు. ప్రేమించినవాడిని పొందడంకన్నా ఆడదానికి మరో అదృష్టంలేదు. పెద్దలు అంగీకరించకపోతే ఆ ప్రేమికులు లేచివెళ్ళి పెళ్ళి చేసుకోవడాన్ని నేనూ సమర్థిస్తాను.

కానీ; ఇక్కడే ప్రతి ఆడపిల్లా తప్పటడుగు వేస్తుంది." అని ఆగి ఆమె ముఖంలోకి చూసాడు విజయ్."

దమయంతికి ఆయన మాటలు ఆశ్చర్యంగానూ — బాధగానూ వున్నాయి.

"మా పెద్దవాళ్ళు మా పెళ్లికి వప్పుకోరని అతనితో వచ్చేశాను. శశికర్‌తో జీవితాన్ని పంచుకోవాలనుకున్నాను. అతనికికూడా నేనంటే ఇష్టమే. పెళ్లిచేసుకుని హాయిగా సంసారం చేయాలనుకున్నాను. ఇది తప్పటడుగు ఎందుకవుతుంది ?"

"ఎందుకుకాదు ? కన్నవాళ్లను కట్టుబాట్లను వదిలేసి ప్రేమించినవాడితో లేచి వచ్చేసావు. అది తప్పని నేనను. ప్రేమించిన వాళ్లకు ఆపాటి తెగింపు, ధైర్యం వుండాల్సిందే. మనసిచ్చిన వాడికోసం అన్నీ త్యజించాల్సిందే. కానీ, ఎలాంటి వాడికోసం ఇవన్నీ చేయాలి ? ఒక ఉత్తమ పురుషునికోసం. ఆ పురుషుడు తనను నమ్మివచ్చిన అమ్మాయిని ఎల్లవేళలా కంటికి రెప్పలా కాపాడుకోవాలి. ఆమె కష్టం తన

**జరిగిన కథ — 11 :** మానస ఉద్యోగం చేయడానికి ఒప్పుకోదు. ఈ నీచ వృత్తే నీకు ఇష్టం అని మానసను విజయ్ నిందించగా ఇన్ని మాటలకు బదులు తనను పెళ్లి చేసుకొని ఉద్ధరించమని అడిగి వెళ్లిపోతుంది. విజయ్ తను మానసను పెళ్లి చేసుకోడానికి నిర్ణయించుకున్నట్లు ఆమెకు చెపుతాడు. ఆమె అతనిని తన ఇంటికి తీసుకెళ్లి తన కుటుంబ సభ్యులను పరిచయం చేస్తుంది. మానస కోరిక ప్రకారం కోవెల్లో ఆమెను వివాహం చేసుకుంటాడు విజయ్. మానసను బలవంతంగా ఎత్తుకుపోయి రేప్ చేయబోయిన సుకుమార్ నుండి ఆమెను రక్షిస్తాడు విజయ్. ఈ సంఘటన తరువాత మానస ఇంట్లోంచి కదలకూడదని నిశ్చయించుకొంటుంది. తన చిన్ననాటి స్నేహితుడు శ్రీరామ్ వ్రాసిన ఉత్తరాన్ని చూసి మండిపడతాడు విజయ్. విజయ్ డ్యూటీలో వుండగా అతని దగ్గరకు ఓ పేద బ్రాహ్మణుడు వచ్చి లేచిపోయిన తన కూతుర్ని వెదికి పెట్టమని ప్రాధేయపడతాడు.

కష్టంగా భావించి ఆమెకు అండగా నిలబడ గలగాలి. ఎన్ని అడ్డంకులు వచ్చినా, ఎన్ని సమస్యలు తలెత్తినా పట్టిన చేయి విడనకుండా పోరాడే ధీరుడు కావాలి. అలాంటి గొప్ప వ్యక్తిని ప్రేమించి ఇల్లు వదిలి వెళ్ళిన ప్రతి ఆడపిల్లా సుఖపడుతుంది.

కానీ, శశికర్‌లాంటి స్వార్థపరుడ్ని అనుస రించి వచ్చిన యువతి జీవితం క్షణ భంగురంలా తెల్లవారుతుందే తప్ప — అది చివరిదాకా సవ్యంగా సాగదు. నిన్నంతగా ప్రేమించినవాడు తనొక్కడే ఎందుకు పారిపోవాలనుకున్నాడు? అలా పారిపోవాలనుకున్నప్పుడు — నిన్ను కూడా తీసికెళ్లవచ్చుగా? బుర్రకు పదునుపెట్టి ఆలో చిస్తే అతనెలాంటి కపట ప్రేమికుడో నీకే అర్థమవుతుంది.

పాలపొంగులాంటి వయసును నమ్మి ఎండ మావి వెంట పరుగులెత్తితే దప్పిక తీరదు. చదువుకున్న దానివి నేను చెప్పినది అసత్యమేమో ఆలోచించు—''

ఆ మాటలు దమయంతిలో సంచలాన్ని రేపాయి.

తీవ్రమైన సంఘర్షణకు లోనయింది.

విజయ్ మాటల్లోని సత్యాసత్యాలను ఆకలింపు చేసుకుంది.

శశికర్ చేసిన ఒకే ఒక చిన్న తప్పు — 'రిక్షాలో తనను వదిలి పారిపోవాలని ప్రయత్నిం చడం —' ఆ సంఘటన అంతై ఇంతై అనంతమై, ఆమె మనసులో అనుమాన బీజాన్ని నాటింది. భయాన్ని రేకెత్తించింది.

కళ్లకు కట్టిన పొరలు విచ్చుకున్నాయి.

విజయ్ — బలహీనమవుతున్న ఆమె మనసుమీద మరో దెబ్బ వేసాడు. మరికొంత భయాన్ని కలగజేసాడు.

''ఇప్పుడు చెప్పు దమయంతీ! ఇంకా శశికర్‌నే పెళ్లి చేసుకోవాలనుకుంటున్నావా? పెళ్లనేది నూరేళ్ల పంట. పెళ్లి విషయంలో రాజీపడితే జీవితాంతం బాధపడాల్సి వస్తుంది. రూపురేఖలున్న అందగాడికన్నా — కురూపియైనా అందమున్న మనసుగలవాడిని చేపట్టిన స్త్రీ జీవితం స్వర్గతుల్యమవుతుంది.

ప్రేమ పెళ్లి విఫలమైతే ఈ సంఘం యొక్క సానుభూతి నారికుండదు. అదే పెద్దలు చేసిన వివాహమైతే — ఒకవేళ ఆ వివాహం విఫలమైతే అందరి సహకార సానుభూతులు వుంటాయి. నేను నీకు అన్నలాంటివాడను. నీ మనసును స్థిరపరుచుకుని పెద్దలు తెచ్చిన సంబంధాన్ని ఒప్పుకో. త్వరలో నీ పెళ్లి వార్త వింటానని ఆశిస్తున్నాను — ''

దమయంతి కళ్లనిండుగా నీళ్లు నిలిచాయి.

కాలిన ఇనుముమీద ఒక్కొక్క సమ్మెట దెబ్బ పడినట్టుగా — ఆమె మనసుమీద విజయ్ మాటలు బాగా పనిచేసాయి.

కొన్ని క్షణాల తరువాత దమయంతి కళ్లు తుడుచుకున్నది.

''నన్ను మా యింటివద్ద వదిలిపెడ్తారా?'' అని అడిగింది.

విజయ్ సంతృప్తిగా విట్టూరుస్తూ తలూపాడు.

## 26

ఆ నగరంలో గొప్ప ధనికుల్లో రాజశేఖరం గారు ఒకరు. ఆయన ఏకైక పుత్రిక వాసంతి వివాహ సందర్భంగా గొప్ప మ్యూజికల్ పార్టీని ఏర్పాటు చేయించారు. ఆ పార్టీకి వధూవరులతో పాటు, బంధుమిత్రులు — ఆహ్వానితులు చాలా మంది హాజరయ్యారు. ఇనస్పెక్టర్ విజయ్‌క్కూడా ఆహ్వానం వెళ్లింది. భార్యా సమేతంగా ఆ పార్టీలో పాల్గొనాలనుకున్నాడు. కానీ మానస అందుకు సమ్మతించలేదు.

''మీరంటే పోలీసాఫీసరు. నలుగురికీ కావాల్సిన వాళ్లు. మీరెళ్లకపోతే బావుండదు. నాకింట్లో బోలెడు పనులున్నాయి మీరు వెళ్లిరండి — '' అని నవ్వుతూ సాగనంపింది భర్తను. భార్య మనస్తత్వం తనకు కొత్తేమీకాదు. ఆమె ఎక్కడికీ రాదని తెలుసు. ఎందుకో ఆ క్షణంలో మనసులో వేడి నిట్టూర్పు రగిలింది.

విజయ్ ఒక్కడే ఆ పార్టీకి వెళ్లాడు.

రాజశేఖరంగారి భవంతి రంగు రంగుల దీపాలతో దేదీప్యమానంగా వెలిగిపోతుంది. బయట రకరకాల ఖరీదైన కార్లు, స్కూటర్లు పార్కు చేసివున్నాయి. విజయ్‌కూడా బైక్‌ను పార్క్‌చేసి లోపలకు వెళ్లాడు. రాజశేఖరంగారు విజయ్‌ను సాదరంగా ఆహ్వానించి లోపలకు తీసికెళ్లి ఒక కుర్చీలో కూర్చోబెట్టాడు. అప్పటికే పాట కచ్చేరి మొదలయింది. అందరూ ఆ గాన మాధుర్యాన్ని ముగ్ధులై వింటున్నారు. కొందరు తెలిసినవాళ్లు విజయ్ రాకను గుర్తించి నవ్వుతూ విష్ చేసారు.

స్టేజీమీద ఓ ఇరవై ఐదేళ్ల యువకుడు గిటార్ వాయిస్తూ, పాడసాగేడు. అతని కంఠం బాగానే వుంది. కానీ, ఆపాడే తీరు, భావానికి అతనికీ అడుగులు కాస్త ఎబ్బెట్టుగా వున్నాయి. మరో రెండు నిమిషాలకు డ్రమ్స్ హోరు మధ్య గిటారు అపశ్రుతుల మధ్య అతని పాట ముగిసింది.

మరో యువకుడు చిరుదరహాసంతో మైక్ ముందుకు వచ్చి నిలుచున్నాడు.

''ప్రియమైన శ్రోతలకు విలువైన కానుక! మీరెప్పుడైనా వసంతమాసంలో వన గాయని గీతాన్ని విన్నారా? అంతటి రసానుభూతిని



# ఇ'వేమన'పద్యాలు




ఇంటి యాలి విడిచి విల వెలయాలితో
వెంట దిరుగువాడు వెట్టివాడు
వంట చేను విడచి పరిగేరి నట్లయా
విశ్వదాభిరామ వినుర వేమ.

కలిగించే పాట మీరు వినబోతున్నారు. ఇప్పుడు సంగీత సరస్వతి — మధుర గాయని మిస్ చందన ప్రియ మిమ్మలను తవగాన వాహినిలో ఓల లాడిస్తుంది. కోయిల గీతాన్ని మరపించు తుంది — '' అని ఎనౌన్సు చేసి ప్రక్కకు తప్పు కున్నాడతను.

ఓ ఇరవై ఏళ్ల యువతి నెమ్మదిగా వేదిక మీదకు వచ్చింది. వినయంగా శ్రోతలకు

## మానస మురళి

నమస్సుమాంజలులు సమర్పిస్తూ మైకుముందుకు వెళ్లింది. ఆమె అలంకరణగానీ, కట్టు బొట్టు గానీ ఎవరినీ ఆకర్షించలేకపోయాయి.

'ముతక చీరె కట్టుకుని ముత్తయిదువులా బయలుదేరింది. ఈమేనా గాన సరస్వతి ? — ' అని కొందరు పెదవులు చప్పరించేసారు.

విజయ్ ఆమెను చూసి నిటారుగా అయ్యాడు. గుండె ఒక్కక్షణం ఆగినట్లయి, మళ్లీ వడివడిగా కొట్టుకోసాగింది.

'చందనా !' అతని పెదవులు అస్పష్టంగా గొణిగాయి ఆశ్చర్యంతో !

మైకు ముందు నిలుచున్న చందన ఎవరి వంకా పరిశీలనగా చూడ్డంలేదు. తలదించుకుని నేలచూపులు చూస్తూ పాట అందుకుంది. తీయని తేనె ధారలా ఆమె కంఠం కమ్మగా విచ్చుకుంది. ఆ కంఠంలో — లేత మావి చివుళ్ళు తిని కుహు కుహు మని కూసే ఎల కోయిలల కూజితాలున్నాయి. అద్భుతమైన ఆమె గాన మాధుర్యానికి అందరూ ముగ్ధులైనారు. కొందరు ఈమె ఇంత చక్కగా పాడగలదా ? అని విభ్రాంతులైనారు. రూపాన్ని చూసి అసహ్యించుకున్న కొందరు — శృతి బద్ధమైన కంఠాన్ని వినగానే సిగ్గుతో తలలు దించుకు న్నారు.. మొత్తం మీద ఆమె పాట అందరి మన్ననలను పొందింది. అవ్యక్తమైన రసజగత్తు లోకి తీసికెళ్లి వదిలి ఆమె స్టేజి దిగి వెళ్ళి పోయింది. తరువాత మరో యువకుడు స్టేజి పైకి వచ్చాడు...

అంతవరకు శిలా ప్రతిమలా కూర్చున్న విజయ్‌లో చలనం కలిగినట్లయింది. చటుక్కున లేచి నిలబడ్డాడు. వడివడిగా అడుగులు వేస్తూ స్టేజీ వెనుక వైపుకు వెళ్లాడు. అక్కడ గ్రీన్ రూమ్‌లో ఇందాక పాటపాడిన అమ్మాయివున్నది. కూజాలోంచి నీళ్ల ఒంపు కుంటూ విజయ్ కంట పడింది.

అంత దగ్గరగా ఆమెను చూడగానేవిజయ్‌కు నోట మాట రాలేదు ఒక్కక్షణం.

'సందేహం లేదు... ఈమె చందనయే—'

''చందనా!'' ఆనందాతిశయంతో బిగ్గరగా పిలిచాడు.

నీళ్ల త్రాగబోతున్నదల్లా తల త్రిప్పి చూసింది ఆమె. యూనిఫారంలో ఠీవిగా, దర్జాగా చిరునవ్వుతో నిలుచున్న విజయ్‌ను చూసింది.

''ఎవరు కావాలి సార్ ?'' అని మామూ లుగా అడిగింది. ఆమె ముఖంలో ఎలాంటి భావమూ పలకలేదు.

విజయ్ దిగ్భ్రమగా, అయోమయంగా చూసేడు.

''నేను... విజయ్‌ను... నన్ను గుర్తుపట్ట లేదా చందనా ?''

ఈసారి తెల్లబోవడం ఆమె వంతయింది.

''సారీసార్ ! నేను మీరనే చందనను కాదు. నా పేరు గౌరి —''

విజయ్ ఖంగుతిన్నాడు. నమ్మలేనట్లు కళ్ల విప్పార్చుకుని మరీ చూశాడు. ఇంతలో అక్కడకు ఇద్దరు ముగ్గురు యువకులు వచ్చారు ''ఏమిటి సార్ ! ఏమయింది ?'' అంటూ.

వాళ్ల ప్రశ్నకు సమాధానం చెప్పలేదు విజయ్.

# మీ కొత్త యింటికి మీరింకా పాత కాలపు ఆయిల్-బౌండ్ డిస్టెంపర్‌తోనే సరిపెట్టుకుంటారా?



మీ నూతన గృహము, నూతన సంవత్సరం, కుటుంబంలో ఒక కొత్త పెళ్లికూతురు — మీరు క్రొత్తపిగా జరిపించమున్న తరుణంలో పాత సొగసులో వున్న ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ మీకు యిక అవసరం లేదు అనుకుంటారు కదా! మీ గోడలకు వైనల్‌తో అందాన్ని యివ్వండి — ఆకర్షణీయమైన అందాలతో తొణికిసలాడే వాటిని చూసి ఆనందించండి!

వైనల్ మీ గోడలకు మన్నటి ఫినిష్ ఇస్తుంది, ఖరీదైనవిగా కన్పించేలా చేస్తుంది — మునుపెన్నడూ లేనంతగా! వైనల్ వల్ల మరెన్నో ప్రత్యక్ష ప్రయోజనాలు కూడా— ఏ ఆయిల్-బౌండ్ డిస్టెంపరూ పోటీ పడలేనివి! ఇవన్నీ అదనపు ఖర్చేమీ లేకుండానే.

## బ్రిటిష్ పెయింట్స్ వైనల్ తెచ్చుకోండి మీ ఇంటి గోడల చేత శుభం లాభం పలికించండి




వైనల్‌ని ఏ ఆయిల్-బౌండ్ డిస్టెంపర్‌తోనైనా పోల్చి చూడండి
ప్రతి విషయంలోనూ అతి శ్రేష్ఠమైనది వైనల్.

| | వైనల్ | ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ |
|---|---|---|
| ఫినిష్ | చక్కటిది, మన్నటి | బాగుండదు. |
| ఆరడానికి పట్టే సమయం | 4 గంటలు | 12 గంటలు |
| వాసన | ఇంపైనది | భరించరానిది |
| కడుక్కోవేందుకు | ఎంతో వీలైనది | వీలుగా వుండదు |
| రంగు వెలిసి వుండటం | దివ్యం | పరవాలేదు |
| మన్నిక | ఎక్కువ | తక్కువ |
| వెయ్యడం | తేడం లేదు | |

.. అన్నిటినీ మించిన విషయం, 5 కిలోల ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ కావలసివచ్చే విస్తీర్ణానికి, కేవలం 2 లీటర్ల వైనల్ చాలు!

# వైనల్

ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ కన్నా అన్ని రకాలుగానూ మేలైనది.

British Paints
BERGER
WORLDWIDE

LINTAS(C)/VNL/74/2317 TL

ధర్మపథం — బులుసు వేంకటరమణయ్య

# సప్తసంతానాలు



పుత్ర సంతానం ఉంటే వంశం విచ్ఛిన్నం కాకుండా తర తరాలుగా కొనసాగుతూ ఉంటుంది. ఆ పుత్ర సంతానం వంటివే మరి ఆరు ఉత్తమమైనవి ఉన్నవి. వీటి అన్నిటినీ కలిపి సప్త సంతానాలని అంటారు— ఆ మిగిలిన ఆరూ— చెరువు, నిధి, దేవాలయము, అగ్రహారము, తోట, గ్రంథమును. కుమారుడు వంశాన్ని నిలిపితే, మిగిలిన ఆరూ కీర్తిని నిలుపుతాయి. కీర్తి నిలవడమే కాదు వీటివల్ల ఎంతో ప్రయోజనం ఉన్నది. గ్రామం వద్ద చెరువు తవ్విస్తే ఆ గ్రామ ప్రజలందరూ అందలి జలం ఉపయోగించుకొంటారు. పశువులు, పక్షులు ఆ నీరు త్రాగి తృప్తి పడతాయి. నిధిని ఏర్పాటు చేస్తే, దాన్ని నిర్వహించేవారు దాని వడ్డీ ధనంతో దాన ధర్మాలు చెయ్యడం, బీద కుటుంబాలకు ఆర్థికంగా సహాయ పడడం, విద్యార్థులకు భోజనాది వసతులు గల్పించడం జరుగుతూ ఉంటుంది. ఇలాటి నిధుల వల్లనే విద్యాలయాలు స్థాపించబడుతూ వుండడం నాటికీ, నేటికీ కూడా కానవస్తున్నది. ఇలా నిధులు విద్యా వ్యాప్తికి ఎంతో సహకరిస్తున్నవి.

దేవాలయ నిర్మాణం వల్ల స్థాపించిన వారి పాపాలన్నీ నశించి పుణ్యం లభిస్తుంది. గ్రామంలోని భక్తులు దేవదర్శనం చేసుకొని కృతార్థులవుతారు. భక్తి ప్రచారానికి ఇది చాలా అనువైనది. పదిమంది వేదశాస్త్ర వేత్తలకు ఇళ్ళు కట్టించి యిచ్చి, కొంత జీవనోపాధిని కలిగించే అగ్రహారం వల్ల నిర్మాతకు చాలా పుణ్యం లభిస్తుంది. అతనిని అందరూ అభినందిస్తారు. వన నిర్మాణమూ ఇలాంటిదే! తోట వేసి, ఛాయావృక్షాలనూ, ఫల వృక్షాలనూ నాటి, వాటిని అందరి ఉపయోగానికీ విడిచినందువల్ల, బాటసారులు చెట్లనీడలో నిలిచి, మార్గాయాసాన్ని తీర్చుకొని, ఆయా కాలాల్లో పండిన ఫలాలను భుజించి తృప్తిపడతారు. పక్షులు చెట్లమీద గూళ్ళు కట్టుకొని, పళ్లను తిని సుఖంగా జీవిస్తాయి. ఈ అయిదూ, ప్రభువులకూ, శ్రీమంతులకూ మాత్రమే సాధ్యమయిన నిర్మాణాలు. సంకల్పం ఉన్న, సామాన్యులకు సాధ్యం కానివి. అనాది నుంచీ ఇప్పటివరకూ ప్రభుత్వంవారూ, శ్రీమంతులూ వీటి విషయంలో శ్రద్ధ చూపుతునే ఉన్నారు. ఇక మిగిలినది గ్రంథ నిర్మాణం. దానికి ధనంతో నిమిత్తం లేదు. రచనాశక్తీ, ఆసక్తీ ఉన్న నిర్ధనులు కూడా కృతులను నిర్మించగలరు. ఆ గ్రంథాలను శ్రీమంతులకు అంకితమిస్తే వారివల్ల రచయితకు ధనమూ లభిస్తుంది. కృతిభర్త కీర్తి కూడా శాశ్వితంగా నిలుస్తుంది. పయివి అన్నీ అత్యుత్తమాలుగా ఉన్నపుడే వాటికి స్థిరత్వం ఏర్పడుతుంది. యశస్సు స్థిరంగా నిలుస్తుంది.

## మానస మురళి

"చందనా! ఏమిటీ నాటకం? నీవు చందనవు కాదా? రెండేళ్లనాడు హఠాత్తుగా అదృశ్యమై పోయావు... ఇన్నాళ్లకు నీవు కనిపించావన్న సంతోషంతో వచ్చాను. ఈ బావ నీకు గుర్తు లేడంటే నేను నమ్మను ..."

"సార్! మీరు మాట్లాడేదేమిటో నాకు బొత్తిగా బోధపడడంలేదు. మిమ్మల్ని నేనెపుడూ చూడలేదు. ఒక ఆడపిల్లను ఇలా నలుగురి మధ్య ఇబ్బంది పెట్టడం భావ్యం కాదు. దయచేసి వెళ్లిపొండి ..." ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నది ఆమె.

ఛెళ్లున కొరడాతో కొట్టినట్లయింది విజయ్‌కు.

"చందనా! ఎంత అన్యాయంగా మాట్లాడుతున్నావు? నన్నెపుడూ చూళ్లేదా? నీ మాటలతో నన్ను మోసగించలేవు — నీ రూపం — నీ కంఠస్వరం నాకు బాగా సుపరిచితమే! అసలు ఇన్నాళ్ళూ ఎక్కడున్నావు? ఆనాటి నా మీద కోపం ఇంకా చల్లార లేదా?—" అతని కంఠంలో ఆవేదన సుళ్లు తిరిగింది.

యువకులు వారిద్దరివంకా విచిత్రంగా చూడసాగేరు.

ఆమె తీవ్రంగా చూస్తూ — "మీరు చదువుకున్నవారు. నేను మీరనే చందనను కాదని ఎన్నిమార్లు చెప్పినా అర్థం చేసుకోరేం? మిమ్మల్ని ఇప్పుడే చూస్తున్నాను. మీరెవరో నాకు తెలీదు — నాకెవరూ లేరు. అనవసరంగా నన్ను విసిగించకండి. అవతల నాకు ప్రోగ్రావ్ వుంది —" అని స్టేజీమీదకు వెళ్లిపోయిందామె.

విజయ్ నిర్ఘాంతపోయాడు.

బాధతో, వేదనతో హృదయం నలిగిపోయింది.

'చందనా! నీవు చాలా మారిపోయావు... నన్ను మర్చిపోయేంత మారిపోయావు...' ఇక అక్కడ వుండలేక ఇంటికి తిరిగి వచ్చేసాడు విజయ్. భర్త ముభావంగా వుండడం చూసి "ఎందుకలా వున్నారు?" అని ఆందోళనగా ప్రశ్నించింది మానస.

"ఏం లేదు" అని ముభావంగా వెళ్లి తన గదిలో మంచంమీద పడిపోయాడు అలసటగా...

విజయ్‌లో ఎన్నో ఆలోచనలు... గతం తాలుకు నీలి నీడలు... వేదనా పరమైన గతం... చీకటి వెలుగుల సమ్మేళనం... ఎన్నో జ్ఞాపకాలు అతని కళ్లముందు నిలిచాయి.

(ఇంకా వుంది)




## (గత సంచిక తరువాయి)

రైలు దిగి నాన్న, వెనకాల అమ్మ, వొదిన, అత్తయ్య...

అతను తెల్లబోయాడు. "పెళ్ళిగాంలో.." అని నసిగాడు.

"మాటకి రూపాయిచ్చి అందరి పేర్లూ అందులో ఇరికించమంటావుట్రా? – పద. బాబాయిగారి ఇంటికెడదాం – రెండు రిక్షాల్లో అయిదుగురం పట్టేస్తామేమో చూడు" అన్నాడు నాన్న.

"మరో పది పయిసలిస్తే సరి!" అంది అత్తయ్య.

"మీరు వెళ్ళండి – హాస్టల్లో పని ఉంది. ఆ తరవాత వొస్తాను" అన్నాడు సారధి. మమత అతని గుండెలనిండా ఉంది. వీళ్ళని చూస్తోంటే భయం వేస్తోంది.

ఫక్కున నవ్వింది వొదిన రైలింజను కూతలాగ.

"పెళ్ళివారింటికి వెళ్ళేలోపున వొస్తావా? మరిచిపోతావా?" అంది.

సారధి తెల్లబోయి చూశాడు.

"భోజనం టైముకి బాబాయ్‌గారి ఇంటికి రారా! నాలుగ్గంటలదాకా కబుర్లు చెప్పుకుని నాలుగున్నరకి బయిలుదేరుదాం. వాళ్ళు రెండు కార్లు పంపుతారటలే. పద హాస్టలుకి వెళ్ళు – మేము రిక్షాలు చూసుకుంటాం" అన్నాడు నాన్న. 'తాంబూలాలిచ్చేశాను – తన్నుకుచావండి" అని ఆయన వేరే అనక్కరలేదు. ఆ రకం మనిషి.

పిల్లని చూసి నచ్చలేదంటే సరిపోతుంది అని సంతృప్తిపడ్డాడు సారధి. టొయోటా కారులో దిగి చలవరాతి మెట్లు ఎక్కి ఎయిర్ కండిషన్ చేసిన గదిలోకి వెళ్ళి కూర్చునేసరికి అతని ఆలోచనలన్నీ చెల్లాచెదరయిపోయాయి. ఈ గదిలో మమతతో... అన్న ఆలోచన "ఏమయ్యా? ఎమ్మెస్సీ బాగా చేశావా? ఫస్టు వొస్తుందా? అమెరికాలో రిసెర్చి చెయ్యాలంటే భయంలేదు కద?" అంటోన్న ఆ కాబోయే మామగారి కంచుగంట గొంతుకలో కరిగి పోయింది. ఆయన ముఖం వికారంగా ఉంది కాని ఆ ఠీవి ముందూ గొంతుక వెనకా నాన్న కూడా ముడుచుకుపోయాడు. రాణీలాగ వొచ్చింది శశిరేఖ. అందరివేపూ ఒకసారి చూసి రాజకుమార్తి లాగ కూర్చుంది. మెడలో వజ్రాలు మెరిసి పోతున్నాయి.

ఆ మధ్యాహ్నం భోజనం సరిగా చెయ్యలేదు సారధి.

నలుగురు బేరర్లు ఒక్కొక్కరికీ స్వీట్లూ కారాలూ తెచ్చి ఇచ్చేస్తున్నారు. సారధి వాళ్ళతో బాటే ...

"అబ్బాయికి నీ మ్యూజిక్ కలెక్షన్ చూపించమ్మా!" అన్నారు కంచుగంటగారు. చేతు లెక్కడ కడుక్కోవాలో తెలీక దిక్కులు చూస్తూంటే బేరర్ నాప్‌కిన్ అందించాడు. దానికి చెయ్యి తుడిచేసుకోవడమేనా అన్నంత తెల్లగా మెత్తగా శశిరేఖ లాగ ఉందది. జేబులోని కర్చీపు తియ్యబోయి, మానేసి చివరకి భయ పడుతూనే చేతులు తుడుచుకుని కాఫీ తాగకుండానే శశిరేఖ వెనకాల మేడ మీదికి నడిచి వెళ్ళి ఆమె చూపించిన కుర్చీలో కూర్చుని ఆమె ప్రశ్నకి సమాధానంగా హిందీ పాటలంటే తనకి చాలా ఇష్టమని చెప్పి అమెరికా అంత గొప్ప దేశం లేదని అంగీకరించి అక్కడ చదువుకోవడం అంత అదృష్టం కూడా లేదని శశిరేఖ చక్కటి అమ్మాయి అని ఆమె ప్రశ్నకి జవాబిచ్చేసరికి కాఫీ వొచ్చింది. హిందీ పాట వింటూ గది అందాలనీ లోపలి ఆస్తులనీ, వాటికి ఏకైక వారసురాలినీ చూస్తూ అంత అమాయకురాలినీ తన మీద ఆశలు పెట్టుకున్న చిన్న దానినీ అన్యాయం చెయ్యడం న్యాయం కాదేమోననే ఆలోచనలో పడుతూంటే అతనికి కింద నించి పిలుపు వొచ్చింది. అమ్మా నాన్నా అత్తయ్యా వొదినా కంచుగంటగారికీ వొదిగి నిలబడ్డ బేరర్లకీ చిన్న అరుపు అరుస్తూన్న కుక్కకీ మాటిమాటికీ దణ్ణాలు పెట్టేస్తున్నారు. గేటు దగ్గర ఘూర్కా సలామ్ చేస్తే వాళ్ళంతా మళ్ళీ దణ్ణాలు పెట్టేశారు. బాబాయ్‌గారి ఇంటికి చేరేక, "ఓహో! ఏమి ఆస్తి! ఏమి ఆస్తి! ఆ హుందా ఏమిటే! ఆ దర్జా ఏమిటీ! అసలది ఇల్లేనా లేక సినిమా సెట్టింగా! ఆఁ?" అంది అత్తయ్య వొదినతో. వొదిన ఏమీ అనలేదు. తన తోటి కోడలు గురించి ఆలోచిస్తోందికామోసు.

బాబాయి సిగరెట్ వెలిగించి "సారధీ! పిల్ల ఎలా ఉందోయ్?" అన్నాడు. అతనివన్నీ మరీ పాడు బుద్ధులు అంటాడు నాన్న. వేరే శాఖవారి అమ్మాయిని కట్నం లేకుండా పెళ్లి

## అందమైన అద్దె ఇల్లు

చేసుకోవడమేకాదు, ఆమెని ప్రేమించి పెళ్ళి చేసుకోవడమేకాదు, పెళ్ళి చేసుకునికూడా ప్రేమించడమూ మాత్రమేకాదు, వాళ్ళిద్దరూ నువ్వంటే నువ్వని పేర్లుపెట్టి పిలుచుకుంటారు ఈనాటికీ! ఛీ! పాడు! అంటుంది అమ్మ. సిగ్గు లేకపోతేసరి అంటాడు నాన్న.

"పిల్లకేంలోటు? మహాలక్ష్మిలాగ ఉంది"— వొదిన.

"అందంగా ఉందా ?" అన్నాడు బాబాయ్ పిన్నివొంక చూస్తూ.

"అందం కొరుక్కుతింటామా?" అన్నాడు నాన్న అమ్మవంక చూస్తూ.

"అంటే — పిల్ల... అంత బాగాలేదన్న మాట" అన్నాడు బాబాయ్.

"పిల్లకేం ? నిక్షేపంలా ఉంది" అంది అమ్మ.

"కన్ను వొంకరా ? కాలు వొంకరా ?" అంది అత్తయ్య.

సారధికీ అలాగే అనిపించింది. ఏదో వాళ్ళకి చెప్పాలని ఉంది అతనికి. కాని అతన్ని ఎవరూ అడగలేదు. అతనికి కలిసివొచ్చిన అదృష్టాన్ని అందరూ పొగిడేస్తున్నారు. సారధికి శశిరేఖమీద క్రమంగా ఆ సాయంత్రానికి కొత్త భావన కలిగింది.

పెళ్ళి నిశ్చయం అయింది.

ముహూర్తం నిశ్చయం అయింది.

సారధి రాకపోకలు సాగించాడు ఆ ఇంటికి. సెలవులిచ్చిన సాయంత్రం రైలెక్కే రూలు సడలించి అక్కడే ఉండడానికి నాన్న దయతో అనుమతించేరు. అన్నయ్య ఈ పెళ్ళి పనులన్నీ తనమీద వేసుకున్నాడు. తన రెండు ఎకరాలలోనూ చెరుకు వేశాడుట. కంచుగంటగారు సుగర్ మిల్‌లో డైరెక్టరు.

శుభలేఖలు అచ్చుఅయాయి.

పెళ్ళి చూపుల సాయంత్రం — మమతని కలుసుకోవాల్సిన సాయంత్రం...తరువాత వరసగా చాల సాయంకాలాలు గడిచిపోయాయి.

శుభలేఖ ఎంతో బాగుంది.

సారధి ఆలోచనలలోనించి బయటపడ్డాడు. మమతని కలుసుకుని క్షమాపణ చెప్పాలనే మాట అతన్ని గదిలో నిలవనివ్వలేదు. ఆమెని ఒకసారి చూడాలనీ అతనికి కోరికగా ఉంది. ఆ చిరునవ్వు ఈ రోజు కనిపించదు — కాని ఆ ఒక్క సాయంత్రమూ ఆమె ఎర్రటి తడికళ్ళు మళ్ళీ కనిపించకుండా ఉంటే బాగుండును.

ఆ ఆదివారం తరవాత ఒకసారి ఆమె ఇంటికి వెళ్ళేడు.

తనని చూస్తూనే ఆనందంగా ఆహ్వానించింది మమత. కూర్చోబెట్టి చల్లటి నిమ్మకాయ రసం తెచ్చి ఇచ్చి అతను తాగడం అయాక,

"నా మీద కోపం పోయిందా ?" అంది తియ్యగా, బాధగా.

"నీ మీద — నాకు కోపంలేదు మమతా !" అన్నాడు సారధి ఆమె ఏమంటుందో అర్థంకాక.

"మీరు నిజంగా మంచివారు !" అంది మమత.

"అంతగా పొగడకు ! నేను — " అన్నాడు ఆగిపోతూ అతను. ఉపోద్ఘాతం లేకుండా తన పెళ్ళి మాట చెప్పెయ్యాలని అతను ప్రయత్నం చేశాడు. కాని, అలాగ చెయ్యలేకపోయాడు.

తేలిగ్గా నవ్వి, "మీ సంగతి మీకు తెలీదులెండి !" అంది మమత. ఆ అందమైన నవ్వు మళ్ళీ అతనిలో పాత కోరికలని రేపింది. చేతుల నిండా ఆమెని తీసుకోవాలనీ మనసునిండా ఆమెని దాచుకోవాలనీ.

"నీకు తెలుసునా ?" అన్నాడు సారధి తెలివిగా.

"నాకు తెలుసును బాబూ! ప్రసాదం తీసుకో" అంటూ అప్పుడేలోపలికొచ్చిన వాళ్ళమ్మ తన చేతిలో ప్రసాదం పెట్టింది.

"ఏమిటండీ ?" అన్నాడు ప్రసాదంనోట్లో వేసుకుంటూ.

"మీకు మంచి సంబంధం వొచ్చి పెళ్ళి ఖాయం అయిందిట కదా ! అమెరికా వెళ్ళి చదువుతారటగదా !" అంది ఆవిడ.

ప్రసాదం సారధి గొంతుకలోనే ఉండిపోయింది.

మమత ఇందాకా నవ్విన చిరునవ్వు జ్ఞాపకం వచ్చి చెమటలు పోశాయి. మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది అమ్మాయి. తల్లి లోపలికి వెళ్ళిపోయింది.

ఎలాగో తేరుకుని, "నీకిదంతా తెలుసా ?" అన్నాడు సారధి.

మమత మాటలాడలేదు. ఆమె కళ్ళు ఎర్రబడ్డాయి. నిప్పుల్లాగా లేవు— అప్పుడే నీటిలోంచి తీసిన ఎర్రటి కలువల్లాగ ఉన్నాయి.

"సారీ మమతా !" అన్నాడు సారధి ఇంకేమీ అనలేక.

"ఎందుకని?— మనం వాగ్దానాలు చేసుకోలేదు. నిజానికి— మీరు అడిగారు. నేను సరే అనలేదు. సారీ ఎందుకని ?" అంది తడి గొంతుకతో మమత.

"నీలాంటి అమ్మాయిలు చాలా తక్కువ మంది ఉంటారు" అన్నాడు సారధి సిన్సియర్‌గా. ఆమె అతన్ని దులిపి వొదలనందుకు అతనికి చాలా రిలీఫ్‌గా ఉంది.

"మీలాంటి మంచివారూ తక్కువే" అంది మమత కళ్ళు తుడుచుకుంటూ. వాటిలోని ఎరుపు క్రమంగా తగ్గాక స్థిరమైన గొంతుకతో "మీకు అన్ని అదృష్టాలు కలగాలని కోరుకుంటాను... ఆ కోరికే మీ పెళ్ళికి కానుక"

అంది మమత.

సారథి తన చుట్టూ చూశాడు.

ఇల్లంతా ఎప్పటికన్నా చాలా నయంగా ఉంది. కిటికీలకి ఖరీదైన కర్టెన్లు. ఫర్నీచరు చాలా వరకూ మారిపోయింది. కాళ్ల కింద లేత నీలిరంగు తివాసీ.

"నేను వెళ్లివొస్తాను... నువ్వు నా పెళ్లికి వొస్తే పూర్తిగా నన్ను క్షమించేవని నమ్ముతాను" అన్నాడు సారథి.

"పిలిస్తే తప్పక వొస్తాను... ఆ అదృష్టవంతురాలిని చూడాలని ఉంది! ఆడదాన్ని కదా!" అంది మమత గదిలో దీపాలు వెలిగిస్తూ. నెల రోజుల కిందటి అందవికారంగా ధూళి నిండిన బల్బులు కావు... ఫేన్సీ దీపాలు.

"నిన్ను పిలవకుండా ఉండగలనా మమతా!" అన్నాడు సారథి బాధపడుతూ. తన విషయం తెలిశాక ఉన్న డబ్బు ఇంటి మీద పెడుతున్నారనీ బహుశా ఇల్లు పెద్ద ధరకి అమ్మడమో పెద్ద అద్దెకి ఇవ్వడమో చేస్తారనే ఆలోచన అతనికి మెరుపులాగ వొచ్చింది.

"థేంక్స్! ఆ ఆదివారం— నేను రానందుకు మీరు కోపగించుకునిఉంటారనుకున్నాను. నిజంగా నేను రావాలనుకున్నాను. కాని ఏ నిర్ణయానికీ రాలేకపోయి ఇంట్లోనే ఉండిపోయాను. మీరు బాధపడి ఉంటారు. క్షమించండి" అంది మమత.

"బాధపడకు మమతా!— నీ మీద కోపం లేదు. నీకు నాకన్నా మంచివాళ్లూ అందమైన వాళ్లూ ఎవరో దొరుకుతారు... దైవ నిర్ణయం అది" అన్నాడు సారథి వెళ్లిపోతూ.

ఆ ఒక్క సాయంత్రం, ఆ ఎర్రటి కళ్లు ఆ మరపురాని అందం... వీటన్నిటినీ శశిరేఖ తన పాటల వాల్యూమ్‌లోనూ నవ్వుల్లోనూ రాబీ అని పిలవబడే కుక్క అరుపుల్లోనూ మరుగుపరిచింది— ఈ సాయంత్రందాకా.

వాటిలోనే మరుగుపడిన మరో విషయం ఆ ఆదివారం మమత పార్కుకి రాలేదని చెప్పినప్పుడు సారథి ఏమీ అనకపోవడం.

రిక్షాలో సారథి బయలుదేరేసరికి ఆరుగంటలయింది. ఇటుపైని బస్‌లో పోకూడదని అతను ఆ రోజే నిర్ణయం చేసుకున్నాడు. రాబోయే రోజుల్లో కారులో తప్ప తిరగడానికే కుదరదు. రిక్షాలో ఎక్కడంకూడా ఒక సరదాయే. నాన్న నిన్ననే రెండు వొందలు మని ఆర్డరు పంపించేడు — తాను అడగకుండానే.

మమత ఇంటికి చేరేసరికి చీకటి పడబోతూ ఉంది.

రిక్షా దిగి కొంచెం దూరం నడిచి ఆమె ఇల్లు చేరేడు. సంజ వెలుతురులో ఆ ఇల్లు కొత్తగా కనిపించింది. బయట రంగులు వేశారు.

రోడ్డుకి ఇవతల నిలబడి సారథి ఆమె ఇంటి వైపు చూశాడు. మేడమీద గదిలో అప్పుడే ట్యూబులైటు వేశారెవరో. చాలాసార్లు ఆ ఇంటికి వెళ్లినా ఎప్పుడూ సారథి మేడమీదకి వెళ్లలేదు. ఈరోజు మమత తనని అక్కడకి పిలిస్తే బాగుండును అనిపించింది అతనికి. ప్రహరీ గోడకి కూడా సున్నాలు కొట్టేరు. అదీ ఆశ్చర్యం కలిగించింది సారథికి. ఇంతకుముందు కుష్టు బొల్లి వ్యాధులనించి కుమారి నటించిన మహా సినిమాదాకా అన్నిరకాల వ్యాపార ప్రకటనలతోనూ ఆ ఇల్లు అసహ్యంగా ఉండేది. ఇవేళ ఆ గోడ ఎంతో శుభ్రంగా ఉంది.

మమత ఇంట్లో ఒక్కొక్క దీపమూ వెలుగుతూంది.

సారథి రోడ్డు దాటేందుకు అడుగు వెయ్యబోతోంటే ఒక కారు వచ్చి ఆ ఇంటి ముందు ఆగింది. అందులో నించి ఒక యువకుడు దిగి అటువెళ్లి కారు తలుపు తెరిచాడు.

మమత దిగింది.

గేటు తెరుచుకుంది. వాళ్లిద్దరూ లోపలికి వెళ్లిపోయారు. వాళ్ళు చేతులు పట్టుకుని వెళ్లినట్టు ఆ మసక చీకటిలో కనిపించింది సారథికి. కారు నెమ్మదిగా వెళ్లిపోయింది. గేటు వెయ్యడానికి కాకీబట్టలలో ఉన్నవాడు వొచ్చాడు. తన పని చేసుకుని కనిపించకుండా వెళ్లిపోయాడు. వాచ్‌మన్ కూడా అన్నమాట!

అడుగు వెనక్కివేసి పేవ్‌మెంట్ మీద నిలబడ్డాడు సారథి.

అతనికి విపరీతమైన కోపం వొచ్చింది.

అంటే, మమత తనని మోసం చేసిందన్న మాట.

ఈ ఇంటికి కొత్త అందాలు అందుకేనన్న మాట!

రాస్కెల్! ఆడవాళ్లని నమ్మకూడదు. ఎంత అమాయకురాలి లాగ నటించింది! నయమే! తానా బురదలో ఇరుక్కోలేదు!




పది అడుగులునడిచి సారథి రిక్షాఎక్కాడు.

"ఎక్కడికి?" అన్నాడు రిక్షావాడు.

శశిరేఖ ఇంటి చిరునామా చెప్పేడు సారథి.

"రెండున్నర" అన్నాడు రిక్షా మనిషి.

"రెండు" అన్నాడు సారథి.

"రెండుం పావలా."

"రెండు— అంతే."

రిక్షా సాగింది. సారథి మళ్లీ ఆలోచనలలో పడ్డాడు. అందమైన అమ్మాయిలకి అందమైన మనసులుంటాయని నమ్మడంలో తన తెలివి లేమిని అతను నిందించుకున్నాడు.

తనకీ మమతకీ స్నేహం గురించి శశిరేఖకి తెలిస్తే?

అతను చాలా భయపడ్డాడు. కంచుగంట గారు ఏమైనా చెయ్యగల సమర్థుడు! అదీకాక శశిరేఖది చాలా మెత్తటి మనసు... ఆమెని బాధపెట్టకూడదు.

ఆలోచించినకొద్దీ అతనికి శశిరేఖ అందంగా కనిపించసాగింది. ఆమెకి ఏమి తక్కువ అని? ఎంత సరదాగా మాట్లాడుతుంది! తానంటే ఎంత అభిమానం! రోజూ కనిపించాలంటుంది.

రిక్షాని పంపించి అతను లోపలికి వెళ్లేడు. ఘూర్కావాడు భక్తితో గేటుతీశాడు. రాబీ అరుపులు మొదలుపెట్టేడు. ఫరవాలేదు — గొలుసు కట్టిఉంది. సారథి ముందుకి సాగేడు. మీదనించి పెద్ద వాల్యూమ్‌లో డిస్కో పాట వొస్తూంది.

అప్పుడు గమనించాడు సారథి తన చేతిలోని శుభలేఖని.

అది చూస్తే శశిరేఖ ఏమంటుంది?

తొందరగా కార్డు బయటికి తీసి కవరు చింపి చాలాముక్కలు చేసి ఎక్కడ పడవేయాలో తెలియక జేబులో దాచుకున్నాడు.

శశిరేఖ తలుపు తీసి, "మీ కోసమే చూస్తున్నాను... కొత్త రికార్డులు తెచ్చేను. ఆలశ్యమైందేం? చేతిలో అదేమిటి?" అంది.

శుభలేఖ చూపించాడు.

"పెళ్లికి పిలవడానికి వొచ్చారా?" అంది శశిరేఖ.

"అవును. మీరు తప్పకుండా రావాలి" అన్నాడు సారథి తన సమయస్ఫూర్తికి సంతోషపడిపోతూ.

"ప్రయత్నిస్తాను" అంది శశిరేఖ అతని చెయ్యి పట్టుకుని మేడమీదకి తీసికెడుతూ. ఆమె తెగ నవ్వేస్తోంది ఆ జోకుకి. మీదనించి పాటల శబ్దాలలో కిందని అరుస్తున్న రాబీ అరుపులూ, ఆమె నవ్వూ కలిసిపోయాయి.

మెట్లమీద పరచిన తివాసీ మెత్తగా ఉంది.

దానిమీద సారథి గర్వంగా అడుగులువేస్తూ మమతని పూర్తిగా మరిచిపోయాడు. తన భార్యని రేఖా అని పిలవాలని కూడా అతను నిర్ణయించుకుని సంతృప్తి పడ్డాడు. ★

## ఎమ్. ఎమ్. వెంకటాపురం

ప్రేమ అనే మాటకు పండితులు కానీ, పామరులుగాని ఎందుకో తప్పు అర్థం తీసుకుంటారు. నాకు తెలిసినంతవరకు ప్రేమ అంటే అభిమానం — అది ప్రేయసీ ప్రియుల మధ్యనే వాడవలసిన పదమా? నేను ఒక ఫ్రెండు లెటరులో (అక్కలాంటివారు) అలా వ్రాసు చేస్తే తప్పుగా తీసుకున్నారు ... ?

★ పండితార్థం తీసుకోక — పామరార్థం తీసుకోకపోతే ఇలాగే — అపార్థాలు వస్తాయి. అభిమానం ప్రేమ కాదే. అభిమానించే వాళ్లందరినీ ప్రేమిస్తున్నాం అనలేమే. అంచేత — ప్రేమ పదానికి ఓ ప్రత్యేకత వుందని ఒప్పుకోండి. అల్లాటప్పాగా వాడేస్తే — దాని అర్థం మారిపోతుందని తెలుసుకోండి.




## వి.బి.ఆర్. — ఇచ్ఛాపురం

సృష్టికి మూలం స్త్రీయా పురుషుడా?

★ ఇద్దరూ కాదా ?!

## ఎం. ఎల్. ఎన్. — బైపల్లి

నిశ్చలమైన నీటిలో రాయి వేస్తే ఆ నీరు వలయాలుగా విస్తరిస్తుంది. కారణం ?

★ రాయి తగిలిన చోటే కాదు దెబ్బ తగిలేది— అని తెలియ చెప్తుంది — నీరు.

రోజుకో కొత్త పత్రిక వెలువడుతున్నా కొత్త రచయితలకు అవకాశం దొరకడం లేదు కదూ ?

★ పత్రికలు కొత్తవే అయినా ధ్యేయం — ఒకటే — అమ్మకం. అందుకే తొందరపడరు.

## సరోజ. — విజయనగరం

కలంస్నేహం పై మీ అభిప్రాయం ఏమిటి? వారికి మీ సలహా ఏమిటి ?

★ అవసరానికి, ఆత్మీయతకు—ఉత్తరాలు— ముక్కూమొఖం తెలియని వారితో స్నేహం సాధ్యమా ?! అలాంటి వారికి రాసే వుత్తరాలు— వ్యవహారాలకి పరిమితమై వుంటాయి.

## కె. ఆర్. జె. — గుంటకల్లు

అక్కయ్యా, మీ జవాబులు చదువుతూ వుంటే మీకు 'ఇన్‌ఫీరియారిటి కాంప్లెక్సు' ఎక్కువని తోస్తుంది. మీరే మంటారు ?

★ మాటలు రాగానే సరికాదు, అసందర్భంగా వాడకుండా వుండకల్గాలి. నాకెలాంటి కాంప్లెక్సులూ లేవు. అదృష్టవంతురాల్ని !

## కె.సి.ఆర్.ఎన్. — మైదుకూరు

వరకట్నం పుచ్చుకునే అబ్బాయిలమీద మీ అభిప్రాయం ?

★ ఒక రకమైన జాలికల్గుతుంది —ఎంత హీనమైన స్థితి కాకపోతే — అలా అడుగుతారు అనుకుంటాను.

## విజేంద్ర — అదోని

కొద్ది రోజుల తేడాలో ఇద్దరు మంచి రచయితలను పోగొట్టుకున్నాం — మాదిరెడ్డి, పాలగుమ్మి. వీరి పేర్లమీద మంచి రచనలకు అవార్డు ప్రకటిస్తే బాగుంటుందని నా అభిప్రాయం.

★ నిజంగా బాగుంటుంది — కాని మన సాహితీ సంస్థలన్నీ అవసరసంస్థలో, అపార్థపు సంస్థలోగా తయారయి నిజమైన సాహిత్యసేవని చేపట్టడంలేదు.

## కె. వి. ఆర్. — దుంపగడప

నాకింకా పెళ్లికాలేదు. ప్రేమించి పెళ్లాడనా? పెళ్లాడక ప్రేమించనా? క్లుప్తంగా జవాబివ్వండి.

★ నీ యిష్టం తమ్ముడూ. కాని—చేసుకో నంతకాలం సుఖపడతావనుకో !!

## ఎస్. కె. పి. — స్టూవర్టుపురం

ఏ పత్రికకైనా సరే కథ ఒకటే పంపాలా? ఎన్నైనా పంపవచ్చునా ?

★ ఎన్నైనా పంపవచ్చు. కాని తగినంత పోస్టేజిపెట్టి పంపకపోతే తిరిగి రావు ! ★







# భవదీయుడు - బంతిపూలు

సింగరాజు రామచంద్రమూర్తి

అత్తయ్య అప్పుడే వీధిలోంచి ఇంట్లోకి వస్తోంది !

ఆశ్చర్యపోయాను – "అదేమిటత్తయ్యా, నువ్వు ఇందాకట నుంచీ ఇంట్లో లేవూ ?" అన్నాను అమాయకంగా.

"బాగుంది వరస. నేను మీ ఇంటి నుంచే వస్తున్నాను. కూర్చో, కూర్చో, అమ్మాయ్ సావిత్రీ" అంటూ లోపలికి వెళ్లింది.

"అసిసీ ఇందాకటి నుంచీ వాళ్ల అమ్మ లాగా నాటకమాడుతోందన్నమాట" అనుకుంటుండగానే ఓ పళ్లెంలో మైసూరుపాకు, బజ్జీలు, గ్లాసుతో మంచినీళ్లు పుచ్చుకొని తల ఓరగా వంచి కింద పెదవిని మునిపంటితో అదిమి పట్టుతూ వచ్చింది సావిత్రి !

నా ఒళ్లు పులకరించింది.

"ఇన్ని టిఫెన్లు చేస్తే రేపు నాకు జీతం చాలకపోతే ఎలా రవ్వల రాణీ" అనడిగాను పళ్లెంతోపాటు చెయి పుచ్చుకుని.

"ఫో రంగూన్ రౌడీ !" అని నవ్వి మెరుపులా ఇంట్లోకి మాయమయిపోయింది కాఫీ కోసం.

అంత అల్లరి చేసేది సావిత్రి ... రోజులు ఇలా చాలా ఆనందంగా గడిచిపోయాయి కొంత కాలంపాటు.

భగవంతుడు ఉన్నాడా, లేడా అన్న మీమాంస అనాది కాలం నుంచీ ఉంటూనే ఉంది.

మనం అనుకున్నవన్నీ అనుకున్నట్లు జరిగినంత కాలం భగవంతుడన్న వాడి ప్రసక్తి మన

**(గత సంచిక తరువాయి)**

మనస్సులోకి రాదు. ఈ విషయం కనిపెట్టి తన ఆస్తిత్వాన్ని మధ్య మధ్య పామరులకు జ్ఞప్తి చేసేందుకుగాను కొందరికి అనుకోనివి జరిగేట్టుగాను, ఇంకొందరికి అనుకున్నవి జరగకుండాను చేసి తన వీపు తనే చరుచుకుంటాడు.

మొదటి తెగ వారు అదృష్టవంతులు, రెండవ వారు దురదృష్టవంతులు !

మా ఊళ్ళో రాజకీయ చైతన్యం ఇంకా వెర్రితలలు వేయలేదు. ఆ మాటకొస్తే రాజకీయ లోకంలోకి మా వాళ్ళు ఇప్పుడిప్పుడే బద్ధకంగా కళ్ళు తెరిచి చూస్తున్నారు.

పంచాయితి బోర్డు ఎన్నికలు వచ్చాయి మాక్కూడా. అసలు ఏ విషయమయినా మా ఇళ్ళవాళ్లు ఎలా చెబితే ఊరంతా అలా నడుచుకుంటారు. అంత గౌరవం ఉంది. అనుమ్యాతంగా వస్తున్న ఆచారం అది.

మా నాన్నకు ఎలక్షను లంటే తలనొప్పి. "ఈనాడు మనం అన్నమాటను ఎవరూ కాదనటం లేదు కదా ! ఇంకా మనకు ఎన్నికల్లో నిలబడటం ఎందుకు బావా ?" అన్నారు మావయ్యతో– అంటే సావిత్రి నాన్నతో.

ఇవ్వాళ పలుకుబడి ఉండగానే సరికాదు — భవిష్యత్తుకు కూడా దాన్ని జాగ్రత్త పరుచుకోవాలి అన్న తత్వం మావయ్యది.

కాదు కూడదని మా నాన్నను పంచాయితీ మెంబరుగా నిలబెట్టి తనూ ఇంకో వార్డు నుంచి నిలబడ్డాడు. సరే ఇద్దరూ పోటీ లేకుండా గెలిచారు. అంతవరకూ బాగానే ఉంది.

కాని ప్రెసిడెంటుగా కూడా మా నాన్ననే నిలబడమని పట్టుపట్టాడు మా మయ్య. వద్దంటే వద్దన్నారు మా నాన్నగారు. కాని అందరిచేత చెప్పించాడు, బ్రతిమాలాడు — చివరికి ఎలాగయితేనేం ఆయనచేత 'సరే' నని పించాడు.

మెంబర్లుగా నిలబడిన వారందరికీ మా నాన్న కబురు చేశాడు..."నేను ప్రెసిడెంటుగా నిలబడుతున్నాను" అని.

ఇంకెవ్వరూ నిలబడటం జరగలేదు ...

## భవదీయుడు-బంతిపూలు

ఇంతలో ఏం బుద్ధి పుట్టిందో రెండు రోజులకు ఎన్నిక జరుగుతుందనగా ఒక రోజున మావయ్య కబురుచేశాడు.

"నేను ప్రెసిడెంటుగా నిలబడదామనుకుంటున్నాను. ఎలాగూ బలవంతంమీద ఒప్పుకున్నాడు కాబట్టి బావను మానెయ్య"మని.

మా నాన్నదంతా అదొక రకం. మంచిగా ఉన్నన్ని రోజులూ ప్రాణం కావాలన్నా ఇస్తాడు. మంచి తప్పితే ఆయన తాచుపామయిపోతాడు.

"ఒద్దు బాబో, అంటున్నా వినకుండా తనే నన్ను నిలబడమన్నాడు. తీరా నిలబడ్డాక ఇప్పుడు మానమంటాడా? రేపు నేను నలుగురిలో తలెత్తుకోవాలనేనా? అదీ కాకుండా తనే స్వయంగా వచ్చి నాతో మాట్లాడితే నేను కాదనగలనా?...పాలేరుతో కబురంచేస్తాడూ? టట్, వీల్లేదు" అన్నాడు.

దావానలంలా వ్యాపించిపోయింది మా నాన్నకు, మావయ్యకు పోటీ అని. అవకాశం ఎదురుచూస్తున్నవారంతా చెరొకవైపు సమర్థించటం మొదలుపెట్టారు.

చివరికి మావయ్యా, నాన్నా కూడా జరుగుతున్నదేమిటో తెలుసుకునేంతలో రెండు పార్టీలవారికీ రెండుమూడుసార్లు దెబ్బలాటలు కూడా జరిగిపోయాయి.

ఇద్దరూ తెల్లబోయారు!

అంత వేగంగా జరిగిపోయాయి సంఘటనలు. వీరిద్దరినీ అడ్డం పెట్టుకుని ఊళ్ళోవాళ్ళ తమ తమ కక్షలు సాధించుకోసాగారు.

ఇద్దరికీ తెలుసు—తాము విడిపోతున్నామని. కాని వాళ్ళు చేయగలిగిందేమీ లేకపోయింది చూస్తూ కూర్చోవటం తప్ప.

రోషాలు పెరిగాయి; పట్టుదలలు హెచ్చాయి. ఆ ఇంటి కాకి ఈ ఇంటిమీద వాలడం మానేసింది. ఇంట్లో ఆడవాళ్ళ గోల పెట్టినా అది సముద్ర ఘోష అయింది. వారికీ, మాకూ ఎడముఖాలు, పెడముఖాలు అయాయి.

చివరికి ప్రెసిడెంటుగా మావయ్య గెలిచాడు. కాని అందుకు ఆ రెండెకరాల మాగాణి హారతి కర్పూరం అయిందని ఊళ్ళో గుప్పుమంది.

ఓడిపోవటంతో మా నాన్న తాచుపామయి బుసకొట్టాడు. తల్లిదండ్రులు చేసిన మంచికి గాని, చెడుకు గాని బాధ్యులు—అనుభవించేవారు. పిల్లలు.

చిన్నతనం నుంచి అనుకుంటున్నమాట—ఊరంతా జరుగుతుందనుకున్న విషయాన్ని మావయ్య త్రోసిరాజన్నాడు.

సావిత్రికి నాకన్నా అన్నివిధాలా అధికుడ్ని తీసుకువచ్చి పెండ్లి చేయాలని పట్టుపట్టాడు.

కాని ఆయన ఆవేశంలో ఒక విషయాన్ని విస్మరించాడు

నేను ఒక పురుగు నయినప్పటికీ సావిత్రికి ఆ పురుగే కావాలి!

సావిత్రి ఏడిచింది, గోలపెట్టింది, భస్తావంది... కాని ఆయన చలించలేదు. "నువ్వు చస్తే నీ శవానికే పెళ్ళి చేస్తాను" అన్నాడు.

నేనేం చేయగలను? అశక్తుడ్ని. అక్కడికీ అయినవాళ్ళు కల్పించుకుని ఏకింత మూర్ఖత్వం తగదని చెప్పి చూచారు.

కాని "సావిత్రి నా కూతురనే ఈనాటి వరకు అనుకుంటున్నాను" అన్నాడుట.

చివరికి ఎమ్మెస్సీ పాసయిన అబ్బాయితో సావిత్రికి పెళ్ళి నిశ్చయమయింది.

పెళ్ళి రెండు రోజులుందనగా మా చెల్లాయి వసంత ఇక చూస్తూ ఊరుకోలేకపోయింది. సావిత్రి నేను ఒకచోట కలుసుకునేట్టు చేసి మా ఇద్దరికీ రెండోకంటికి తెలియకుండా పారిపొమ్మని సలహా ఇచ్చింది. "ఇవాళ ఆవేశంలో మిమ్మల్ని తిట్టుకున్నప్పటికీ, ఏనాటికయినా వాళ్ళు పశ్చాత్తాపపడక మానరు. కన్న కడుపా మరొకటా — పైగా అయినవాళ్ళం!" అంది.

సరే ఆ మర్నాటి రాత్రికి మా ప్రయాణం సిద్ధంచేసింది.

సామాను సూట్‌కేసులో పెట్టుకుని, చేతికందినంత డబ్బు తీసుకుని రాత్రి పన్నెండింటికి వీధి తలుపు తీశాను.

"సిమ్మకర్ర చేతపట్టుకుని నిలబడి ఉన్నారు నాన్నగారు! నీరయిపోయాను.

"ఇన్నాళ్లా బతకనీయవా నాయనా? సావిత్రిని నీకిస్తానని వాడొస్తే నేను కాదనే వాడినా? వాడు కావాలని చేసేదానికి బాధ్యత నాదా? అవమానపడవలసిన వాడిని నేనా? క్షణికమయిన నీ ఆనందంకోసం నీ తండ్రిని వాడిముందు తల వంచుకునేట్టు చేయదలుచుకున్నావా?... సరే, నీ సుఖానికి నేను అడ్డురాలేను. నన్ను చంపి అడుగు బయటపెట్టు" అంటూ తల వంచారు.

అంత గంభీరమయిన మనిషి నోటివెంట అటువంటి మాటలు విని రాయిలా నిలబడిపోయాను. ఆయన గొంతుకలోని వణుకును గమనించి చలించిపోయాను.

ఆయన పరువు ప్రతిష్ఠలు కావాలి. నాకు సావిత్రి కావాలి.

నేను మూర్ఖంగా వెళ్ళినప్పటికీ ఆయన ముక్కు మూసుకుని ప్రాణం వదలగల సమర్థుడు. ఆడదానికోసం — స్వార్థంకోసం — తండ్రిని పొట్టన పెట్టుకున్నాడన్న అపప్రథ నాకు రాక మానదు. నా జీవితం నాశనమయిపోవటమే నాకిష్టం.

గిరుక్కున వెనక్కు తిరిగి ఇంట్లోకి వెళ్ళిపోయాను!

కాని ఆ రాత్రే ఇంకో గంట పోయాక ఈ పాడు ప్రపంచానికి దూరంగా వెళ్ళిపోయేందుకు బయల్దేరాను ఒంటరిగా. అన్నాళ్లపాటు ఎటు తిరిగానో, ఏం చేశానో నాకే తెలియదు.

సావిత్రి ఏమయిపోయిందో అంతకన్నా తెలియదు.

తరువాత మిలటరీలో చేరిపోయాను. మమ్మల్ని కాశ్మీరుకు పంపించారు.

నా అడ్రసుమట్టుకు తెలియనివ్వకుండా ఇంటికి అప్పుడప్పుడు ఉత్తరాలు రాసేవాడిని.

మూడేండ్లు యాంత్రిక జీవితం గడిపిన నాకు హఠాత్తుగా ఇంటిమీద గాలితిరిగి సెలవు పెట్టి బయల్దేరాను.

మనం పెద్దవాళ్లమయ్యామని అనుకున్నా మనం పెద్దవాళ్ళదృష్టిలో ఇంకా 'పసివెధవలు' గానే ఉండిపోతాం.

శేరు ఉప్పుతో స్వాగతం పలికింది అమ్మ. వళ్లంతా కళ్ళు చేసుకుని నా ఒంటిని తడుముతుంటే కండ్లలో నీళ్లు తిరిగాయి.

భోజనం చేస్తున్నాను. వచ్చినప్పటి నుంచీ ఒక విషయం అడుగుదామనుకున్నాను. గాని అది ఎలా అడగాలో తెలియక అడగటం జరగలేదు. చివరికి అమ్మే అంది—

"సావిత్రి ఇప్పుడు ఇక్కడే ఉంది తెలుసా" అని. నాలో నాకు తెలియకుండానే ఉక్రోషం కలిగి "మూడవ పురుడా" అనడిగాను హేళనగా.

సావిత్రి పెళ్ళయి మూడేళ్ళు దాటలా మరి!

"అతను పోయాడుగా" అంది అమ్మ. చేతిలో ముద్ద జారి విస్తట్లోపడిపోయింది.

"ఇప్పుడే? పెళ్ళయిన తరువాత మూడు నెలలు కాపరం చేసింది. అంతలోకే కారుకిందపడి చచ్చిపోయాడా అబ్బాయి. మూడేళ్ళమట్టీ ఇక్కడే వుంది... అయినా ఇప్పుడు మునుపటి సావిత్రి కాదులే!"

కంచంలో చేయి కడిగి లేచి పోయిన నన్ను చూసి తెల్లబోయి ఉంటుంది అమ్మ.

మనస్సు బావుండక బజారువెంట బయలుదేరాను. పరిచయస్తుల చిరునవ్వులతో, సన్నిహితుల పలకరింపులతో సాగిపోతున్న నేను అప్రయత్నంగా ఆగిపోయాను.

శిథిల గృహాన్ని— దాని గత వైభవం చూసి ఉన్నవారు— గుర్తు పట్టడం కష్టమే కాని అసంభవం మట్టుకు కాదు. చెట్టు మోడువారినా దాని వసంతం జ్ఞప్తికి రాకపోదు.

మంచున్నది సావిత్రి!

పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ సావిత్రి దగ్గరకు వెళ్ళాను. నన్ను చూసి తెల్లగా పాలిపోయింది సావిత్రి.

"సావిత్రీ" అన్నాను ఆవేశంతో.

"ష్. ఇప్పుడు కాదు. సాయంత్రం మామిడితోటలోకి రా" అంటు ఇంట్లోకి వెళ్ళిపోయింది.

సావిత్రిని చూడగానే గతం నా కళ్ళముందు కదిలింది. రాగంలో అపశ్రుతిలా సావిత్రి ప్రస్తుత రూపం స్ఫురణకొచ్చి నామనస్సు కలుక్కుమంది.

ఆ చలాకీతనం, సంతోషం ఏమయిపోయాయి? సావిత్రిని ఇలా చూడలేను. ఆమె జీవితంలోకి వసంతం తేవాలి ఆమెను మళ్ళీ మామూలు మనిషిని చేయటం నా కర్తవ్యం. దానికి ఒకే ఒక మార్గం!

"నేనేదో క్షణికోద్రేకానికి లోనై నిన్ను అడుగుతున్నాననుకోకు సావిత్రీ— బాగా ఆలోచించి ఈ నిర్ణయానికి వచ్చాను. ఆనాడు నిన్ను,



# భవదీయుడు-బంతిపూలు

నన్నూ విడదీశారు. ఈనాడు ఏ శక్తీ మనల్ని వేరు చేయలేదు'' అన్నాను సావిత్రితో ఆమర్షాడు. ముఖాన్ని చేతులతో కప్పుకుని నిశ్శబ్దంగా ఏడ్చింది! ఆశ్చర్యపోయాను.

''ఏమిటి సావిత్రీ– తప్పుందా నేనన్న మాటల్లో ?

''నేను నీకు తగను బావా! నన్ను మర్చిపో– నీ నిష్కల్మష హృదయాన్ని నన్ను గురించి కలుషితం చేసుకోకు'' అంది ఏడుస్తూ.

''అవేం మాటలు సావిత్రీ, నేను నీ కోసం త్యాగం చేస్తున్నానని– దానికి నువ్వు తగవనటువంటి పిచ్చి ఊహలు మనస్సులోకి రానీయకు. మాటిగా చెప్పాలంటే– నువ్వింకోలా అనుకోక పోతే– దేవుడు ఈ రకంగానైనా నిన్ను నాదాన్ని చేసుకొనే అవకాశం నాకిచ్చినందుకు పొంగిపోతున్నాను.

ఈ సంఘంతో నాకు నిమిత్తం లేదు. నాక్కావలసింది సావిత్రి– ఆ అమ్మాయికి ఇష్టం లేకపోయినా బలవంతానయినా రాక్షస వివాహం చేసుకుంటాను. అసలే మిలిటరీవాడిని తెలుసా!'' అన్నాను.

ఏడుపులోగూడా నవ్వేసింది. నీళ్ళ వెనక కళ్లు తళుక్కుమన్నాయి.

''నన్ను మర్చిపోలేవా ? '' అంది.

''ఊహు ! రేపు రాత్రి తొమ్మిదికి మన ప్రయాణం. నేరుగా కాశ్మీర్ తీసుకుపోతాను, కాశ్మీర్ సుందరి వవుదువుగాని.''

ఏదో నిర్ణయానికి వచ్చిన దానిలా నవ్వేసి ''రేపేనా ప్రయాణం'' అని వెళ్లిపోయింది.

తేలికపడ్డ హృదయంతో ఇంటికి వచ్చేశాను. మనస్సులో అంతులేని ఆనందం– ప్రపంచం అంతా నవ్వుల వెన్నెల్లో మునిగినట్టుంది నా కంటికి.

నిశ్చింతగా పడుకున్నాను. గడచిపోయే జీవితం, మారిపోయిన చిన్ననాటి సావిత్రిని మత్తుగా ఆలోచించుకుంటూ కన్నుమూశాను. లేచేసరికి మా అమ్మ కళ్లు ఒత్తుకుంటూంది.

''ఎందుకు ? '' అన్నాను.

''చూశావురా, సావిత్రి ఎంతపని చేసిందో'' అంది. నాకు నవ్వొచ్చింది. 'చెయ్యబోతోంది' అనాలి అనుకుని ''ఏం చేసింది? '' అన్నాను.

''మాతిలోపడి బలవంతంగా ప్రాణం తీసుకుంది ! ''

నిలువునా నామీద పిడుగుపడి నన్ను చీల్చుకుంటూ పోయింది. చెవుల్లో సముద్ర ఘోష. భూమి కదిలిపోయింది.

''అసలు తెల్లవారుజామున చూసుకుంటే కనబడలేదుట. వారా వీరా అని వెతుకుతే మాతిలో తేలుతోంది. పైగా పట్టుచీర, కణుం రవిక కట్టుకుని ముఖం నిండా పసుపురాసుకుని, పెద్ద బొట్టుతో– పెద్ద ముత్తయిదులా ఉంది... నవ్వాసికి నిండా ఇరవయన్నా లేవు దాని బతుకిలా తెల్లవారి పోయింది. '' ఏడుపు మొదలెట్టింది.

నేనేం చేశాను ? సావిత్రిని ఉద్ధరిద్దామనుకుని ఆమె మరణానికి కారకుడినయాను.

అసలు సావిత్రి అంత అఘాయిత్యం ఎందుకు చేసింది? పెళ్ళంటే ఇష్టం లేకనా ! ఆలోచించుకుంటూ వీధిన పడ్డాను – ఆఖరి దర్శనం చేసుకుందామని.

కాని అది దక్కలేదు.

ఎలా తెలిసిందో పోలీసులకు ఈ విషయం తెలిసి 'హత్యా, ఆత్మహత్యా' తేల్చేందుకని శవ పరీక్షకు పంపారు.

నా సావిత్రిని కత్తితో కోసేందుకు వీళ్ళకు అధికారం ఎవరిచ్చారు ? అని బాధపడ్డాను.

సాయంత్రానికి ఊరంతా ఒకటేమాట – సావిత్రి వట్టిమనిషికాదు కడుపుతో ఉందని. మూడవనెలట !

''నేను నీకు తగను బావా! నన్ను మర్చిపో'' అన్న మాటల అర్థం ఇప్పుడు తెలిసింది. ఏడుపుకు కారణం బోధపడింది. ''రేపే నా ప్రయాణం'' అన్నమాట వెనక ఎటువంటి నిర్ణయముందో అప్పట్లో తెలుసుకోలేకపోయాను.

అసలు సావిత్రి ఎందుకింత దిగజారి పోయింది ? దానికి కారకు లెవరు ? అన్నప్రశ్నలే నాలో కలుగలేదు.

కాని ''సావిత్రి నన్నెందుకింత అపార్థం చేసుకుంది ? నాకిమాత్రం విశాల హృదయం లేదనుకుంది ఎందువలన ? విధవగా స్వీకరించటానికి సిద్ధపడిన నేను ఈ స్థితిలో మాత్రం నిరాకరిస్తానని ఎందుకు అపోహ పడింది?'' అని బాధపడ్డాను.

ఆనాటి నుంచీ బంతిపూలమాట ఎత్తితే బావగారూ – అనాటి సావిత్రి జ్ఞప్తికివస్తుంది.''

శూన్యంలోకి చూస్తూ ముగించాడు చలపతి.

ఇద్దరం మౌనంగా ఇంటికి నడక సాగించాం.

సావిత్రి చేసినపని మంచిదా కాదా అన్న ధర్మ సందేహం కలిగింది నాకు.

చనిపోయిన గేదెకు పాడి బోలెడుట?

చనిపోయింది కాబట్టి చలపతి ఇలా అంటున్నాడు కాని నిజంగా చెప్పేఉంటే ఆమెను స్వీకరించేవాడా అంటే – ఏమో, ఏమో చెప్పలేం– అతను మిలిటరీవాడు !

# దారిలో ఎన్నో ఎగుళ్లు-దిగుళ్లు చూశారు మీరు.

## అందుకే మేము మీ కోసమే డిజైను చేశాం ఇదివరకు మీరెన్నడూ తొక్కనటువంటి అతిమెత్తగా, హాయిగా సాగిపోయే సైకిల్ క్రొత్త బిఎస్ఎ డీలక్స్



బిఎస్ఎ డీలక్స్ యొక్క సొగసైన సన్నటి బ్యారల్డ్ హబ్‌లు—ఇవి అత్యంత నాణ్యమైన, దృఢమైన కేస్ కప్స్ కలిగి సైకిల్ మెత్తగా, హాయిగా నడిచేలా చేస్తాయి.



ఎక్కువ సులభంగా తిరగడానికి వీలునిచ్చే చక్కటి గొట్టపు ఫోర్క్. దీనితో బిఎస్ఎ డీలక్స్ తొక్కడం నిజంగా సుఖకరం.



మీరు జీవితంలో ఎంతో పైకి వచ్చారు. ఎన్నో ఎగుళ్లు-దిగుళ్లను ఎదుర్కొని మరీ పైకి వచ్చారు. అందుకే మీకు కావాలి అత్యుత్తమమైనది.

అదే బిఎస్ఎ డీలక్స్. ప్రత్యేకంగా డిజైను చేయబడి అతి సులభంగా, హాయిగా తొక్కగలిగే సైకిల్. పనికి వెళ్లడానికి ఇదివరకు మీరెన్నడూ తొక్కనిది. మరి ఇపుడు దినమంతా పని శ్రమ తర్వాత-ఇంటికి వచ్చాక. ఇదివరకు ఎన్నో ఇతర సైకిళ్లు తొక్కి వుంటారు. కనుక వ్యత్యాసం స్పష్టంగా అనుభవించగలరు. పచ్చ మరియు నలుపు రంగులలో లభ్యం.

## కొత్త బిఎస్ఎ డీలక్స్— సఫలత-మార్గంలో మీకు సుఖకరమైన తోడు.

TI BSA Deluxe

Rediffusion-TI-1912 b TL

# వారఫలం

16–9–1983 శుక్రవారం మొదలు 22–9–1983 గురువారం వరకు

♈ మేషం: చాలదినాలుగా రాని ధనం ఈవారం అందటం జరుగుతుంది. నూతనవ్యవహారాలలో జోక్యం కలుగజేసికొంటారు. కోర్టు వ్యవహారాలలో మీకు అనుకూలత చేకూరగలదు. ప్రతిభ రాణించే అవకాశం ఉన్నది. స్త్రీలకు: ధన లబ్ధి, వ్యవహార విజయానికి అవకాశాలున్నాయి.

♉ వృషభం: కళా సాహితీ రంగాలలో మీ ప్రతిభ రాణిస్తుంది. అలవాటుగా జరిగే పనులందు ఆలస్యం జరుగుతుంది. మిత్ర సహాయం, బంధు సహాయానికి అవకాశమున్నది. సులభంగా ఒకానొక విషయంలో మేలు చేకూరే అవకాశమున్నది. స్త్రీలకు: సుఖశాంతులు, ధనాదాయం, ఉద్యోగావకాశాలు కూడా ఉంటాయి.

♊ మిథునం: అనవసరంగా యిబ్బందులలో చిక్కుకొంటారు, అవకాశవాదులు వెంటబడుతారు. సాహితీ రంగంలో సదవకాశాలున్నాయి. ఉద్యోగం లభించే అవకాశమున్నది. ప్రాకులాడండి. ప్రయత్నించండి. స్త్రీలకు: అన్ని విధాలా అనుకూల వాతావరణం ఉన్నది.

♋ కర్కాటకం: నూతన విషయాలు తెలిసికొంటారు. ప్రజారంగంలో పేరు ప్రతిష్ఠలు రాగలవు. బంధుజాలమో, మిత్రగణమో మేలు చేయగలదు. నూతనంగా వ్యాపారంప్రారంభించే అవకాశం కొంతవరకు చెప్పదగిన అంశం, జాయింటు వ్యాపారమయితే జాగ్రత్త. స్త్రీలకు: వస్తు వాహన సేకరణకు అనుకూలత గలదు.

♌ సింహం: మిత్రసహాయంవలన, ఉద్యోగుల సహాయం వలన కొన్నిపనులు సాధించుకోగలుగుతారు. రాజకీయంగా మేలు చేకూరే అవకాశమున్నది వ్యాపారం బాగాసాగుతుంది. గ్రహించి శ్రమించండి. భూములు ఏవైనా కొనుగోలు చేయగలరేమో ! చూచుకోండి. స్త్రీలకు: సర్వానుకూల వారం.

♍ కన్య: ఆదాయంలో ఏమాత్రం లోపం కనిపించదు. మాటకు విలువ పెరుగుతుంది. పదిమందిలో పేరు ప్రతిష్ఠలు సమకూడే అవకాశమున్నది. వ్యవసాయం అభివృద్ధి చేసికొనుటకు ధన లబ్ధి చేకూరుతుంది. స్త్రీలకు: వస్తు వాహన సేకరణకు, విద్యాభివృద్ధికి, నూతనాంశాలు తెలిసికొనుటకు అవకాశం గలవారం, గ్రహించండి.

♎ తుల: పేరు ప్రతిష్ఠలు అతిశయిస్తాయి. ఆదాయంలో అభివృద్ధి చేకూరుతుంది. అవసరాలు తీరేటంతటి ధనమైనా అందుతుంది. అప్పులు వసూలు కావటానికి యింకా కొంత కాలం పడుతుంది. అయినా ప్రయత్నించటం మానరుగదా! స్త్రీలకు: ఉద్యోగాభివృద్ధి, ఆదాయం గలవారం.

♏ వృశ్చికం: ధనలబ్ధి, ఉద్యోగం పెంపు, అధికారాభివృద్ధి, అవసరాలు తీరటం, బాహాటంగా వ్యాపారం సాగటం, గమనింపదగిన అంశం. ప్రజారంగంలో అధికారదరణకు అవకాశమున్నది. స్త్రీలకు: ఆకాశవాణి దూరదర్శనములందు కొందరకు అవకాశాలుంటాయి.

♐ ధనుస్సు: గ్రహించండి, వారమంతా అనుకూలదాయకం. నూతనాంశాలు గ్రహిస్తారు. నూతనమిత్ర సహాయం చెప్పదగిన అంశం. ప్రజాసేవయందు, చాలమంది నిమగ్నులు కానున్నారు. దూర ప్రాంతాలకు, ప్రయాణించటం, నూతన మిత్రసంపర్కం, వ్యాపారంలో అభివృద్ధి కనిపిస్తుంది. స్త్రీలకు: అభివృద్ధి గల వారమే.

♑ మకరం: వాయాదుల వలననో మిత్ర వర్గీయుల వలననో అనుకూలత, అభివృద్ధి, ధనాదాయం చేకూరగల అంశం. పెద్దల అభిమానం చూరగొనటానికి అవకాశమున్నది. స్తోత్ర ప్రియులను దాపునకు చేర్చకండి. స్త్రీలకు: వృత్తి ఉద్యోగాలందు అభివృద్ధికరమైన వారం.

♒ కుంభం: ఏవేవో గొడవలలో చాలమంది నిమగ్నులవుతారు. చాలమందికి ఉద్యోగ ప్రయత్నాలు సాగుతాయి. కొందరకు సభా కార్యక్రమంలో అవకాశం కలుగజేసికో వలసిన అవకాశం ఏర్పడుతుంది. వృత్తియందు సదవకాశాలు లభిస్తాయి. స్త్రీలకు: వస్త్ర సేకరణ, బంధు సమాగమం, భూవసతి ఏర్పడుటకు అవకాశం లభిస్తుంది.

♓ మీనం: ఆదాయం రాలేదనే తాపత్రయం, అప్పులు వసూలు కాలేదనే బెంగఅనవసరం. ఇంకా కాలం కలిసి రాక పోవటంతో అలాగనిపిస్తుంది. వ్యవహారం ఏదైనా ఉంటే మీకు అనుకూలంగా నెరవేరుతుంది. ప్రతిష్ఠ ఏ విధంగా తగ్గదు స్త్రీలకు: ధనధాన్య సేకరణకు, వాహనం లభించుటకు, ఉన్నత విద్యార్జనకు చాలమందికి అనుకూలం, గ్రహించండి.

23-9-1983 శుక్రవారం మొదలు 29-9-1983 గురువారం వరకు

♈ మేషం: [illegible]నానికి కొరత లేదు. ప్రజా[illegible]ంలో పేరుప్ర[illegible]డనున్నాయి. సన్మాన సత్కారాలకు కొం[illegible]కాశమున్నది. భూ సంపద [illegible] నంద గలుగ[illegible] వస్తువులు [illegible] టకు, వ్యాపారం అభివృద్ధి నందించుకొనుటకు మంచి సమయం. స్త్రీలకు: [illegible]. వృత్తియందు [illegible].

♉ వృషభం: [illegible]. అవకాశవాదుల, స్తోత్రప్రియులను మాత్రం దరి చేర్చకండి. [illegible]ల వలన చేతల వలన మీకు మేలు చేకూరుతుంది. వ్యాపారంలో ఎలాంటి యిబ్బందులు చేకూరవు. ప్రతిభ రాణించగల అవకాశాలుంటాయి. స్త్రీలకు: ఆదరణకు, బంధు ప్రీతి [illegible] లోపముండదు. ఉద్యోగం కొందరు సంపాదించుకో గలుగుతారు.

♊ మిథునం: ఆదాయమున్న[illegible] అధికారుల [illegible]కు అనుకూలం, తప్పు చేసి ద[illegible]కోవటానికి అవకాశం, కళా సాహితీ రంగాలలో అభివృద్ధి, పెద్దల మూలాన జరుగవలసిన పనులు సుకరంగా నెరవేరుటం గమనించ దగిన అంశాలు. స్త్రీలకు: ఉద్యోగం కోరి శ్రమించేవారికి, మేలు చేకూరగలదు, అనుకోకుండా ట్రాన్స్ఫరు లభించటం వెను[illegible]శాలు.

♋ కర్కాటకం: అభివృద్ధి కార్యక్రమం కొనసాగుతుంది. వ్యాపారంలో కూడా యిబ్బందులు లేకుండా లాభదాయకం. మాటల వలన, [illegible]శ్రమ వలన నిశ్చయించిన కార్యక్రమం సుకరంగా కొనసాగుతుంది. చాలమందికి యత్నించిన ఉద్యోగానుకూలత చేకూరే మార్గమున్నది. నిశ్చయంగా శుభ కార్యాలోచనలకు అవకాశమున్నది. స్త్రీలకు: ఇబ్బంది రోజులు తొలగిపోవుట గ్రహిస్తారు.

♌ సింహం: ధనలోపం గాని, వస్తు సేకరణలో గాని లోపంగాని సమకూరుటకు అవకాశం [illegible]. నాలుగు విధాలా మేలు, ధనలబ్ధి చేకూరుటయందు ఆక్షేపణ లేదు. స్త్రీలకు: ఉద్యోగప్రయత్నాలు ఫలిస్తాయి. మాట చమత్కారం మూలాన మీకు ఒకానొక గృహ విషయంలో అనుకూలత చేకూరుతుంది.

♍ కన్య: న్యాయస్థానం సంబంధించిఏదైనా 'కేసు' లుంటే, ఈవారం లాభదాయకంగా నెరవేరగలవు. ఏమయినా అవకాశవాదులను దరిచేర్చకండి. కళా సాహితీ రంగాలలో సదవకాశాలు లభిస్తాయి. స్త్రీలకు: నూతనాంశాలు తెలిసికోవటం, బంధు మూలకంగా మేలు చేకూరుతుంది.

♎ తుల: అనేక విధాల మేలు చేకూరుతుందని ఆశించవారేగాని ఏ విధంగా మేలు చేకూరదు. ధన విషయంలో కూడా యిబ్బందులుంటాయి. అప్పులు వసూలు కాక యిబ్బందులూ రానున్నవి. స్త్రీలకు: నూతనావకాశాలు, ధనాదాయం.

♏ వృశ్చికం: ప్రతి పనిలో మేలు కన్పించినట్లే కనిపిస్తుంది, కాని ప్రయోజనం శూన్యం. సాహితీ రంగాన అవకాశం చిక్కిన ట్లే చిక్కి జారిపోతుంది. అయినా శ్రమించటం మానకో రాదు. విద్యార్థులకు సదవకాశాలు లభిస్తాయి. శ్రమతో ఒకానొక గృహకార్య వ్యవహారం మీకు అనుకూలంగా నెరవేరుతుంది. స్త్రీలకు: నగల సేకరణకు, విద్యాభి వృద్ధికి, అవకాశమున్నది.

♐ ధనుస్సు: మీ ప్రజ్ఞ రాణించటం మీ వ్యాపారం అభివృద్ధి చెందుటకు మార్గాలు, మీ యింట శుభ కార్యం జరుగుటకు అవకాశాలు, క్రయ విక్రయానుకూలత ఏర్పడితీరుతుంది. నూతనవస్తు సేకరణకు చాలమందికి సదవకాశాలున్నాయి. స్త్రీలకు: అపూర్వ వస్తు సేకరణావకాశం.

♑ మకరం: గ్రహించండి. చాల మేలైన వారం, [illegible] లబ్ధి, కార్యానుకూలత, ఉద్యోగ లబ్ధి, బంధువులకు ఉపకారం చేయుటకు అవకాశాలు లభిస్తాయి. వ్యాపార రంగంలో అభివృద్ధి కనిపించి తీరుతుంది. స్త్రీలకు: వారమంతా యోగదాయకం. ఆశించిన అనుకూలత అన్ని రంగాలలో సిద్ధించే మార్గమున్నది.

♒ కుంభం: ఎంతగా శ్రమిస్తే అంత మేలు. 'అదృష్ట దేవత దాపునకు వచ్చిందా' అనిపిస్తుంది. చాలమందికి దూర ప్రాంతాలకు ప్రయాణం చెప్ప వీలున్నది. కోరి ఒకానొక విషయంలో యిబ్బంది తెచ్చికొంటారు. స్త్రీలకు: దూర బంధువుల నుండి శుభ వర్తమానం, నూతనాంశాలు తెలిసి కోవటం జరుగుతుంది.

♓ మీనం: ఆదాయానికి లోపంలేదు. సదవకాశాలకు లోపం లేదు గాని, విపరీతమైన ఖర్చు నుఎదుర్కొన వలసిన వారం. అందుచేత ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మంచిది. వ్యాపారంలో పెద్దగా అనుకూల ప్రతికూల మార్పులు చెప్పవీలులేదు. స్త్రీలకు: బంధు వర్గియుల వలన మేలు సమకూడుతుంది. చాలమంది చేసిన ఉద్యోగ ప్రయత్నాలు సమకూరుతవి. శుభ వర్తమానం వింటారు కూడా.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి.

# వ్యక్తిగతం

ఇంగ్లీషువారు దీనికి ఎవరెస్టు అని పేరు పెట్టారు. 1953లో ఇద్దరు దానిని ఎక్కి [illegible] అది ఆ సంవత్సరం బ్రిటన్ సింహాసనం అధిష్ఠి[illegible] ఎలిజబెత్ రాణికి 'కానుక' అన్నారు. ఎక్కినవారిలో టెన్సింగ్ నార్కే ఒకరు (కొందరు నార్గే అంటున్నారు!) ఇటీవల ఆయన న్యూఢిల్లీలో జరిగిన ఇండియన్ మౌంటెనీరింగ్ ఫౌండేషన్ సంస్థ రజతోత్సవాలకి వచ్చారు. అక్కడ కూడా టెన్సింగ్ నార్కే ఎప్పటిలాగే ఎంతో వినయంగా ప్రవర్తించారు. ఆయన ప్రస్తుతం పర్వతారోహణ సంస్థకి సలహాదారుగా ఉంటున్నారు ...

ఆనలోలిసిసరెంకో ఎత్తు 6 అడుగుల 1 అంగుళం. బరువు 270 పౌనులు లేదా 122.5 కిలో గ్రాములు. [illegible]వు ఎత్తటంలో "ప్రపంచ రికార్డులు" సృష్టించాడు. సాధారణంగా బరువులు ఎత్తేవారు చాలా భారీగా ఉంటారు. ఈయన వారి స్థాయిని బట్టి సన్నటి మనిషే! సిసరెంకో భార్య పేరు వాలెంతినా. ఇద్దరూ 1వ క్లాసు నుంచీ కలిసి చదువుకున్నారుట! వీరిద్దరిదీ రష్యా అని వేరే చెప్పనవసరం లేదు ...

నైజీరియా ప్రపంచంలోని ప్రజాస్వామ్యాలలో నాలుగోదిగ పేరు పొందింది — భారత దేశం, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, జపాన్ల తరువాత. ఇక్కడ ఇటీవలే జరిగిన ఎన్నికలలో గెలిచిన అధ్యక్షుడు షెహు షగారీ వయసు 58. ఈయన మహమ్మదీయుడు. పాశ్చాత్యదేశాలతో సంబంధాలు పెంపొందించుకోవాలని కోరేవారిలో ఒకరు ...

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## గవర్నర్ శ్రీ అబ్రహాంకు వీడ్కోలు

ఆగస్టు 12 న పదవీ విరమణ చేసిన రాష్ట్ర గవర్నరు శ్రీ కె. సి. అబ్రహాంకు రాష్ట్ర ప్రభుత్వం ఆప్యాయతతో వీడ్కోలు ఇచ్చింది. ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు గవర్నర్ రాష్ట్ర ప్రభుత్వానికి చేసిన అమూల్య సేవను ప్రశంసిస్తూ, శ్రీ అబ్రహాం పార్టీ విభేదాలుగాని, రాజకీయ సిద్ధాంతాల పక్షపాతం గాని లేక, క్లిష్ట సమయాలలో రాష్ట్ర ప్రభుత్వానికి ఐదేళ్లపాటు మార్గదర్శకులుగా వున్నారని అన్నారు. గవర్నర్ తన వయోభారాన్ని కూడా లెక్క చేయకుండా, రాజ్యాంగరీత్యా తన పెద్దరికాన్ని, విధులను సక్రమంగా, సమర్థంగా నిర్వహించారని, తన పదవీ కాలంలో ఆయన వివిధ మనస్తత్వాలు గల ఐదుగురు ముఖ్యమంత్రులతో కలిసి పనిచేయవలసివచ్చినా, విధి నిర్వహణలో చాల జాగరూకతతో వ్యవహరించాలని ముఖ్యమంత్రి అన్నారు. గవర్నర్ కృతజ్ఞత తెలుపుతూ, అయిదేళ్ల తన ఆంధ్ర ప్రదేశ్ సేవలో ఎన్నో మధురానుభూతులు పొందానని, తెలుగు ప్రజల విజయాల మధురానుభూతితో స్వస్థలానికి తిరిగివెళ్లుతున్నానని అన్నారు. ముఖ్యమంత్రి శ్రీ రామారావు ఘన విజయాలు సాధించారని గవర్నర్ ప్రశంసిస్తూ, ఆయన మరెన్నో విజయాలు సాధించి, ఆంధ్ర ప్రదేశ్‌ను ఆర్థిక అభివృద్ధి పథంలో నడిపించ గలరని విశ్వసిస్తున్నానని అన్నారు.

## ఎన్. టి. ఆర్. తొలి స్వాతంత్ర్యదినోత్సవ సందేశం

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు ఆగస్టు 15 స్వాతంత్ర్యదినోత్సవం సందర్భంగా పెరేడ్ మైదానంలో జాతీయ పతాకావిష్కరణ అనంతరం సైనిక వందనం స్వీకరించారు. పోలీసు దళాల పెరేడు వెనుక ప్రభుత్వ శాఖలు తాము సాధించిన ప్రగతిని వివరిస్తూ అలంకృత శకటాలను ప్రదర్శించాయి. తెలుగు గంగ పథకంపై రాష్ట్ర సమాచారశాఖ ప్రదర్శించిన అలంకృత శకటం ప్రజల దృష్టిని విశేషంగా ఆకర్షించింది. పిదప ముఖ్యమంత్రి రాష్ట్రపతి పోలీసు పతకాలను, తరితర బహుమతులను పంచి పెట్టారు. పతాకావిష్కరణానంతరం ఆయన ప్రసంగిస్తూ, తన శేష జీవితాన్ని తెలుగు తల్లి సేవకు, తెలుగు ప్రజల సేవకు అంకితం చేస్తున్నానని అన్నారు. ఆరుకోట్ల తెలుగు ప్రజలు కలిసికట్టుగా పనిచేస్తే సాధించరానిదేమీ లేదని ఆయన నొక్కి చెప్పారు.

స్వాతంత్ర్య దినోత్సవంనాడు సికింద్రాబాదులోని పెరేడ్ మైదానంలో సైనిక వందనస్వీకారం చేస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు (ఫొటో: శ్రీధర్)



## ప్రవాసాంధ్రుల ఆసక్తి:

దేశ, రాష్ట్ర పరిశ్రమాభివృద్ధికి విదేశీ మారకద్రవ్యం చాల అవసరం. పెట్టుబడులు తగినన్ని లేనందువల్ల, ముఖ్యంగా విదేశీ మారక ద్రవ్యపు పెట్టుబడి కొరతవల్ల మన ఆర్థికాభివృద్ధి దెబ్బ తింటున్నది. విదేశంలోని భారతీయుల, తెలుగువారి పెట్టుబడులవల్ల ఈ కొరత తీరుతుంది. అందువల్ల రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్ర పరిశ్రమ ప్రగతికి విదేశీ పెట్టుబడులను పెద్ద యెత్తున ప్రోత్సహించాలి. ఏతదనుగుణంగా అమెరికాలోని ఆంధ్రశాస్త్రవేత్తలు తమ సంపదతో ఆంధ్రప్రదేశ్‌లో భారీ పరిశ్రమలు స్థాపించడానికి ఉత్సాహపడుతున్నారని తెలుస్తున్నది. కొందరు శాస్త్రవేత్తలు ఇటీవల ముఖ్యమంత్రిని కలుసుకొని తమకు తగిన ప్రోత్సాహం, రక్షణ కలిగిస్తే రాష్ట్రంలో పరిశ్రమలకు పెట్టుబడి పెట్టడానికి సంసిద్ధత తెలియజేశారని తెలిసింది. అమెరికాలోని వాషింగ్టన్, న్యూయార్క్, చికాగో, పిట్స్‌బర్గ్ లాస్ ఏంజిల్స్ మున్నగు నగరాలలోని ఆంధ్ర శాస్త్రవేత్తలు ఆంధ్రప్రదేశ్‌లో పెక్కు భారీ పరిశ్రమలు నెలకొల్పడానికి సిద్ధంగా వున్నారు. ప్రభుత్వం తగు సదుపాయాలు కల్పించాలి. తెలుగుదేశం ప్రభుత్వం విధానమిదేనని ముఖ్యమంత్రి ఆగస్టు 16వ విధాన పరిషత్తులో తెలియజేశారు. రాష్ట్ర సంక్షేమాభివృద్ధులకు విదేశాలలోని తెలుగువారి పెట్టుబడులను వినియోగించుకోడం తప్పుకాదని ముఖ్యమంత్రి అన్నారు. ఈ దృష్టితోనే మంగళగిరి స్టెయిన్లెస్ ట్యూబుల ఫ్యాక్టరీకి అమెరికాలోని తెలుగువారయిన శ్రీ శ్యాంవర్మను కో–ప్రమోటర్‌గా చేశామని ముఖ్యమంత్రి అన్నారు.

## ఉపశ్రుతి:

ఏమిట్రోయ్ అప్పుడే ఎలా వచ్చేశావ్ లాకప్ నుంచి ?— అని అడిగాడు ఒక మాజీ ఖైదీ మరొక ఖైదీని. ఏముంది ! పోలీసు జేబులో తాళంచేతులు కొట్టేశాను. తాళం తీశేశాను. ఒకే పరుగు !— అన్నాడు రెండవ ఖైదీ. విడ్డూరంగా మాట్లాడుతావేంరా ?— అన్నాడు మొదటివాడు. పోలీసు కస్టడీలో బేడీలతోవున్న దాశరథిగారిని ఒక అమ్మాయి కావలా పోలీసు జేబులో నుంచి బేడీల తాళాలు కొట్టేసి బేడీలు తీసినప్పుడు గొప్ప చేయివాటం వున్న మనలాంటోళ్లు తాళం చేతులు కొట్టేయడం విడ్డూరమేమిట్రా ?— అని ఎదురు ప్రశ్న వేశాడు రెండవ వాడు. ●

# "ఈ రోజుల్లో జీవితకాలం మన్నికగల బహుమతి దొరకడమే కష్టంగా ఉంది"




"ఉషాకు నా కృతజ్ఞతలు"

మీ వివాహపు మొదటి వార్షికోత్సవాన్ని కలిసి జరుపుకునేటప్పుడు మీ భార్యకు. పెండ్లి కాబోతున్న కూతురుకు. హాయిగా వృద్ధాప్యాన్ని ఆహ్వానిస్తున్న అమ్మకు లేదా మీకు ప్రాణప్రదంగా అభిమానించే సోదరికి.

జీవితకాలం మన్నికగలది; నిజంగా ఉపయోగపడేది, అవవారికి నిజంగా అవసరమైనది, ఆమెలో ఉన్న ఉత్తమ శక్తి సామర్థ్యాలు వ్యక్తమయ్యేందుకు అవకాశమిచ్చేది ఒక మంచి బహుమతిని ఎంపిక చేయడం చాలా కష్టం.

ఇది కష్టమైన పనే. కాని అసాధ్యం కాదు ఉషాను ఎంచుకుని చూడండి




అద్భుతమైన నాణ్యతకు ప్రతీక




ఉషా నం 1 అయినది
ఎందుచేతనంటే దాని అద్భుతమైన నాణ్యతను అందరూ మెచ్చుకుంటారు.

ULKA D-US-712

*Printed and Published by S. Nageswara Rao at The Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.*

## ఉత్తరాలు

[ 4వ పేజీ తరువాయి]

### అతడు అడవిని జయించాడు

డా॥ కేశవరెడ్డిగారి 'అతడు అడవిని జయించాడు' నవల ఒక మాటలో పాఠకుడనే పాంధునికి యడారిలో ఒయాసిస్సు లాంటింది రెండవ మాటలో నవలాకాశంలో ధ్రువతార లాంటిది. మూడవ మాటలో నవల అనే పదానికి గీటురాయి వంటిది

యం. తిరుమలనారాయణరెడ్డి (ద్రోణాచలం)

### పండితుని కష్టం పండితునికే....

శ్రీ రెడ్డిగారి 'అతడు అడవిని జయించాడు' సీరియల్ నవలపై శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మగారి అభిప్రాయం చదివి ముగ్ధుణ్ణయ్యాను. రచన ఎంత బాగా ఉన్నప్పటికీ, 'ఆ ఏదో ఒక మాదిరిగా ఉంది !' అనో, 'ఫరవాలేదు!' అనో సెలవిచ్చే హేమాహేమీలు ఉన్న ఈ రోజుల్లో, శర్మగారు తమ అభిప్రాయాన్ని అద్భుతంగా వెలిబుచ్చారు. పండితుని కష్టం పండితునికే తెలుస్తుంది అన్నట్లుగా, సాటి రచయిత పడిన శ్రమ, చూపిన ప్రతిభ శర్మగారు గుర్తించారు. శర్మగారి గొప్పతనం, మంచితనం అనేకసార్లు విన్నాను. ఇప్పుడు ప్రత్యక్షంగా చూశాను.

ఇంత మంచి నవలను పాఠకులకు అందించిన మీకు, శర్మగారికీ, వారి ప్రశంసలు చూరగొన్న రెడ్డిగారికీ నా అభినందనలు ! తమ జాబు చివర్లో శ్రీ శర్మగారు తగిలించిన చురకలు ...!

కొడిమెల శ్రీరామమూర్తి (ఏలూరు)

### సీరియల్

"మూగముత్యాలు" రచయిత్రి యలమంచిలి ఝాన్సీలక్ష్మిగారి సీరియల్ నవల ప్రారంభములోనే మమ్ములను ఆకట్టుకుంది. చదివే దానికి చాల ఇంపుగా ఉన్నది. ఇందు డబ్బు మనిషిని ఎంత వరకైన దిగజారుస్తుందని నేటి సమాజంలో జరిగే వరకట్నము అనే పిశాచిని తొలగించే దానికి చాల ఉపయోగపడుతుంది

లాన్స్‌నాయక్ శీలం హరినారాయణరెడ్డి,
కేరాఫ్ 56 ఎ. పి. ఓ.

### నృత్య పోటీలు

చిత్తూరు జూపిటర్ బాలానంద సంఘ ఆధ్వర్యంలో నవంబరు 4 నుండి రాష్ట్ర స్థాయిలో కూచిపూడి నృత్యం, భరతనాట్యం, జానపద నృత్యపోటీలు జరుగుతాయి.

నృత్యపోటీలు సీనియర్లకు వయస్సు [12-18] జూనియర్లకు [6-10] వేర్వేరుగా నిర్వహిస్తారు. బాలురు, బాలికలు పోటీలో పాల్గొన వచ్చు. వివరములకు : శ్రీ పి. పురుషోత్తం, అధ్యక్షుడు, జూపిటర్ బాలానంద సంఘం, చిత్తూరు

అమృతాంజన్
లిమిటెడ్‌వారి
విశిష్టమైన

ఆముదము

శుద్ధిచేసినది.
వాసనలేనిది.

అమృతాంజన్ ఆముదము
సుప్రసిద్ధ అమృతాంజన్ కంపెనీ వారి
మరో విశిష్టమైన ఉత్పత్తి.

అమృతాంజన్ ఆముదము






మూడు
సైజులలో
లభిస్తుంది:
50 మిలి
100 మిలి
200 మిలి